

# మీ ఇంటికి ఇదిగో
# వెలుగును మించిన అద్భుతం





మీ అవసరాలన్నింటినో తీర్చే ఒకే ఒక్క పేరు. మీ ఇంట్లో అవసరమైన ఫాన్లు(సీలింగు మరియు టేబులు),గృహోపకరమైన మిక్సీలు, ట్యూబ్‌లైట్లు, బల్బులు, ఎలక్ట్రిక్ ఇస్త్రీ పెట్టెలు, వాటర్ ఫిల్టర్లు, వాషింగ్ మెషిన్లు, వాటర్ హీటర్లు, ఎలెక్ట్రానిక్ చోక్స్, స్టెబిలైజర్లు.

గాడ్జెట్స్- ఏవికావాలన్నా మీరు గుర్తుంచుకోవలసిన పేరు ఎ.పి.లైటింగ్స్. శ్రమ తక్కువగల సుఖమయజీవితం మీదవుతుంది. సమయం వృధాకాదు. మీ అవసరాలకు దేనిని ఎంచుకోవాలనే ఆలోచన రాగానే ఎ.పి.లైటింగ్స్‌ను గుర్తుంచుకోండి. మన్నిక గల గృహోపకరణాలకు పెట్టిందిపేరు ఎ.పి. లైటింగ్స్.

ఎ.పి.లైటింగ్స్.... వెలుగును మించిన అద్భుతం. మీ అవసరాలను మేం తీరుస్తాం.




IS: 418
ISI
CM/L-1699377

**ఆంధ్రప్రదేశ్ లైటింగ్స్ లిమిటెడ్**
రిజిష్టర్డ్ ఆఫీస్: 3-6-236/1, ఫస్ట్‌ఫ్లోర్,
హిమయత్‌నగర్, హైదరాబాద్-500 029
ఫోన్ : 242997, 242048. Telex: 0811-210-APL-IN

ఈ పేరేవస్తుసముదాయానికిమరోపేరు

దివ్య

10-8-90 ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రంపై "దివ్య" ఆ వారం పత్రికకే దివ్య మంగళకరంగా ఉంది అని నేను అనడంలో **అతిశయోక్తి** లేదు.

పెయ్యేటి చాముండేశ్వరి
ఒంగోలు

## మీ జి. కె. ఎంత? శీర్షిక ఉండాలి

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ఈ మధ్య చాలా అందంగా అలంకరించి మాకందిస్తున్న మీకు మా

# వీక్లీ పోస్ట్

"ధన్యవాదాలు". ముఖ్యంగా ప్రకటనలు తగ్గించాలని విజ్ఞప్తి.

పత్రిక 83వ పుట్టిన రోజు సందర్భంగా మీకు (పత్రిక కొరకు పాటుపడు వారందరికి) మా శుభాకాంక్షలు.

తాజాకాలమ్, సంపాదకీయం చాలా బాగుంటున్నాయి. "మీ జి. కె. ఎంత?" శీర్షికను తిరిగి ప్రచురించాలని కోరుచున్నాము.

—జె. శేఖర్, యమ్మిగనూర్

(74 వ పేజీ చూడండి)



## పదండి లోపలికి

ముఖచిత్రం :
జయప్రద
(ఫొటో : సి. హెచ్. రామకృష్ణ)

## ఈ వారం ప్రత్యేకం:



పై వారం:
**గిన్నిస్ బుక్ అవార్డు సాధించిన భారతీయుడు**




ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబునకగు దా నొరులకునవి సేయకునికి పరాయణము పరమధర్మపథములకెల్లన్

THE ANDHRA PATRIKA
GROUP OF
MAGAZINES

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

సంపుటము 83 సంచిక 2

31-8-1990

విడి ప్రతి వెల నాలుగు రూపాయలు

శక సం.1912 భాద్రపద మాసం 9వ తేదీ

EDITOR
VEERA
M. MADHAVA R

ASSOCIATE EDITOR
POTLURI VENKATA RA
Dr GUMMANURU RAMESH BABU

SUB-EDITORS:
P PRAMEELA
K S B TILAK
BHISETTY LAXMANA RAO

ARTISTS:
KASI
CHALAM

PRODUCTION & ADMINISTRATIVE MANAGER
M THYAGARAJ

CIRCULATION MANAGER
S APPADORAI

ADVERTISEMENT MANAGER:
A NANDAKUMAR

Printed and Published by
Nageswara Rao Estates Ltd,
at the
Andhra Patrika Press, Gandhinagar,
Vijayawada-520 003,
Editor VEERAJI
Phones Business 61247, 61248,
Editorial. 75667

## ఇంగ్లీషు-హిందీల మధ్య "భాషా" తెందుకు?

ఇవాళ మనదేశంలో ఉద్యమాలకేం కొదవలేదు - ఏ చిన్న సాకు దొరికినా నినాదాలు చేస్తూ రోడ్ల మీద పడి ప్రదర్శనలు చేయడానికి జనాలు లభించే విధంగా యీ దేశంలో రాజకీయ పార్టీలు ఒక కొత్త వ్యవస్థను తయారు చేసి పెట్టుకున్నాయి. ఉద్యమాలలో కొన్ని సందర్భ శుద్ధిలేనివి - కేవలం ఆయా రాజకీయ పక్షాలు - ప్రజల నాలికల మీద తమ పార్టీ పేరు ప్రఖ్యాతులు సన్నగిల్లిపోతున్నాయి అనుకున్నప్పుడు చేపడుతూ వుంటాయి కాని కొంత కాలంగా - ఉత్తరాది రాష్ట్రాలలో ముఖ్యంగా ఉత్తరప్రదేశ్, బీహార్, రాజస్థాన్, హిమాచల్ ప్రదేశ్‌ల ముఖ్యమంత్రులు తమ రాష్ట్రాలల్లో - హిందీ ఉద్యమం వొకదానిని - బొత్తిగా దూరాలోచన లేకుండా - లేవదీశారు. ఈ రాష్ట్రాల ముఖ్యమంత్రులు నలుగురూ ఇండోర్‌లో సమావేశమై కూడబలుక్కున్నారు. "అంగ్రేజీ హటావో" ఉద్యమం వీరి ఆశీస్సులతోనే ఉగ్రరూపం కూడా దాల్చుతున్నది - హిందుస్తానీ దేశాలుగా. ఉత్తరాది రాష్ట్రాలను మనం భాగించినట్లయితే - మరాఠీ, గుజరాతీ, రాజస్తానీ కొంత వరకు బెంగాలీ దేశాలలో - చాలా మేరకి ఒరియా రాష్ట్రంలోను కూడా 'హిందీ' భాష అపభ్రంశంగానే అయినా "లింకు" భాషగా ఆది నుంచీ చెలామణీ అవుతూనే వున్నది. అక్కడ ఆంగ్లేయుల "భాష" స్థానంలో స్థానికులు, ప్రజలు కావాలనుకుంటే అధికార భాషగా క్రమేపీ హిందీనే వాడుకోవచ్చును. దాని కోసం వీధిన పడనక్కర లేదు. కేంద్రప్రభుత్వ వ్యవహారాలన్నీ 'హిందీ'లోనే సాగాలి అంటూ తారు డబ్బాలు పట్టుకుని యింగ్లీషు అక్షరాలను చెరిపేస్తూ పోనక్కర లేదు - దీని కోసం ముఖ్యమంత్రుల 'కుట్ర' కూడా అక్కర లేదు.

ఉత్తరాదిన హిందీ అనుసంధాన భాషగా పెరిగినట్లుగా దక్షిణాదిన యింగ్లీషు లింకు భాషగా మొదటి నుంచి రాణిస్తూ వున్నది. భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా "మద్రాసు ఉమ్మడి రాష్ట్రంలోని భాషా రాష్ట్రాలు విడిపోయిన తరువాత యింగ్లీషు భాష పాత్ర - దక్షిణాది రాష్ట్రాల మధ్య "పూసలలో దారం" లాగ - మరింతగా అల్లుకుపోయింది - హిందీ భాషను బలవంతంగా దక్షిణ ప్రాంతవాసుల మీద రుద్ది - "భాషా జులుం" చేయనద్దన్న హెచ్చరిక నెహ్రూజీ కాలంలోనే స్పష్టంగా వినపడటంతో - మన తొలి ప్రధాన మంత్రి - హిందీని యింగ్లీషుని అవసరమైనంత కాలం - ప్రజలు కావాలి అనుకున్నంత కాలం అధికార భాషలుగా కొనసాగిస్తామన్న హామీని అమలు చేశారు. ఇంగ్లీష్ వారిని -వారి పరిపాలననూ పొమ్మన్నామే కాని - యింగ్లీష్ భాషను పొమ్మని కాని "వద్దు" అని కాని భారతీయులు యేనాడూ అనలేదు. పోగా హిందీ భాషావాదుల దాష్టీకం పెచ్చరిల్లడంతో యింగ్లీషు మీద మోజు మరింత పెరిగింది. ఇవాళ దేశవ్యాప్తంగా అటు కలకత్తా యిటు బొంబాయి నగరాల దాకా హైదరాబాద్, ఢిల్లీ నగరాల మధ్య ప్రాంతాలలో నీటి వసతి లేని మారుమూల ప్రాంతంలో కూడా ఏది వున్నా లేక పోయినా యింగ్లీష్ మీడియం పాఠశాల మాత్రం వుండి తీరుతుంది - కొన్ని లక్షల మందికి యింగ్లీష్ మీడియం పాఠశాలలు ఉపాధిని సంతృప్తిని కలిగిస్తున్నాయి - ఇంగ్లీష్ మీడియం స్కూలు పట్ల పెరుగుతున్న మోజుకి కారణాలు విశ్లేషించటం యిక్కడ సబబు కాదు. కేవలం అనుసంధాన భాషగా అందరికీ యిష్టమైన భాషగా యింగ్లీష్ కున్న ప్రాచుర్యాన్ని చెప్పడం కోసమే యీ విషయం ప్రస్తావించాము. రాజ్యాంగం యింగ్లీష్‌కు యిచ్చిన అధికార భాష హోదా కూడా యివాళ యితర హామీలకు మల్లే - అవసరమనుకున్నంత కాలం కొనసాగాలి! ఆంగ్లేయుల సంస్కృతీ సంప్రదాయాలను గాక - మన దేశ సంస్కృతీ సంప్రదాయాలనే మనం వాడుకుంటున్న యింగ్లీష్ బాష పెంచి పోషించి - భాషలు అడ్డుగా నిలిచి వున్న వేర్వేరు ప్రాంతాల మధ్య చక్కగా "వంచి" వెడుతున్నది. ఈ దేశాన్ని పరిపాలించిన వారి భాష "ఇంగ్లీష్" కావచ్చును కాని యిప్పుడు మనం ఉపయోగించుకుంటున్న యింగ్లీష్ భాష ఒక "యిండియన్ లాంగ్వేజీయే!" దీన్ని "యింగ్లీష్" అని గాక "ఇండిష్"గా వ్యవహరించాలని సాహితీవేత్తలెప్పుడో అన్నారు.

ఉత్తరాది రాష్ట్రాల నాయకుల హిందీ వ్యామోహం - దాని వ్యాప్తికి దోహదించాలి. కాని ప్రస్తుతం వారు సంకల్పించిన ఆందోళన అందుకు భిన్నంగా వుంది. దక్షిణాదిన ముఖ్యంగా తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో దీనికి ప్రతిధ్వనులు తీవ్రంగా వినపడుతున్నాయి. కేంద్రం, దక్షిణాది రాష్ట్రాలకు హిందీలో తప్ప మరో భాషలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపదు అన్నట్లయితే - ఆ ఉత్తరాలకు మేము తమిళంలోనే జవాబులు యిస్తాము అని తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి అన్నారూ, అంటే యీ భాషా వాదం యెంత తీవ్రస్థాయిలో వుందో వూహించుకోవచ్చును. కేరళ మాజీ ముఖ్యమంత్రి ఆంథోనీ "ఈ హిందీ వివరీత ధోరణి దేశాన్ని రెండు ముక్కలు చేస్తుందని" - సూటిగా హెచ్చరించారూ అంటే - యీ భాషా దురహంకారం అద్యతన భావిలో తేనున్న అరిష్టాలను మనం వూహించుకోవాలి. పార్లమెంటుకి కూడా యీ భాషా వివాదం చెలరేగి అన్నా డి.ఎం.కె. పార్టీ, తమిళనాడు కాంగ్రెస్ (ఐ) పార్టీకి చెందిన సభ్యులు - హిందీ పత్రాలను చీల్చి చించి చెండాడి వాకౌట్ చేశారు. దీన్ని బట్టి హిందీ ఉద్యమం - సమయం సందర్భం రెండూ లేకుండా రాజకీయ పార్టీల చేతుల్లోకి పోతున్నట్లు స్పష్టమవుతున్నది. ఇది పెద్దేగి కార్చిచ్చుగా మారి "భాష"ల మధ్య గాక రాష్ట్రాల మధ్య ఉత్తర-దక్షిణ ప్రాంతాల మధ్య "పోరు"గాకముందే - అందరూ మేల్కొనాలి. త్రిభాషా సూత్రాన్ని అనుసరించి దక్షిణాదిన యింగ్లీష్ - హిందీ - ప్రాంతీయ భాషలను అభ్యసిస్తున్నట్లే - ఉత్తరాదిన కూడా ఒక దక్షిణ దేశ భాషను మూడో భాషగా నేర్చుకున్నట్లయితే - "హిందీ"ని లింకు భాషగా తీర్చిదిద్దటం వీలవుతుంది. అంతేకాని ఆంగ్ల భాష వ్యతిరేక ఉద్యమంగా మాత్రం అది రాణించదు. అనుకున్న ఫలితాలు సాధించదు. ఆంగ్ల భాష వ్యతిరేకత వెనుక దక్షిణాది భాషల మీద, దక్షిణాత్యుల మీద హిందీ రాష్ట్రాల ముఖ్యమంత్రులకు ద్వేషం వున్నట్లు బయటపడుతున్నదే తప్ప - యీ ఉద్యమం వలన హిందీకి యింత పిసరు మేలు జరగటం లేదు - ఈ సత్యాన్ని కేంద్రం గ్రహించి, ఆ యా రాష్ట్రాల ముఖ్యమంత్రులకి "హితవు" చెప్పటం మేలు! అంగ్రేజీ హటావో ఉద్యమానికి ఎంత త్వరగా ఉద్వాసన చెపితే అంత మంచిది! ●

## మరో గావస్కర్

ంగ్లండ్‌కి మన క్రికెట్ వీరులు యట్' మాత్రం పట్టుకు వెళ్లారు. తి' మీద అంత నమ్మకం లేదేమో కపిల్, ప్రభాకర్‌లు బంతిని జోరుగా రలేకపోతున్నారు. అది చూసి





కూడా యింగ్లండ్ బ్యాంటింగ్ 'పిచ్'లనే తయారు చేయడం - అతి జాగ్రత్తపడటం కోసమే అనుకోవాలి 'డ్రా' అయినా బెంగ లేదు కాని వోడిపోయే ప్రమాదం వుండ కూడదు అని గ్రాహంగూచ్ మొరపె ట్టుకొని వుండాలి - సెంచురీల కే మీ "ధోకా" లేని గ్రౌండులు రెండూ కూడా - భారత్‌ను కాపాడాయి. రెండో టెస్ట్‌లో రెండో యిన్నింగ్స్‌లో అజారుద్దీన్ విఫలం అవడంతో మన వాళ్లు వోటమి గుప్పి ట్లోకి యించుమించు వెళ్లిపోయారు. కాని కుర్రాడు సచిన్ టెండూల్కర్ - ఒక "కొస"ని అలా గోడకట్టుకొని వుండిపో యాడు. మొదటి యిన్నింగ్స్‌లో కూడా - "వోల్డు టెస్ట్ స్టయిల్లో" బౌలర్‌లు అలసిపోయే దాకా బ్యాట్ జిడ్డు కారి పోయే దాకా బంతుల్ని అవుకుంటూ సునీల్ గావస్కర్ మాదిరి ఆడిన యీ బాలుడు - మరో "గావస్కర్" కాగల అవకాశా లున్నాయి - రెండో యిన్నింగ్స్‌లో 97 పరుగుల దగ్గర సచిన్ చూపించిన వోర్పు తాపీని బి.బి.సి. టెలివిషన్‌లో ఎక్స్‌పర్ట్ కామెంటరీ చెబుతున్న సునీల్ గావ స్కర్ మాత్రం తప్పకుండా మెచ్చుకొని వుంటాడు. సచిన్ టెండూల్కర్ తన 9వ టెస్ట్ మ్యాచ్‌లో నాటౌట్ సెంచరీని (119) సాధించి అతి పిన్న వయ స్సులోనే యీ ఘనత సాధించిన తొలి భారతీయుడు - రెండో ప్రపంచ క్రికెట్ ప్లేయరూ అయినాడు (ముస్తాక్ మహ మ్మద్ మొదటివాడు) రెండో టెస్ట్

బౌలర్‌ల అసమర్థత వల్లనే లేదా "పిచ్" ఆఖరి రోజున కూడా తిక్క తిర గకుండా వుండటం నుంచే - 'డ్రా' అయి నది. సచిన్ టెండూల్కర్ హేమా హేమీలంతా వున్న మ్యాచ్‌లో శత మానం సాధించి మ్యాన్ ఆఫ్ ది మ్యాచ్ అయ్యాడు - భారతీయ బాలురకు ఒక "టెస్ట్ వీరుడు ఆదర్శప్రాయుడు దొరి

కాడు. సునీల్ మనోహర్ గావస్కర్‌తో పోల్చబడ్డ యీ "బాలుడు" నిస్సందేహంగా రేపటి మహాయోధుడు". బహుశా 'బేడీ' వొప్పుకోడేమో కాని "హూ యీజ్ అఫ్ర యిడ్ ఆఫ్ దిస్ బేడీ నా!"

## ప్యార్ అవుర్ హత్యార్

ప్యార్ అనగా ప్రేమ - హత్యార్ అనగా ఆయుధం అని తెలుగు వాళ్లకి బాగా తెల్సు - వి.పి.సింగ్‌గారు బాగా పొయిట్రీ రాస్తా రని - కవిత్వం ఆయన హాబీ అని చాలా మంది అనుకోగా విన్నాము కాని మొన్న జెండాల పండుగనాడు లాల్‌ఖిల్లా బురుజాల మీద నుంచి ఆయన చాలా పొయిట్రీ మాట్లాడారు. మంచి కవి అన డానికి సందేహం లేదు. దేశానికి సరి హద్దులలో ప్రమాదం ముంచుకొస్తున్నది అన్న ఆందోళన రకరకాలుగా వ్యక్తం చేస్తూ కేవలం జీతాలు తీసుకుంటున్న సైనికులే కాదు యీ దేశంలో బ్రతుకుతున్న ప్రజ లంతా యుద్ధం చెయ్యడానికి సిద్ధం కావాలి అన్నారు. స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న యోధులందరికి మహాత్మాగాంధీ గారేమి జీతభత్యాలు యిచ్చారు? అలాగే యివాళ దేశం కోసం నాగరికులంతా అంటే పౌరులన్న మాట - త్యాగాలు చెయ్యాలి అన్నారు - పంజాబ్ ప్రజల్ని "హమ్ ప్యార్



సే జీతేంగే" "దేశ్ కే శత్రు వోంకో హ మ్ హత్యార్ సే జీతేంగే" అన్నారు. పంజాబ్ ప్రజలను ప్రేమతో గెలుస్తారుట, శత్రువుల్ని అయుధాలతో ~ , స్తారుట మరెలా గెలుస్తారు? - అందులో ం పాకిస్తాన్‌ని ప్రేమతో గెలవడం కష్టమే కాని యీ విషయంలో దేశ పౌరులు ఎట్లా పాత్ర వహిస్తారో అర్థం కాదు మామూలు తలకాయలకి - పాకిస్తాన్‌తో పోరాడటా నికి అందరికీ ఆయుధాలు యిస్తారా? - ధరల మీద - పోగొట్టుకున్న హక్కుల గురించి - అవినీతికి - పదవీ వ్యామోహా నికి, నల్లధనానికి అంకితమైపోయిన నాయ కులతోటి వేగలేక భారతీయ జనం నిత్య సంగ్రామం సాగిస్తూనే వున్నారు కులర హిత సమాజం కావాలంటాం - కొన్ని వేల కులాలకు చట్టబద్ధమైన హక్కులు ఏర్పాట్లు చేసుకుంటున్నాం ఎన్నికలు - ప్రచారాలు అన్నీ కులాల ప్రాతిపదిక మీదే మునుపు యిన్ని కులాలు లేవు కమిషన్ కమిష న్‌కీ యివి పుట్టుకొస్తున్నాయి. వీటి వెనుకబాటుతనమూ బయటపడుతున్నది రైలు ఛార్జీలు - బస్సు ఛార్జీలు - రవాణా ఛార్జీలు - పెట్రోలు ధరలు అన్నీ గవ ర్నమెంటు పెంచేస్తూ వుంటూ షావు కార్లు సరుకులు దాస్తున్నారు. వాళ్లని ఉరి తియ్యండి అంటూ వుంటుంది' - ధర లను పెంచే హక్కు కేవలం గవర్నమెంటు గుత్త హక్కులాగ మాట్లాడుతున్నారు ఎన్నికైన పెద్దలు శ్రీ వి పి సింగ్ గారు శ్రీ దేవీలాల్‌తో ప్రత్యక్షంగా, పరోక్షంగా చేసే యుద్ధం కోసం రైతు లంతా యిప్పుడు కలిసి రావాలి కనుక కిసాన్ దశాబ్దం కావాలన్నారు భారతదే శానికి "రైతు వెన్నెముక" అని వాల్మీకి, వ్యాసుడూ గూడా చెప్పారు - "మట్టిని నమ్ముకుని - బతికే యిక్కడి ప్రజలకి రైతు యుగం రైతు శకం రైతు గాథలు రైతు బాధలు ఎప్పుడూ వుంటాయి - ప్రత్యే కంగా శతాబ్దాలు దశాబ్దాలు, తద్దినాలు ఎందుకు? - శ్రీ వి పి సింగ్ 75 నిమి షాలలో అన్ని విషయాలు ప్రస్తావించారు ధరలు పెరిగి పోతున్నందుకు విచారించారు రైతులకు ఋణాల మాఫీ విషయం ప్రధా నమంత్రి ప్రస్తావించారు సరియైన వ్యవ సాయ విధానం ఉంటే ఈ దేశంలో 7 ప్రణాళికల తరువాత రైతులకు ఋణాలు చేయవలసిన అవసరం ఉండరాదు వారే అందరికీ ఋణాలు, పెట్టుబడులు యివ్వగ లవారై వుండే వారు కాని దళారీ వ్యవ




స్థకి- ఎక్స్‌ప్లోయిటేషన్ వ్యవస్థకి కారణ భూతమైన యీ ప్రజాస్వామ్య ప్రభుత్వాలే యిన్ని నదులు - వాగులు - వంకలు వర్షాలు - ప్రాజెక్టులు వుండి - ప్రపంచం మొత్తం మీద అధిక సాగుబడి నేలగల దేశంలో రైతుని కులాలు వర్గాలు పార్టీ లుగా చీల్చి యివాళ "దేహీ" అనేలాగ చేస్తున్నారు అప్పులిచ్చి రైతుని గుప్పిటపె ట్టుకోవాలనుకోడం కాదా? యిది? అని ఆవేశంగా అడిగాడో లైబ్రరీ పక్షి అయిన పెద్ద మనిషి నన్ను - నాకు 'తెల్దు' కిసాన్ దశాబ్దం అంటూ ప్రకటించిన ప్రధాన మంత్రినడగమన్నాను - లేదా మంత్రి పదవి పోయినా మంత్రుల మధ్య ఉపేంద్ర ప్రక్కన కూర్చుని ఆగస్టు 15న వి పి సింగ్‌గారి పొయిట్రీని వింటూ దంతాలు నూరుతూ గడిపిన "తావూ" దేవీలాల్‌ని అడగమ న్నాను లేదా జాతీయ వ్యవసాయ విధానం ప్రకటింపబడేదాకా వేచి వుండాలి - రైతుకి - రైతు కూలీకి గల తేడా ఏమిటో? - రైతుని పెట్టుబడిదారుగా గాక కృషీవలు నిగా మాత్రమే రాణింపజేసే మార్గాలేమిటో యీ జాతీయ విధానం చెపుతుందేమో చూడాలి ●



# సీరియల్

# సూపర్ హీరో



మన్నెం శారద

(గత సంచిక తరువాయి)

వేన్ దిగి ఇంట్లోకి అడుగు పెడుతున్న కొడుకుని ఎదురెళ్ళి అక్కున చేర్చుకొంది నిఖిలేశ్వరి. తనకన్నా మూరెడు పొడవు దానికి తగిన వెడల్పు వున్న కొడుకు చేతుల్లో ఇమడక పోయినా గుండె నిండా ఇమిడిన భ్రాంతి కల్గిందామెకు. ఎన్నాళ్ళ తర్వాతనో లభించిన మాతృ స్పర్శతో అతని కళ్ళలో నీళ్ళు ఉబికేయి. వాటి నాపుకొనే ప్రయత్నంలో ఎర్రబారిన కళ్ళని అతను తుడుచుకొంటుంటే ఆమె వెక్కి వెక్కి ఏడ్చేసింది మొదటిసారిగా.

విజయేంద్ర తల్లి భుజాల్ని గుచ్చి పట్టుకొని "ఇప్పుడు దేనికమ్మా దుఃఖం! నేను నీ దగ్గరికి వచ్చేసేనుగా!" అన్నాడు అనునయంగా.

అతనలా ఓదారుస్తుంటే తన కొడుకు తన కన్నా ఎన్నో రెట్లు పెద్దవాడయి పోయినట్లు అతని ముందు తను చిన్న పిల్లలా ఫీలయ్యింది నిఖిలేశ్వరి.

"నీకు.... నీకెంత పెద్దరికం నేర్పిందిరా జైలు!" అంది అతని తల నిమురుతూ.

ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని "ముందు ముందు ఏ కష్టం వచ్చినా కదలి పోనంత మనస్థయిర్యా న్నిచ్చిందమ్మా ఈ జైలు జీవితం. ఎందుకో నాకు తప్పక మంచి రోజులు వస్తాయన్న నమ్మకం నాకుంది!" అన్నాడు.

నిఖిలేశ్వరి అతన్ని స్నానం చెయ్యమని వంట చేయసాగింది గబగబా.

విజయేంద్ర స్నానం చేసి బయటికి రాగానే ఆమె అతనికి వడ్డించి "ప్రస్తుతానికిలా కూర్చో. రేపు డైనింగ్ టేబుల్, ఛెయిర్స్ తెప్పిస్తాను" అంది ఒక స్టూలు లాగి కంచం అతని చేతికిస్తూ.

విజయ్ కంచం తీసుకొని క్రింద కూర్చున్నాడు.

ఆమె నివ్వెరపోతూ "ఏంటి బాబూ ఇది!" అంది.

"వద్దమ్మా నా కేసు పూర్తిగా తేలేవరకూ నాకే విధమైన సుఖాలూ వద్దు. ఆ ఆసక్తి పోయింది. జైల్లో నాలాంటి ఎంతో మంది నిర్దోషులు చేయని నేరానికి నాకన్నా నికృష్టమైన శిక్షలు అనుభవిస్తున్నారు. వారందర్నీ నేనెన్నడూ మరచిపోలేను" అన్నాడు బాధగా.

నిఖిలేశ్వరి మౌనం వహించింది.

ఇంతలో గణేశన్ ప్రవేశించేడు కారియర్‌తో.

"అడడ! రొంబ అన్యాయం! నీవుదా క్రింద కూర్చొని సాపాట్ చేస్తుదా వుంటే నాదిదా మనసు తన్నీరయి (నీళ్ళు) పోవును. అప్పుడే సాపాట్‌దా పూడిస్తివే! నేనుదా నీకు చికెన్ బిరియాని తెచ్చి పూడిస్తిని" అన్నాడు.

విజయేంద్ర లేచి నిలబడి అతన్ని కౌగలించుకొన్నాడు.

"అడడ! నీవుదా లేవకు. సాపాడు. నిఖిలేశ్వరమ్మా ఇది కూడ విజయేంద్రకి పెట్టు" అన్నాడు గణేశన్ ఆమెకి క్యారియర్ అందిస్తూ.

విజయేంద్ర భోజనం ముగించి గణేశన్ గారిని స్టూలు మీద కూర్చోమన్నాడు.

"అదెన్నా న్యాయం! మా హీరోగారుదా నేల మీద పూడిస్తే నేనుదా కూడ నేల మీదే పూడుస్తును" అన్నాడు గణేశన్ క్రింద కూర్చోబోతూ.

"మీరు కూర్చోవాలనుకొన్నా మీ పొట్ట ఒప్పుకోదు. మీరు స్టూలు మీదే కూర్చోండి" అన్నాడు విజయేంద్ర చిరునవ్వుతూ.

గణేశన్ పకాపకా నవ్వి "నీదిదా మాట మారలేదు". అన్నాడు స్టూలు మీద కూర్చుంటూ.

మొదట దమయంతి గురించి అడిగేడు విజయేంద్ర.

"రొంబ అన్యాయం జరిగిపోయింది విజయ్! వాడుదా కల్యాణం చేసుకొని కులుకుతున్నాడు" అన్నాడు.

విజయేంద్ర కళ్ళలో నీళ్ళు నిలిచేయి.

"దమయంతి తమ్ముళ్ళు, చెల్లెళ్ళు ఎక్కడున్నారు?" అనడిగేడు బాధగా.

---

<u>ఇంతవరకూ సాగిన కథ - **24 :**</u> ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నిఖిలేశ్వరి తన కొడుకు విజయేంద్రకు చిత్రసీమలో వస్తున్న పేరు ప్రఖ్యాతులు చూసి ఆనందిస్తుంటుంది. వ్యభిచార నేరం క్రింద అరెస్టయిన దమయంతి ఆత్మహత్య చేసుకుంటుంది. బ్లూఫిల్ములు తీస్తున్నాడన్న నేరంపై అరెస్టయిన కొడుకు విజయేంద్ర దుస్థితికి తల్లి తల్లడిల్లుతుంది. హియరింగ్ వచ్చిన విజయేంద్ర కేసు వాయిదా పడుతుంది. రజని తన యింట్లోవున్న బ్లూఫిల్మ్ క్యాసెట్లను శ్యామసుందర్‌కు అందజేస్తుంది. అవి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కు అందజేయబడతాయి.

**"మొన్నటిదాకా అమ్మగారే చూశారు. నీ కోసం ఆమెగారు ప్రెసిడెంటుల్ని, గవర్నుల్ని కలుస్తూదా వుంటే ఆమెకుదా** ఇబ్బంది రాకూడదని నేనుదా తీసుకెళ్తాని. అయినా దినమూ అమ్మగారు వచ్చిపోతుండాది! ఆమెకుదా నిండా జాలి!" అన్నాడు గణేశన్.

"వాళ్లని చూస్తే చాల బాధగా వుంటుంది విజయ్! కాని ఏం చెయ్యగలం?" అంది నిఖిలేశ్వరి.

"ఒక విధంగా వాళ్ళుదా అదృష్టవంతులు. మీలాంటి అమ్మ దయ వుంది వాళ్లకి. అదిదా చాలు!" అన్నాడు గణేశన్.

ఆ తర్వాత గణేశన్ విజయేంద్రతో తన మిగిలిపోయిన పిక్చర్‌ని పూర్తి చేయడం గురించి మాట్లాడేడు.

"అవుట్ స్కర్ట్స్‌లో వున్న ఒకే స్టుడియోలో పూర్తి చెయ్యాలి. అవుట్‌డోర్‌కి వెళ్లకూడదు. ఏం మంచి వర్కు వస్తుంది చెప్పండి" అన్నాడు విజయేంద్ర బాధగా.

"దాని గురించి నువ్వుదా చింతించకు విజయ్! ఫీల్డులో నీ మార్కెట్‌దా నీకుంటుంది!" అన్నాడు గణేశన్.

విజయ్ మౌనంగా కూర్చున్నాడు ఆలోచిస్తూ.

"నీకుదా రేపు టి. వి., వి. సి. ఆర్. అన్నీ తెచ్చి పూడుస్తాను. ఊరికినే ఆలోచించక కాలక్షేపందా చెయ్యి!" అంటూ లేచి నిలబడ్డాడు.

"ఆ పని చెయ్యకండి. ఈ కేసు తేలేవరకు నేనెలాంటి లగ్జరీ జీవితాన్ని గడపాలనుకోవడం లేదు. రేపు మళ్లీ ఏ కేసెట్ అయినా తీసుకెళ్లి బ్లూ ఫిల్మ్ అని కేసు మోపగలరు!" అన్నాడు విజయేంద్ర.

ఆ మాటకి గణేశన్ కళ్లు చెమర్చేయి.

"సరి సరి! నేనుదా పోవుదును". అంటూ తన కంటిని నలక పడినట్లుగా తుడుచుకుంటూ బయటికి నడిచేడు గణేశన్.

★ ★ ★ ★ ★

రాష్ట్రంలో నక్సలైట్ల గొడవ ఉధృతమైంది. ఎన్నో రోజులుగా రాకాని విడుదల చేయాల్సిందని లేనిపక్షంలో తీవ్ర పరిస్థితుల్ని ఎదుర్కోవాల్సి వస్తుందని



# 'మాథ్ ఒలింపిక్స్'లో బాలమేధావి కిరణ్‌కి బంగారు పతకం

గణితంలో అద్భుత ప్రతిభ కనబరుస్తున్న బాల మేధావి కిరణ్ కెద్లాయ బీజింగ్‌లో ప్రపంచస్థాయి గణితపోటీలలో (మాథ్ ఒలింపియాడ్) పాల్గొనబోతున్నట్లు ఇటీవల వార్తలు వచ్చిన విషయం విదితమే. కాగా ఇప్పుడీ బాలమేధావి బీజింగ్ ఒలింపిక్స్ నుంచి స్వర్ణ పతకాన్ని సాధించి తేవడంతో పాటు అమెరికాలోని భారతీయ సంతతి విద్యార్థులందరిలోకి అత్యుత్తమమైన విద్యార్థిగా ఎంపికై అతి ప్రతిష్ఠాత్మకమైన 'రామానుజం అవార్డు'ను కూడా అందుకున్నాడు.

బీజింగ్‌లో జరిగిన 'మాథ్ ఒలింపియాడ్'లో 54 దేశాలకు చెందిన విద్యార్థులు పాల్గొనగా వారిలో కిరణ్ 9వ స్థానం పొంది బంగారు పతకాన్ని సాధించాడు. పోటీలో వ్యక్తిగతంగా అద్భుత ప్రతిభ చూపిన 20 మందికి బంగారు పతకాలిచ్చారు.

కాగా, ఈ ప్రపంచస్థాయి గణిత పరిజ్ఞాన పోటీలో చైనా జట్టుకు ప్రథమస్థానం, సోవియట్ యూనియన్ జట్టుకు ద్వితీయస్థానం లభించగా కిరణ్ పాల్గొన్న అమెరికా జట్టు తృతీయస్థానం పొందగలిగింది.

16 ఏళ్ల కిరణ్ ఇప్పుడు వాషింగ్టన్ శివారు ప్రాంతంలోని ఒక ప్రయివేట్ పాఠశాలలో 'టెన్త్ గ్రేడ్'లో వున్నాడు. ఇటీవల... బీజింగ్ ఒలింపిక్స్‌కి ముందు అమెరికాలో జరిగిన గణిత పరిజ్ఞాన పోటీలో కిరణ్ 4 లక్షల 20 వేల మంది విద్యార్థులతో పోటీపడి ప్రథమస్థానం పొందాడు.

కిరణ్ తల్లిదండ్రులు కర్నాటకలోని ఉడిపి నుంచి అమెరికా వెళ్లి అక్కడ స్థిరపడ్డారు. ఇక ఇప్పుడు కిరణ్ 1991లో స్వీడన్‌లో జరుగనున్న 'మాథ్ ఒలింపిక్స్' మీద దృష్టి కేంద్రీకరించనున్నాడు.

---

నక్సల్స్ చేస్తున్న హెచ్చరికల్ని హోం మినిష్టరు రాయుడు పట్టించుకోలేదు. సరైన నిర్ణయాలు తీసుకునే ఛీఫ్ మినిష్టరు తీవ్ర అనారోగ్యంతో అమెరికా వెళ్ళిపోయేడు. రాయుడు డెప్యూటి సి. ఎమ్.గా వ్యవహరిస్తున్నాడు. ఛీఫ్ మినిష్టరు తిరిగి వచ్చేలోపున తన, తనవారి బాగోగులు చూసుకోవాలన్న ముగ్ధతో మిగతా కాబినెట్ మాటలు వినని విధంగా ఏకపక్షంగా రాష్ట్రాన్ని పరిపాలిస్తున్నాడు రాయుడు. దానికి తోడు ఛీఫ్ మినిష్టరు ఆరోగ్య పరిస్థితి ఆందోళనగా వుందని, బి. పి. బాగా పెరిగిపోయిందని ఆ పరిస్థితిలో ఆపరేషన్ చెయ్యడం దుస్సాధ్యమని అమెరికా నుండి వార్తలు వస్తున్నాయి. రాయుడిలో దురాశ పెరిగిపోయింది. సి. ఎమ్. ఎన్నటికీ తిరిగి రాలేకపోతే ఆ పోస్టు తనకే దక్కగలదన్న ఆలోచనతో ఎం. ఎల్. ఏ. లని కూడగట్టుకోవడంలో పడిపోయేడాయన.

సరిగ్గా అలాంటి స్థితిలో కాలేజిలో చదువుకొంటున్న ఛీఫ్ మినిష్టరు ఆఖరి కొడుకు రాజుని కిడ్నాప్ చేసి ఇరవై నాలుగ్గంటల్లో రాకాని వదిలేయకపోతే అతని శవాన్ని పంపుతామని బెదరింపు లేఖ పంపేరు నక్సలైట్లు.

రాయుడు అర్జెంటుగా ప్రతిపక్షాలతోను, పోలీసు ఆఫీసర్స్‌తోనూ విడివిడిగా మీటింగులు పెట్టేడు.

రాకా అతి ప్రయాసమీద దొరికేడు. అతన్ని వదలడం మంచిదికాదని అభిప్రాయపడ్డారు కొందరు.

రాష్ట్రంకన్నా సి. ఎమ్.గారి అబ్బాయి ప్రాణం ముఖ్యం అన్నారు మరికొందరు.

అయితే రాయుడి ఆలోచన నిజానికి వేరు. కేవలం రాష్ట్ర ప్రజల దృష్టి నాకర్షించడానికే అతనా మీటింగులు ఎరేంజ్ చేసినా అతను కమీషనర్ ఆఫ్ పోలీస్ అయిన గాంధీని ప్రత్యేకంగా పిలిచి తన మనసులోని మాట బయట పెట్టేడు.

ఆ మాట విని గాంధీ నిరుత్తరయ్యేడు.

"నో! నెవ్వెర్‌సర్! అలా జరిగితే రాష్ట్రం అతలాకుతలమై పోతుంది. మీరు స్టేట్‌ని కంట్రోల్ చెయ్యలేరు" అన్నాడు.

బదులుగా రాయుడి మొహం చెక్కేసిన కందగడ్డలా మారింది.

"నువ్వెవరితో మాట్లాడుతున్నావో గుర్తు పెట్టుకున్నావా గాంధీ!" అన్నాడు కోపంగా.

"ఉంది సర్! కాని నేను ఒక పోలీసు ఆఫీసర్‌గా..."

"నా మాట వినడమే నీ పని! వాణ్ణి వదిలితే నన్ను వెంటనే చంపేస్తానని బెదరించడం నీకు గుర్తు లేదా? నే చెప్పినట్లు చెయ్యి!"

"కాని... నాల్గు రోజుల్లో ప్రధానమంత్రి పర్యటన వుంది మన రాష్ట్రంలో."

"ఆ సంగతి నాకు తెలుసు!"

గాంధీ కాస్సేపు మౌనం వహించేడు.

"వెళ్ళు. అంతా చాల పకడ్బందీగా జరగాలి! నీమీద నమ్మకంతో ఈ పని నీకప్పు చెబుతున్నాను."

గాంధీ సాల్యూట్ చేసి బయట కొచ్చేడు. అతని మనసు మనసులో లేదు. రాయుడు చెప్పిన పని చేస్తే ఏం జరగబోతుందో అతనికి ఒక పోలీసాఫీసర్‌గా బాగా తెలుసు.

రాయుడు రాజకీయాలకి బాగా కొత్త. దురాశ, స్వార్థం అతనిలో పుష్కలంగా వున్నాయి కాని, రాజకీయపు ఎత్తుగడలు అతనికంతగా తెలియవనే చెప్పాలి.

రాజకీయ చతురుడు, ప్రజ్ఞాశాలి అయిన ఛీఫ్ మినిష్టరు లేని తరుణంలో అతను బ్రేకుల్లేని బండిలా ముందుకి పరిగెత్తడం అతనికే కాక రాష్ట్రానికే ముప్పు తెచ్చే విధంగా వుందన్న విషయం గాంధీ అర్థం చేసుకొన్నాడు.

గాంధీ ఇంటికొచ్చి ఎంతగానో ఆలోచించేడు.

చివరికి అతను ఒక నిర్ణయానికొచ్చి తన ఉద్యోగానికి రాజీనామా చేసి హోం మినిష్టరుకి పంపించేడు.

అది చూసి రాయుడు భగ్గున మండిపోయేడు.

వెంటనే అతను అతని జూనియర్ అయిన ప్రకాశానికి ప్రమోషన్ ఇచ్చి తన పథకాన్ని వివరించేడు.

కొత్త మతం తీసుకుంటే గుర్తు లెక్కువన్న విధంగా ప్రకాశం రాయుడు ప్రాపు సంపాదించడానికి వెంటనే ఒప్పుకున్నాడు.

రాకాని వదిలేస్తున్నట్టు - వెంటనే ఛీఫ్ మినిష్టరు కొడుకుని అప్పచెప్పాల్సిందిగా ప్రభుత్వం ఆదేశించింది.

మొదట నక్సలైట్లు రాజాని వదిలేసేరు.

రాజా ఇల్లు చేరేడు.

కాని... ప్రభుత్వం ప్రకటించినట్టు రాకా మాత్రం నక్సల్స్ స్థావరం చేరలేదు.

'వదిలేసేం' అంది ప్రభుత్వం.

'లేదు'' అన్నారు నక్సలైట్లు.

ఇరవై నాలుగ్గంటల తర్వాత రాకా మృతదేహం ఒక చెట్టుకి ఉరి తీయబడి కనిపించింది నక్సలైట్స్‌కి.

అతన్ని వదిలేసేం. అతనే ఆత్మహత్య చేసుకొన్నాడంది ప్రభుత్వం.

"లేదు. అతన్ని ఉరి తీసేరు" అన్నారు నక్సలైట్లు.

అంతే.

కొన్ని గంటల్లో బస్సులు తగలబడ్డాయి. రైళ్ళు పడగొట్టబడ్డాయి. ప్రజలు ప్రాణాలర చేత్తో పట్టుకొనే విధంగా అల్లర్లు చెలరేగి పోయేయి. పోలీసులు అదుపు చేయలేని పరిస్థితిలో సైన్యం దిగింది.

అదే సమయంలో అమెరికాలోని ఛీఫ్ మినిష్టరు దివంగతుడయ్యేడు.

ఆ పరిస్థితిని సమీక్షించడాని కొచ్చిన ప్రెసిడెంటు ప్రతినిధి రాష్ట్రపతి పరిపాలనని సూచించేడు.

రాయుడి పదవి వూడింది.

* * * * *

తెల్లవారుఝామునే లేచి వంట చేసి కారియర్ తీసుకొని కారెక్కుతూ కొడుకుని లేపి "ఈ రోజు నీకు షూటింగ్ లేదా విజయ్!" అనడిగింది.

"లేదమ్మా" అన్నాడు విజయ్.

"నేను ఆఫీసు కెళ్తున్నాను. జాగ్రత్త!"

# సూపర్ హీరో

అందామె.

"ఇన్ని మైళ్ళు రోజూ కారు డ్రైవ్ చేసుకొంటూ సిటీకి వెళ్ళడం మాటలు కాదు. నువ్వు సిటీలోనే ఉండమ్మా" అన్నాడు.

బదులుగా నిఖిలేశ్వరి నవ్వి "మనిషి శారీరక కష్టాన్నెంతయినా భరించవచ్చు. మనసుకి సంతోషముంటే ఎంత బాధనయినా లెక్క చేయం. ఇన్నాళ్ళకి నీ దగ్గర ఉండగల్గుతున్నాను. అదే చాలు నాకు!" అంది.

విజయ్ మౌనంగా చూస్తూ నిలబడ్డాడు.

ఆమె స్టీరింగ్ ముందు కూర్చుని అతనికి చెయ్యి వూపి కారు స్టార్టు చేసింది.

ఇంకా చీకటి విడిపోలేదు. ప్రత్యూష పవనాలు కారులోకి దూసుకొస్తున్నాయి. పక్షుల కలకలారావాలు ప్రకృతి పాడుతోన్న సంగీతంలా వుంది. ఆమె కారులోని స్టీరియో ఆన్ చేసింది. శిరిడిసాయిబాబా సుప్రభాతం చెవుల కింపుగా మొదలయ్యింది. కారు సిటీకి పది కిలో మీటర్ల దూరంలో వుందనగా ఆమె ఒక ఎంబాసిడర్ చెట్టుకి గుద్దేసి తుక్కు తుక్కయి వుండటం గమనించింది. ఆమె బాధగా కారు వైపు చూస్తూ తన కారుని స్లో చేసింది. కారు స్టీరింగ్‌మీద అపస్మారకంగా మనిషి పడిపోయి వుండటం చూసి ఆమె గాభరా పడి మరెవరి సహాయమైనా తీసుకోదలచి తన కారుని పక్కకి తీసి క్రిందికి దిగింది.

అనుకోనివిధంగా ఆమె దృష్టి కారు నెంబర్ ప్లేట్‌మీద పడింది. వెంటనే ఆమె భ్రుకుటి ముడి పడింది. గబగబా ఎంబాసిడర్ కిటికీ దగ్గరగా వెళ్ళి చూసింది. సందేహం లేదు. అతను గోపాల్రావే! ఆమెకి క్షణం పాలుపోలేదు. వెళ్ళిపోదామా అనిపించిం దొక క్షణం. కాని... మనసెందుకో అంగీకరించడం లేదు. కారణం అతను తన భర్తని కాదు. తన మంగళసూత్రం తెగిపోతుందేమోనన్న సెంటిమెంటూ కాదు. కేవలం తోటి మనిషి ఒకడు ప్రాణాపాయ స్థితిలో వున్నాడన్న మానవత్వమే ఆమె నక్కడ నిలబెట్టింది.

ఆమె దూరం నుండి వచ్చే బస్‌ని చెయ్యి వూపి ఆపింది. బస్సు స్రరున ఆగిపోయింది. ప్రయాణీకుల సహాయంతో గోపాల్రావుని కారులోంచి బయటకి లాగి నిఖిలేశ్వరి కారులో పడుకోబెట్టేరు. ఆమె వారికి కృతజ్ఞతలు చెప్పి కారుని శరవేగంగా గవర్నమెంటు హాస్పిటల్‌కి పరుగెత్తించింది.

ఎమర్జన్సీతో అతన్ని వెంటనే జాయిన్ చేసుకొన్నారు. అతని గ్రూపు రక్తం ఆస్పత్రిలో వెంటనే దొరకలేదు. వెంటనే రక్తం ఎక్కించకపోతే ప్రమాదం అన్నారు డాక్టర్లు.



ఆమె కారిడార్‌లోకి వచ్చి నిలబడి ఆలోచించిందొక క్షణం.

వెంటనే ఒక నిర్ణయాని కొచ్చిన దానిలా ఆమె గణేశన్‌కి ఫోను చేసింది.

గణేశన్ క్షణాల్లో పరిగెత్తుకొచ్చి "ఏం జరిగింది తల్లీ!" అన్నాడు గాభరాగా.

"గోపాల్రావుగారికి సీరియస్‌గా వుంది!" అందామె పొడిగా.

"ఏ గోపాల్రావు తల్లీ! నిర్మాతనా?"

ఆమె తల అడ్డంగా తిప్పి ఓ క్షణం మౌనం వహించింది.

"యారమ్మా. శీఘ్రమా చెప్పు" అన్నాడు గణేశన్ ఆతృతగా.

"ఆయన.... విజయేంద్ర తండ్రి!"

ఆ జవాబు విని నిరుత్తరుడయిపోయేడు గణేశన్.

"అడడ! కాంట్రాక్టర్ గోపాల్రావు గారా? ఇప్పుడుదా ఏం చేయాలి?" అన్నాడు గణేశన్.

"విజయేంద్ర గ్రూపు రక్తం గోపాల్రావుగారిదీ ఒకటే! పోలీసు పర్మిషన్‌తో మీ రతన్ని అర్జెంటుగా ఇక్కడికి తీసుకు రావాలి?" అంది నిఖిలేశ్వరి.

"పర్మిషన్‌దా దొరుకుతుందా?"

"ఆ ప్రయత్నం మీరే చెయ్యాలి! నాకు తెలియదు" అంది.

"సరి! సరి! నేను పోదును" అంటూ గణేశన్ వెళ్ళిపోయేడు.

నిఖిలేశ్వరి అసహనంగా బయట బెంచి మీద కూర్చుంది.

# సూపర్ హీరో

వచ్చేపోయే నర్సులు, డాక్టర్లు ఆమెని చూసి విష్ చేసి, "ఏంటిలా వచ్చేరు?" అనడుగుతున్నారు. వారందరికీ ఆమె చిరపరిచితం. ప్రతి ఆదివారం ఆమె అనాధ రోగులకి పాలు, పండ్లు పంచుతుంది. ఆ విధంగా ఆమెకు హాస్పిటల్‌తో సన్నిహిత సంబంధాలున్నాయి.

మరో గంటలో విజయేంద్ర హాస్పిటల్‌కి వచ్చేడు హడావుడిగా. వెంట నల్గురు కానిస్టేబుల్స్ వున్నారు.

"ప్రభుత్వందా పడిపోయింది కదా! ఇప్పుడు కమీషనర్ రొంబ మంచివాడు. నా మాట వినగానే పర్మిషన్‌దా ఇచ్చి పూడ్చేడు" అన్నాడు గణేశన్.

"ఏమిటమ్మా?" అన్నాడు విజయేంద్ర కంగారుగా.

"నీకు గణేశన్‌గారేం చెప్పలేదా?" అందామె కొడుకు వైపు చూస్తూ.

అతను తల అడ్డంగా తిప్పేడు.

"నువ్వు రక్తదానం చెయ్యాలి!"

"ఎవరికి?"

"ఎవరన్నదికాదు ముఖ్యం. ఆపదలో వున్న ఓ మనిషికి"

అతను తల్లి వైపదోలా చూసి "పద!" అన్నాడు.

ఆమె గబగబా లోనికి నడిచి "మా అబ్బాయి రక్తం ఆ గ్రూపుదే! పరీక్షించి తీసుకోండి!" అంది.

డాక్టర్లు అతని రక్తం పరీక్షించి ఆ గ్రూపుదేనని నిర్ణయించుకొన్నాక రక్తం తీసుకొన్నారు.

విజయేంద్ర రక్తదానం అయ్యేక లేచి "ఇంతకీ ఎవరమ్మా అతను?" అన్నాడు.

బదులుగా నిఖిలేశ్వరి ఎదురుగా వున్న బెడ్ వైపు చూపింది.

వళ్ళంతా బాండేజ్‌లతో వున్న కన్న తండ్రిని విజయేంద్ర గుర్తించలేకపోయేడు.

"మీ అప్పా గోపాల్రావు!" అన్నాడు గణేశన్.

విజయేంద్ర నివ్వెరపోతూ తల్లి వైపు చూశాడు.

అతనికి ఒకప్పుడు తను జబ్బు పడినా తండ్రి వచ్చి చూడకపోయిన సంఘటన గుర్తొచ్చింది.

"అమ్మా, ఇది నిజమేనా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నిజమే! కాని అతను నీ కన్నతండ్రనే స్వార్థంతో నేను నిన్ను రక్తదానం చెయ్యమన లేదు. నిస్సహాయ స్థితిలో వున్న తోటి మనిషి అని మాత్రమే! పద! మనం వెళ్దాం!" అంది బయటికి నడుస్తూ.

విజయేంద్ర తల్లి ప్రవర్తనకి విస్తుపోతూ కానిస్టేబుల్స్ వెంట జీప్‌లో మెదక్ బయల్దేరేడు.

గణేశన్‌గారు అతని కారెక్కుతుంటే "మీకు చాల శ్రమ ఇచ్చేను. థాంక్స్" అంటూ తన కారెక్కింది నిఖిలేశ్వరి.

"అడడ! అంత మాట దేనికి తల్లీ! వస్తా!" అంటూ అతనూ బయల్దేరేడు.

* * * * * *

రజనిని చూడగానే నివ్వెర పోయింది చాదర్ ఘాట్ చంచల.

"మీరు? మీరు?" అంది కంగారుగా.

"నేనెవరో చెబుతాను గాని... మీకు విజయేంద్రతో వున్న విరోధం ఏమిటో చెబుతారా?" అంది రజని ఆమెను నిశితంగాచూస్తూ.

చంచల మౌనం వహించింది.



"మాట్లాడరేం?"

"ఏం మాట్లాడ మంటారు? మాట్లాడే హక్కు మాకు లేదు!" అందామె మెల్లిగా.

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగింది రజని.

"అదంతే! మేం ఏం మాట్లాడినా కొంప లంటుకుంటాయి!"

"మిమ్మల్ని డబ్బుతో ఎవరైనా కొన్నారా?"

"లేదు."

"పరపతితో ?"

"లేదు."

మరి దేనికి మీరు విజయేంద్రపై తప్పుడు సాక్ష్యం చెబుతున్నారు?"

"ఎవరన్నారు తప్పుడు సాక్ష్యం అని?"

"అంటే అతను మిమ్మల్ని రేప్ చేసాడా?"

"అవును" అంది చంచల బింకంగా.

"అబద్ధం!" అంటూ అరిచింది రజని.

చంచల ఆమె వైపు ఆశ్చర్యంగా చూసి "అసలు మీ రెవరు? మమ్మల్ని ఎందుకిలా దబాయిస్తున్నారు? మీరు ఆడ పోలీసా?" అంది భయంగా.

"కాదు. కాని మీగుట్టు తెలిసిన దాన్ని. బ్లూ ఫిల్మ్‌లో నటించే ఒక నటీమణిని ఒక హీరో బలవంతంగా రేప్ చేసే పరిస్థితి వస్తుందంటారా?" అంటూ రెట్టించింది రజని.

"ఎవరి గురించి మీరు మాట్లాడుతున్నది?"

"క్యాసెట్ వేసి చూపించనా?"

చంచల అకస్మాత్తుగా ఆమె కాళ్ళ మీద పడి "వద్దు. నా కసలు విజయేంద్రే తెలీదు. కాని పోలీసులు చంపేస్తామని చెప్పమంటే... చెప్పేను" అంది ఏడుస్తూ.

"లేవండి. ఇప్పుడా పోలీసులూ లేరు. ప్రభుత్వమూ లేదు. నిజం చెప్పండి. ఒక అమాయకుడి మీద నింద మోపి అతని జీవితం నాశనం చెయ్యకండి!" అంది రజని.

చంచల తలూపింది.

రజని తిన్నగా కోకిల ఇంటి వైపు బయల్దేరింది.

(ఇంకావుంది)

# ఆల్టరేషన్

ఓ చిన్న ఆల్టరేషన్
క్షణం వెనక్కి చూడు
పూద్చుకు పోయిన చేదు నిజాలెన్నో
కళ్ళముందు గిరికీలు కొడ్తాయి
కష్టాలు పడుతున్నాడు అనే కన్నా
అతడు కష్టాలు కొని తెచ్చుకొన్నాడు అంటే
బాగుంటుందేమో?
ప్రాబ్లమ్స్ ఎన్నైనా ఉండొచ్చు
వెదుక్కొనే దాన్ని బట్టే గదా సొల్యూషన్ దొరికేది...
మ్యూచ్యువల్ అండర్‌స్టాండింగ్ ఉన్నప్పుడే
వైఫ్ అండ్ హజ్‌బెండ్ అన్యోన్యత కలకాలం నిలిచేది
వారి అనురాగం నిండారా బతికేది...



జీవితాన్ని ఎప్పుడూ డేంజర్ మార్క్‌గా టిక్ చేయకు
పిరికి తనం తాడుని
బతుకు గొంతుకి ఉచ్చేస్తే
భవిష్యత్తు ఆరోగ్యం దెబ్బతింటుందే తప్ప
సంతోషాన్నాన్ని కడుపారా భోంచేయలేదు
డియర్ ఫ్రెండ్ పెసిమిస్ట్‌వి కాకూడదు
ఆప్టిమిస్ట్‌గా ఉంటేనే కావలసిన భంగిమలోకి
మలచుకోవచ్చు బతుకు మృత్పిండాన్ని
స్వచ్ఛ స్ఫటికం లాంటి ఆలోచన
కొత్తఊపిరితో మొలకెత్తుకురావాలి గుండెపొదులోంచి...
నిప్పుకొండలా సహనం అంచుల మీద పొంచి సేలిచి
కన్నీళ్ళ నుండి కలతల నుండి వంచనల నుండి
దోపిడీ దుర్మార్గాల నుండి అన్యాయధర్మాల నుండి
అణగారిన తనం నుండి
బతుకుని బతికించుకొంటూ
గమ్య గవేషణకు దారి వేసుకొంటూ...

-అవనిగడ్డ సూర్యప్రకాష్

# జోరీగ



## రావిపల్లి నారాయణరావు

వామనమూర్తికి కథలు రాయలనే కోరిక చాలా కాలం నుండి ఉంది. అతని కొలీగ్సు శివరావు, రాజారావు రాసే కథలు తరచు ప్రముఖ పత్రికల్లో పడడం చూసి అతను ఓర్వలేక పోయాడు.

ఒక రోజు పత్రికల నుండి పారితోషికం రాగానే ఆ యిద్దరు రచయితలు ఆఫీసులోని తమ తోటి ఉద్యోగులకు యిచ్చిన తేనీటి విందుకు వామనమూర్తి హాజరైనా, వారితో ఆనందాన్ని పంచుకోలేక పోయాడు మనసు అసూయతో నిండిపోయింది–

"ఉండండి వెధవల్లారా! వేచి ఉండండి' నేను కూడా కథలు రాయడం ప్రారంభించాను కొద్ది రోజుల్లో నా కథలు ప్రముఖ పత్రికల్లో ప్రచురింపబడక మానవు ఆ రోజు నేను మీ అందరికి ఓ హైక్లాసు హోటల్లో ఎటువంటి పార్టీ యిస్తానో




చూస్తారుగా! ఈ బోడిపార్టీకే చచ్చు దద్దమ్మల్లా పొంగిపోతున్నారు వెధవ పీనుగులు "– మనసులో అనుకున్నాడు వామనమూర్తి

ఎదుట వ్యక్తి మెప్పు పొందాలన్నా, అతని సహాయం అవసరం అనిపించినా, ఆ వ్యక్తిని బార్‌కు తీసుకెళ్ళి, ఒక సిటింగు పెట్టి, కాకాపట్టడం వామనమూర్తికి ఉగ్గుపాలతో వచ్చిన విద్య

పట్టు విడవని విక్రమార్కుడిలా వామనమూర్తి చాలా కథలు రాసాడు వార, పక్ష, మాసపత్రికలకు పంపాడు. అవి ఎప్పుడు పత్రికల్లో చోటు చేసుకుంటాయా అని ఎదురు చూసాడు పాపం ఆ కథలు పోస్టు చేసిన పది పదిహేను రోజులకే తిరిగి వచ్చాయి అయితే అతను నిరుత్సాహ పడలేదు. వారపత్రికల నుండి తిరిగొచ్చిన కథల్ని మాసపత్రికలకు, మాసపత్రికల నుండి తిరిగొచ్చిన వాటిని వారపత్రికలకు పంపుతూ యీసారి అవి ప్రచురింపబడకపోతాయా అన్న ఆశతో మనసు కుదుటపరచుకున్నాడు కాని అతని. కోరిక నెరవేరలేదు. దాంతో రచయిత కావాలన్న పట్టుదల వామనమూర్తి మనస్సులో బాగా నాటుకుపోయింది... ఇక కథలు రాస్తే లాభం లేదనుకున్నాడు.'నాటకాల వైపు అతని మనస్సు మళ్ళింది షేక్స్పియర్ నాటకాలు చదివాడు. టాల్‌స్టాయ్ పుస్తకాలు తిరగేసాడు. ఆంగ్లరచనలు ఆధారంగా తీసుకుని రచనలు సాగిస్తే ప్రయోజనం ఉండకపోదన్న అభిప్రాయం అతని మనస్సులో చిగురెత్తింధి. నాటకరంగం అనుభవం సంపాదించడానికి, సాంస్కృతిక సమాజాలు ప్రదర్శించే నాటకాలు తిలకించాడు. నాటక కార్యకర్తల పరిచయం పెంచుకున్నాడు. వారి సలహాలు తీసుకున్నాడు. ఆ తర్వాత ఆంగ్ల కథలు కొన్నింటిని ప్రదర్శనకు యోగ్యమైన నాటకాలుగా తెలుగులో రూపొందించాడు. మంచి నాటకాలుగా రూపొందిన వాటిని ప్రచురణ కోసం పత్రికలకు పంపించాడు. అయితే ఆ నాటకాలు కూడా తన కథల్లాగే పుస్తకాల్లో ప్రచురణకు

నోచుకోలేదు. వారం పది రోజుల్లో అవి తిరిగి వచ్చాయి– 'దయచేసి మీ అమూల్య కాలాన్ని వృధాచేసుకోకండి. ప్రచురణకు పనికిరాని రచనలను పంపి మా సంపాదక వర్గాన్ని యిరకాటంలో పెట్టకండి?– అంటూ పత్రికా సంపాదకులు కొందరు వామనమూర్తి రాసిన నాటకాలపై రిమార్కు చేసి వాటిని తిప్పిపంపడం కూడా జరిగింది. ఆ రిమార్కు వామనమూర్తి గుండెల్లో త్రిశూలమై కూర్చుంది. ఇక చేసే రచనలను ప్రచురణకోసం పత్రికలకు పంపకూడదని తీర్మానించు కున్నాడు వామనమూర్తి. ఈ సారి అతని మనస్సు రంగస్థల నాటకాల మీదకు పోయింది. పత్రికల్లో ప్రచురణకు నోచుకోని ఎన్నో నాటకాలు, నాటికలు రంగస్థలంపై ప్రదర్శింపబడి ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాయి. అటువంటి నాటక రచయితల్లో చాలా మందికి సన్మానాలు, సత్కారాలు జరిగాయి. సాహిత్య సంస్థల నుండి పెక్కు బహుమతులు లభించాయి. ఆ విషయం తెలుసుకున్న వామనమూర్తి తన నాటకాలను రంగస్థలంపై ప్రదర్శించడానికి ప్రయత్నం చేసాడు. నాటక బృందాలను కలుసుకున్నాడు. తను రాసిన నాటకాలు వారికి చూపించాడు. తన నాటకాన్ని ఆ బృందం ప్రదర్శిస్తే ఆ నాటక ప్రదర్శనానికయే ఖర్చు పూర్తిగా తనే భరిస్తానని చెప్పాడు వామనమూర్తి. ఆ షరతులకు అంగీకరించిన నాటక సంస్థ, వార్షికోత్సవాల సందర్భాన వామనమూర్తి రచించిన నాటకాన్ని ప్రదర్శించడం జరిగింది. ప్రదర్శన ప్రారంభించిన పది పదిహేను నిముషాలకే రంగస్థలంపై ప్రేక్షకులు చెప్పుల వర్షం కురిపించడంతో ప్రోగ్రామ్ కేన్సిల్ చేసి చల్లగా అక్కడ నుండి జారుకున్నారు ఆర్గనైజర్లు. ఆ నాటక సమాజమే కాదు మరే సంస్థ కూడా వామనమూర్తిని దగ్గరకు చేరనీయలేదు, ఆనాటి నుండి.

నాటక సమాజాలపై ఆశను వొదులుకున్న వామనమూర్తి ఆకాశవాణి చుట్టూ తిరిగాడు కొన్నాళ్ళు. ఆలిండియా రేడియో వారు ఎటువంటి నాటికలు, నాటకాలు ప్రసారం చేస్తున్నది తెలుసుకున్నాడు.

ఒక ఇంగ్లీషు కథను ఆధారంగా తీసుకుని తెలుగులో 'చెవిలో జోరీగ' అన్న పేరుతో అరవైనిముషాల శ్రవ్యనాటకాన్ని రాసాడు వామనమూర్తి. అది అనువాద నాటకం కాదు. తన స్వంత రచన అని మిత్రులందరికీ చెప్పాడు. ఆ విధంగా రాసిన హామీ పత్రాన్ని నాటకంతో పాటు ఆకాశవాణికి సమర్పించు కున్నాడు కూడా.

'చెవిలో జోరీగ' నాటకాన్ని ప్రసారం చేయటానికి ఆమోదించినట్లు, ఆ నాటకాన్ని ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలకు ప్రసారం చేయనున్నట్లు ఆకాశవాణి నుండి వచ్చిన ఆమోద పత్రాన్ని, ఆఫీసు బిల్డింగులో ఉన్న అయిదు అంతస్తులు తిరిగి, పరిచయం ఉన్న వారికి, పరిచయం లేని వారికి చూపించి మురిసిపోయాడు




వామనమూర్తి.

నాటక ప్రసారం తేదీ, సమయం మరచి పోతారేమోనని ప్రసారానికి ఒక రోజు ముందు. అంటే శనివారం, మళ్ళీ అన్ని ఫ్లోరులకు వెళ్ళి మరొకసారి మిత్రులందరికి రిమైండ్ చేసి వచ్చాడు వామనమూర్తి. అంతకుముందు, ఇరవై పోస్టు కార్డులు కొని, ఆదివారం నాటకం – 'చెవిలో జోరీగ' – ప్రసారం అయిన తర్వాత, ఆ కార్డులపై సంతకం చేసి పోస్టు చేయవలసినదిగా కోరుతూ సన్నిహితులైన ఇరవైమంది మిత్రులకు ఆ కార్డులను యిచ్చి వచ్చాడు అతను. ఆ కార్డుల మీద ఆకాశవాణి అడ్రసు, శ్రోతల అభిప్రాయం వామనమూర్తే రాసాడు. మిత్రులు చేయవలసినది ఆ కార్డులపైన సంతకం మాత్రమే! అధిక సంఖ్యలో శ్రోతల దగ్గర నుండి ఉత్తరాలు వస్తే తన పాప్యులారిటీ పెరగ వచ్చునన్న అభిప్రాయం వామనమూర్తికి లేకపోలేదు. అతను ఆ సాయంత్రం మళ్ళీ అన్ని అంతస్తులకు వెళ్ళి, మిత్రులకు యిచ్చిన పోస్టుకార్డులపై సంతకాలు చేయించి తిరిగి తీసుకున్నాడు– వాళ్ళు పోస్టు చేయడం మరచిపోతారేమో నని.

* * * * * * *

వామనమూర్తి ఆ రోజు సాయంత్రం ఆఫీసు విడిచిపెట్టేసరికి ఆరు గంటలు దాటింది. ఆ రోజు శనివారం కాబట్టి మర్నాడు- అంటే ఆదివారం పోస్టల్ క్లియరెన్సు ఉండదు. మిత్రుల దగ్గర నుండి తీసుకున్న పోస్టు కార్డులు ఆ సమయాన పోస్టు బాక్సులో వేసినా, తపాలా బంట్రోతు ఆ బాక్సు నుండి ఉత్తరాలను తీసుకు వెళ్ళేది సోమవారం పది గంటలకు- ఆ అభిప్రాయంతో వామనమూర్తి ఇరవైపోస్టు కార్డులు ఆఫీసు నుండి యింటికి వెళుతున్నప్పుడు దారిలో రోడ్డు ప్రక్కన కనబడ్డ పోస్టు బాక్సులో డ్రాప్ చేసి యిల్లు చేరుకున్నాడు.

* * * * *

ఆ రోజు రేడియోలో జరిగిన కార్యక్రమాలపై శ్రోత అభిప్రాయాలు అన్న ఉత్తరాల కార్యక్రమ ప్రసారం అవుతుండగా వామనమూర్తి మి బృందం 'చెవిలో జోరీగ' నాటకంపై శ్రోత అభిప్రాయాలు వినాలన్న కుతూహలంతో రేడి చుట్టూ చేరారు.

"-గడచిన నెల ఆరో తేద ఆదివారం, విదేశంలో ప్రముఖ నాయకుడి అకాల మరణం కారణం భారతప్రభుత్వం ఆ రోజు సంతాపదినం ప్రకటించడంతో రేడియో కార్యక్రమాలన్నీ ఆదివార రద్దు చేయడం జరిగింది. 'చెవిలో జోరీగ' నాటక కూడా ఆ రోజు ప్రసారం కాలేదు. అయి వామనమూర్తి రచించిన 'చెవిలో జోరీగ' నాటక విన్నాం; చాలా అద్భుతంగా ఉంది, అలాం నాటకాలు తరచు ఆకాశవాణి ప్రసారం చేయగలద ఆశిస్తున్నాము. వామనమూర్తిగారికి ధన్యవాదాలు- అంటూ రాసిన ఉత్తరాలు సుమా ఇరవై మాకు అందాయి. దీనిని బట్టి, రేడియె నాటికలు వినకుండా కొందరు శ్రోతలు అభిప్రా వేదికకు ఉత్తరాలు రాస్తున్నట్లు వెల్లడవుతోం మరో విషయం- అలా వచ్చిన యిరవై ఉత్తరా పరిశీలించి చూస్తే, వాటిపై దస్తూరీ ఒకే వ్యక్తి అన్న అనుమానం మాకు కలుగుతోంది. ఇ నిజమైతే, అలాంటి పని ఒక్క రచయితే కాని మ వ్యక్తి చేయబోరని మేమ అభిప్రాయపడుతున్నాం"- ఆకాశవాణి జాబు కార్యక్రమం విన్న తర్వాత పోస్టుకార్డుల మీ సంతకాలు చేసిన వామనమూర్తి మిత్రుల అటువంటి పొరపాటు పని యిటుపై మరెప్పుడ చేయకూడదని తీర్మానించుకున్నారు.

ఆ మరుచటి దినం ఆఫీసులో తలెత్తుకు తిరగలే పోయాడు వామనమూర్తి.

# హలో డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**మాలతి, యానాం.**

ప్ర: వయసు 22 సంవత్సరములు వక్షోజాలు పెరగాలి.

జ: ప్లాస్టిక్ సర్జన్స్ ఇంప్లాంట్ ఉపయోగించి వక్షోజాలు సహజంగా కనపడేలా చేయగలరు. కాకినాడ, విజయవాడ, గుంటూరు, హైద్రాబాద్‌లలో ప్లాస్టిక్ సర్జన్స్ వున్నారు.

**కె.వి.ఎస్. సుబ్బారావు, రాయవరం.**

ప్ర: సన్నగా పొడవుగా వుంటాను. 20 సంవత్సరములు. నీళ్లు తోడితే చేతులు పట్టుకుపోతాయి. త్వరగా అలుపు వస్తుంది. కండరాలదురుతాయి. తెల్ల వెంట్రుకలున్నాయి. చదివింది బుర్రకెక్కడం లేదు.

జ: ఏరోవిట్ బిళ్ల ఉదయం భోజనానంతరం వైబెలాన్ ఫోర్ట్ బిళ్ల రాత్రి భోజనానంతరం ఆరునెలలు వాడి చూడండి. పాలు, పళ్లు, గుడ్లు, తీసుకోండి.

**ఓ పాఠకురాలు, ఎమ్మిగనూరు.**

ప్ర: కళ్లు మసకగా వున్నాయి. కళ్లలో పెట్టుకునే గ్లాసు లున్నాయా?

జ: కాంటాక్ట్‌లెన్స్‌లు పెద్ద పట్టణాలలో దొరకుతాయి. మీవూరిలోని కంటి డాక్టరుగారికి చూపించుకోండి.

**ఎం. శ్రీనివాస్, ఏలూరు.**

ప్ర: లావెక్కాలి.

జ: స్టాంబాబాబిళ్లలు రోజూ రాత్రి భోజనం తర్వాత ఒకటి చొప్పున మూడు నెలలు వాడండి.

**ఆర్.కె.ఎం., చిత్తూరు.**

ప్ర: వయసు 22 సంవత్సరములు. పొడుగు పెరగాలి. ఎన్నేళ్ల వరకు పొడుగు పెరుగుతారు?

జ: పొడుగు పెరిగే వయసుదాటిపోయింది. యువకులు 21 లేక 22 సంవత్సరములు తర్వాత పొడుగు పెరగరు.

**ఆర్.ఎం., వడ్డేపల్లి.**

ప్ర: బక్కగా వున్నానని బాధగా వుంది. సరిగా చదువుకోలేకపోతున్నాను. 19 సంవత్సరములు.

జ: ఆహారంలో పాలు, పళ్లు తీసుకోండి. గుడ్లు లేక పప్పు పదార్థాలు ఎక్కువగా తినండి. ఒర్‌బోలిన్ బిళ్ల రాత్రి భోజనం తర్వాత బెస్టోజైమ్ గొట్టాం ఉదయం సాయంత్రం భోజనం తర్వాత మూడు నెలలు వాడండి. పొడుగు పెరుగుతున్నారు గనుక పీలగా కన్పించవచ్చు. ఒకటి రెండేళ్లలో పొడుగు పెరగడం ఆగిపోయి వళ్లు చేయవచ్చు. అందువలన మీరు ఆందోళన పడడం అనవసరం.

**బి. పాపారావు, మాధవధార.**

ప్ర: నా వయసు 19 సంవత్సరములు. పుష్పవతి అయిన నెల తర్వాత ఒక అమ్మాయితో కలిశాను. తర్వాత ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయి నేను తోటలోకి వెళ్లాము. ఆ అమ్మాయి పూర్తిగా బట్టలు విప్పివేసి ననుపట్టుకుంది. నాకు కాళ్లు చేతులు వణికిపోయాయి. హస్తప్రయోగం అలవాటుంది. పెళ్లి చేసుకోవాలంటే భయంగా వుంది.

జ: చేస్తున్న పని తప్పన్న భావన వణుకు పుట్టిస్తుంది. మందులనవసరం. నిర్భయంగా వివాహం చేసుకోండి. ఈలోపల ట్రయల్సు మానండి.

**పి.ఎస్.ఆర్., విశాఖపట్నం.**

ప్ర: నిరోధ్ ఉపయోగించి వేశ్యను కలిసాను. అప్పటి నుండి అంగం ఎర్రబడి పోయింది. డాక్టరు గారికి చూపితే ఏ జబ్బూ లేదన్నారు. తట్లు తట్లుగా వుంది.

జ: సోఫ్రా డెక్స్‌క్రీమ్ స్నానానంతరం అంగం మీదరాసుకోండి. బాక్ట్రిండి ఎస్. ఉదయం సాయంత్రం ఒక్కొక గొట్టాం చొప్పున పదిహేను రోజులు వాడండి. ఫలితం లేకపోతే వి.డి. స్పెషలిస్టుకు చూపించండి. ఆందోళన పడవద్దు.

**పి.ఆర్. మోహన్, బందరు.**

ప్ర: మంచి రచన అంటే మీ ఉద్దేశ్యం ఏమిటి?

జ: పతనోన్ముఖంలో ఉన్న సమాజానికి గతి చూపేది మంచి రచన. ప్రస్తుత పరిస్థితిలో మన సమాజాన్ని మరింత చెడ గొట్టకుండా వుంటే ప్రతి రచన మంచిదేనని నా ఉద్దేశ్యం!



సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

(గత సంచిక తరువాయి)

మరుక్షణంలో తేరుకొని 'సార్! ఎ. ఎస్. పి. సార్...' అంటూ అక్కడి నుండే గావుకేకలతో ఆఫీసులో కొచ్చిపడ్డాడు. అతని అరుపులు వింటూనే ఏ. ఎస్. పి. మొహం చిరాగ్గా పెట్టి 'ఏమయింది! ఏ టెర్రరిస్టయినా మీద పడ్డారా! అలా అరుస్తున్నావ్!'

'కాదు సార్! ఒక్కసారిలా బైటికి రండి. అది చూశారంటే... మీ నెత్తిన ఓ పది మినీ టైంబాంబులు పడ్డట్టు ఫీల్ అవుతారు' అన్నాడు వణికిపోతూ.

'ఒర్నీ! ఏమైందో చెప్పి ఏడు. ఈ సస్పెన్స్ ఏమిటి?'

'నాకు నోట మాట రావటం లేదు. మీరే రండి' అన్నాడు. ఏ. ఎస్. పి. కేం అర్థం కాలేదు. అతని వెనకే గబగబ నడిచాడు వ్యాన్ దగ్గరికి.

అప్పటికే స్టేషన్ పోలీసులు చూసినట్టున్నారు. ఖంగారుగా అతని కెదురు వచ్చారు. 'సార్... అక్కడ...' గుటక లేశారు. అంతా వ్యాన్ బ్యాక్ సైడ్ కొచ్చారు.

ఎస్. హెచ్. ఓ. టార్చిలైటు వెలుతురు ఫోకస్ చేశాడు. ఆ వెలుతురులో ఆ ఆరుగురి శవాలు భయంకరంగా పడి ఉన్నాయి.

అది చూడగానే ఏ. ఎస్. పి. పిడికిళ్ళు కోపంతో బిగుసుకున్నాయి. కళ్ళు ఎర్రబడ్డాయి.

'రాస్కెల్స్ ఇదా పెరుమున వాళ్ళ పనే' అని పళ్ళు కొరికాడు.

ఎస్. హెచ్. ఓ. అతని పక్కనే చేరి 'అయితే చిలకలెగిరి పోయుంటాయి' అన్నాడు.

'పటప్. ఈ విముక్తి పెరుమున మీద కేస్ పుటప్ చేయి. వీళ్ళనెంత దారుణంగా హత్య చేసింది వ్రాయి. ఫోటోలు తీయండి. రేపుదయం పేపర్లలో ఈ విషయం ప్రముఖంగా రావాలి. తమిళుల దౌర్జన్యానికిది అద్దంపట్టేలా రావాలి' కోపంగా బుసలుకొడ్తూ అన్నాడు ఏ. ఎస్. పి.

ఎస్. హెచ్. ఓ. తలూపాడు.

ఆ రాత్రి జాఫ్నా తీరం వెంబడి వున్న నూటయాభై తమిళ కుటుంబాలు నాశనమయ్యాయి. వారి ఇళ్ళన్నీ అగ్నికి ఆహుతయ్యాయి. ప్రజలు ప్రాణభీతితో పరిగెత్తారిళ్ళల్లోంచి ఉన్న కాస్త పాటి సొమ్ము, నగ, నట్రా అగ్నిప్రీతికి బలయ్యాయి. నిరాధారంగా రోడ్ల మీద నిలబడ్డాయి ఆ 150 కుటుంబాలు. ఆ రోజు ఉదయం నుండి తమిళుల రక్తంతో తడిశాయి రోడ్లు. ఒక్కరోజులో జాఫ్నా శ్మశాన భూమిలా తయారైంది. చావగా మిగిలిన జనం పిశాచాల్లా ఉన్నారు.

తమిళుల ఊచకోతకు నిరశనగా భారత్‌లోని తమిళులంతా శ్రీలంక ప్రభుత్వానికి తమ నిరసన తెలియ చేయాల్సిందిగా ప్రభుత్వానికి తెలిపారు. 'ఇది చాలా అన్యాయం' అని ఘోషించారు.

శ్రీలంకలోని భారత హైకమిషనర్

<u>ఇంతవరకూ సాగిన కథ - 3 :</u> శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతిసేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు దుండగుల బుల్లెట్లకు బలి అవుతారు. ఈ హత్యాకాండకు కారకుడైన అజ్ఞాతవ్యక్తి శవాన్ని అధికారులు స్వాధీనం చేసుకుంటారు. జాఫ్నాతీరంలో రామేశ్వరం నుంచి వస్తున్న ఓడపై బాంబింగ్ జరిగి ప్రాణనష్టం సంభవిస్తుంది. తమ హక్కుల సాధనకై నిరాహారదీక్ష చేస్తున్న అహింసావాద టి.వి.పి. కార్యకర్తలపై పోలీసులు జులుం ప్రదర్శిస్తారు. ఈ సందర్భంగా తమిళ యువతుల్ని ఎత్తుకుపోతారు.

పోలీసుల యొక్క దౌర్జన్యకాండను నిరసిస్తూ ప్రభుత్వం సంబంధిత అధికారులను శిక్షించాలని, దౌర్జన్యానికి బలైన కుటుంబాలకి సహాయ సహకారాలందించాలని కోరింది.

కాని.... విచిత్రంగా అందరినీ ఆశ్చర్యపరుస్తూ ప్రభుత్వం ఆ పోలీసు సూపరెంటుకు ప్రమోషన్ ఇచ్చింది.

టెర్రరిస్టుల్ని అణిచి జాఫ్నా ప్రాంతంలో శాంతి నెలకొల్పేందుకు తన ప్రాణాలకు సైతం తెగించి వారి పోరాటాల్ని అణచి వేసిన ఏ. ఎస్. పి.ని అభినందించటానికి డి. జి. పి. ఇచ్చిన మెసేజి అందింది.

అది చూడగానే ఏ. ఎస్. పి. ఛాతి మరో రెండంగుళాలు విస్తరించింది.



'చూశారా! మన ప్రతాపం!' అన్నట్టు తన సిబ్బంది వైపు చూశాడు.

'ఔను సర్. ఆ రోజు మనం సర్‌ప్రైజ్ చేయకపోతే ఆ తమిళులు మన స్టేషన్ని తగలబెట్టే వాళ్ళు. ఎంత ధైర్యం లేకపోతే వాళ్ళు స్వపరిపాలన కోరతారూ?'.

'వీళ్ళ మొహాలకి పరిపాలన కూడానా? ప్రభుత్వం దయదలిచి తిండనిచ్చినందుకు సంతోషించాల్సింది పోయి. గొంతెమ్మ కోరికలతో ప్రాణాల మీదికి తెచ్చుకుంటున్నారు. ఫూల్స్' అంటూ టేబుల్ మీదున్న టోపీ తీసి తలపైపెట్టుకుంటూ

'నేను యీవెనింగ్ రాను. డి. జి. పి. గారి దగ్గరికెళ్తున్నా' అని హుందాగా బైటికి నడిచాడు.

'ఎస్. సర్' అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశారు పరివారం. ఏ. ఎస్. పి. నేరుగా ఇంటి కెళ్ళాడు. ఓ అరగంటలో ఫుల్ యూనిఫారమ్‌లో తయారై, నీట్‌గా డ్రస్ వేసుకొని డి. జి. పి. ఆఫీసుకి బైలుదేరాడు.

అతని జీప్ ఆఫీస్ ముందు కొచ్చి ఆగింది. లోపల గదులు దాటి డి. జి. పి. ఛాంబర్స్ వైపు నడిచాడు.

అటెన్షన్‌లో నిలబడి డోర్ తెరవబోతున్నాడు. అతని మనసు ఆనందంతో గంతు లేస్తోంది. తనకీ సారి ప్రమోషన్ ఖాయం. దాదాపు 500 మంది తమిళుల్ని ఊచకోత కోయించిన ఘనకార్యం తనదే. కాబట్టే డి. జి. పి. బాగా ప్లీజ్ అయ్యాడు. ఆయన చెప్పబోయే అభినందనలు అందుకొనేందుకు ఉద్వేగంతో, ఆనందంతో ఉరకలేసే మనసుని అదిమిపడ్తూ–

డోర్ మీద చెయ్యి వేశాడు. సరిగ్గా అదే సమయానికి–

ఎ. కె. 47 రైఫిల్ బుల్లెట్ అతని కణతలో నుండి దూసుకుపోయింది.

అతని చావు కేకతో డి. జి. పి. ఛాంబర్ ప్రతిధ్వనించింది.

డి. జి. పి. ఛాంబర్‌లో –

ఆయన ఎదురుగా కూర్చున్న ఐ. జి. పి. గొంతు సవరించుకుంటూ "ఐ. పి. కె. ఎఫ్. వాళ్ళు వెళ్ళిపోయినప్పటి నుండి జరిగిన నేరాల్ని దృష్టిలో కి తీసుకుంటే ఒక నేరానికి మరో నేరానికి పొంతనలేదు. కనుక ఈ నేరస్తులు వేరు వేరని నా ఉద్దేశం.'

'ఎట్లా!' అన్నట్టు చూశాడు డి. జి. పి.

'నెంబర్‌వన్. ఐదు లక్షల కోసం రణసింఘేలాంటి వాళ్ళ్ని చంపిన వాడు పచ్చి కసాయి. ధైర్యస్తుడూ, మొండివాడు అయివుండాలి. నెంబర్ టూ. జనతా విముక్తి లీడర్స్‌ని పోలీసుల బారి నుండి తీసికెళ్ళటం సాహసంతో కూడుకున్న పని. వాళ్ళని సేవ్ చేసినట్టు నటించి వాళ్ళ బ్రెయిన్స్ వాష్ చేసి తిరిగి వారికే అప్పగించాడు. దీన్ని బట్టి ఇతడెవరో దీర్ఘకాలిక ప్రణాళిక మీద ప్రభుత్వంతో తలపడాలని ఉన్నట్టు తోస్తుంది. ఇతను శాస్త్రీయ, సాంకేతికపరంగా మంచి నైపుణ్యం గల వ్యక్తిలా అవుపిస్తున్నాడు. ఇంక నెంబరు త్రీ మన ఇంటెలిజెన్స్ రిపోర్ట్సు ప్రకారం ఏ. ఎస్. పి. మొన్న జరిగిన గొడవలో కొంతమంది ఆడవాళ్ళను ఫాక్ట్ ఎక్స్‌ట్రాక్షన్ (అంటే వాస్తవం తెలుసుకోవడం) కోసం తీసికెళ్తుండగా అతిభయంకరమైన ప్రమాదకరమైన సాల్మే కొండ చరియల్లో మన వ్యాన్‌ని ఆపి సాయుధులైన పోలీసుల్ని డ్రైవర్ని చంపి తిరిగి ఏ. ఎస్. పి. ఆఫీసు ముందే వ్యాన్ వొదిలేసి వెళ్ళిపోయాట్ట. దీన్ని బట్టి చూస్తే ఇతనెవరో సింహళ టెర్రరిస్టు కావొచ్చు.

నెంబర్ ఫోర్. ఏ. ఎస్. పి.ని మీ ఛాంబర్‌లో చంపగలిగాడంటే అతను తప్పక మనతో పాటు పని చేస్తున్న ఓ వ్యక్తిగాని, అతి సన్నిహితుడుగాని అయి వుండాలి.

కనుక ఈ నల్గురు వ్యక్తుల గురించి విడివిడిగా ఎంక్వయిరీస్ చేస్తే మనకు మూలం ఏమిటో తెలుస్తుంది.

డి. జి. పి., ఐ. జి. పి. యొక్క కేస్ ఎనాలిసిస్‌ని శ్రద్ధగా విన్నాడు. చివరగా అతని విశ్లేషణని ఆమోదించినట్టు తలూపాడు.

'అయితే ఆ వ్యక్తులను గురించి ఆరా తీయండి. మిలిటరీ ఇంటెలిజెన్స్‌ను, స్పెషల్ సి. ఐ. డి.లను రంగంలోకి దించండి.

'ఎస్. సర్' ఐ. జి. పి. వెళ్ళిపోయాడు.

డి. జి. పి. ఆలోచనలలో పడిపోయాడు. ఆ నల్గురు వ్యక్తులు ఎవరు?

టెర్రరిస్టులా?

ప్రజా విముక్తి పెరమునా?

తమిళ విమోచన పార్టీయా?

విక్రాంతిదళా? లేక విదేశీయులా!

అయితే– ఇక్కడ జరిగే కార్యకలాపాల్లో పాల్గొని, టెర్రరిజమ్ సృష్టించటం వలన లాభం పొందే దేశాలేమిటి?

ఇండియా! ఊహూ! కాదు. ఇక్కడి అల్లర్ల వలన ఇండియాకి లాభమేమీ లేదు. ఈ గొడవల్లో తలదూర్చటం వలన వాళ్ళ మిలిటరీ క్రింద అయ్యే ఖర్చు కోట్లల్లో వుంది. ఇది వారికి నష్టం కదా! టైమ్, మాన్ పవర్, మనీ అన్నిటిని కోల్పోవటం కావాలని చేసేవి కావు కాబట్టి, ఇక్కడకి చేరటం వలన ఇండియాకేం లాభం లేదు.

ఎవరి ఏజెంట్స్ ఇక్కడున్నట్టు?

సింగపూర్ సింహంగా చెప్పబడే 'చెంఘిజ్‌ఖాన్' హాండ్ కూడా ఈ కుట్రల్లో భాగమున్నట్టుగా కొన్ని రిపోర్ట్సు వచ్చాయి.

ఇందులో ఏది నిజం?

వెంటనే ఆయన ఐరన్ సేఫ్ తెరిచి అందులో రహస్యంగా ఉంచబడిన

### 'రే' ఖ్యాతి

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన బెంగాలీ దర్శకుడు సత్యజిత్‌రే ఉత్తమ దర్శకుడిగా ఐదుసార్లు జాతీయ అవార్డును గెలుపొందారు. అంతేగాక ఫ్రాన్స్‌లో అత్యున్నత అవార్డు అయిన లెజియన్ డి ఆనర్ అనే అవార్డును పొందిన ఏకైక వ్యక్తి కూడా రేనే. 'పథే పాంచాలి' అనే బెంగాలీ చిత్రం ద్వారా ఆయన చిత్రరంగ ప్రవేశం చేశారు. డిటెక్టివ్ రచయితగా, బాల సాహిత్యకారుడిగా, చిత్రకారుడిగా, సంగీత దర్శకుడిగా శ్రీ రే మంచి ప్రావీణ్యాన్ని సంపాదించారు.

ఫైల్లో కట తీశాడు.

అది చెంఘిజ్‌ఖాన్‌కి సంబంధించిన ఫైలు.

చెంఘిజ్‌ఖాన్ కిరాయి దొంగ, హంతకుడు, పచ్చి నెత్తురు తాగే పరమ రాక్షసుడు.

నాటి మంగోల్ వీరుడు చెంఘిజ్‌ఖాన్ కన్న రెండాకులు ఎక్కువే చదివాడని పేరు.

ఏ దేశంలోనైనా అల్లర్లు, అలజడులు లేవదీయాలన్నా, ఎలక్షన్లలో హత్యలు జరపాలన్నా, పేగద్భందీగా స్మగ్లింగ్ జరపాలన్నా ప్రత్యేకవాద ఏర్పాట్లు వచ్చేలా చేయాలన్నా ఏ దేశాన్నయినా ముక్కలు ముక్కలుగా విడగొట్టాలన్నా ఏ దేశంలోనైనా ప్రజలు ఒకర్నొకరు నరుక్కొని చచ్చే పరిస్థితులు కల్పించాలన్నా.

నాటి బ్రిటీష్ పాలకుల కన్నా ఎంతో సమర్థుడు.

వీడెందుకు కల్పించుకున్నట్లు?

ఇక్కడి వాళ్ళెవరో ఈ రాక్షసుణ్ణి ఆహ్వానించినట్లుంది. డి. జి. పి. కనుబొమలు ముడిపడ్డాయి దీర్ఘాలోచనతో ఆయన కొద్ది నిముషాలలాగే నిలబడిపోయి చివరికి నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడి "దేశద్రోహులు దేశద్రోహులు, దేశం నిండా పాలలా నాచులా వ్యాపించారు. దేశాన్ని గుండాల కప్పగిస్తున్నారు. మనలో మనకు సవాలక్ష సమస్యలు, కలతలు ఉండొచ్చు. అది మనకు మనం సామరస్యంగా పరిష్కరించుకోవాలే తప్ప బైట వాళ్ళ కిందులో స్థానం కల్పించ కూడదు."

## సాగరమథనం

డి. జి. పి. ఇలా ఆ నల్గురు వ్యక్తులు, సింగపూర్ టైగర్ల గురించి ఆలోచిస్తున్న సమయంలో –

ట్రింకోమలిలోని శక్తి సేవాశ్రమం ముందర నిలబడ్డారు నల్గురు యువతులు–

శక్తి సేవాశ్రమం ట్రింకోమలికి ఎడంగా, సీ పోర్టుకి కొద్ది దూరంలో వుంది. శక్తి సేవాగ్రాంలో అంతా రెల్లుగడ్డితో కప్పబడిన పర్ణశాల ల్లాంటి గృహాలు.

సేవాగ్రాం చుట్టూరా జాలరుల గుడిసెలు. జాలరులు, వాళ్ళ పిల్లలతో పగలంతా సందడిగా వుండే ఆ ప్రాంతం చీకటి పడితే నిశ్శబ్దంగా మారిపోతుంది.

పగలంతా పడిన శ్రమ మరిచి పోయేందుకు నాటు సారా తాగేసి మత్తుగా పడుకుంటారు జాలరీలు.

సేవాగ్రాంలో మటుకు రాత్రంతా ఆముదపు దీపాల వెలుతురులో పనులు సాగుతుంటాయి.

'శక్తి సేవాగ్రాంని నడుపుతోంది.' కేవలం ఓ ఇరవై రెండేళ్ళ అమ్మాయి–

ఆమె పేరే– శక్తి.

ఈ సేవాగ్రామంలో ప్రస్తుతం– అనాథ బాలబాలికలు, వృద్ధులు, అనాథ యువతులు నివసిస్తున్నారు.

ఈ మధ్య జరుగుతున్న మారణ కాండకు బలైపోయిన, కుటుంబాల లోని పసిపిల్లలంతా ఈ సేవా గ్రామంలో రక్షణ, పోషణ పొందు తున్నారు. అలాగే కొడుకులు కోడళ్ళు, మనవలు ఇంటిల్లిపాదీ పోగా చావకుండా మిగిలిన వృద్ధులు ఈ సేవాగ్రాంలో వసతి పొందుతున్నారు.

ఈ స్వచ్ఛంద సంస్థని ఓ ఆడపిల్ల నడపటం వారికి విశేషంగా అన్పించినా,

ఆమెతో పరిచయం కలిగాక, ఆమె నిర్వహణ తీరు, సమర్థత, శక్తి యుక్తులు గమనిస్తే ఆమె అందుకు సమర్థురాలే నన్పించక మానదు.

ఆఫీసు గదిగా చెప్పబడే ఆ గుడిసెలో ఓ కుర్చీ, ఒక బల్ల ఉన్నాయి.

ఆ కుర్చీలో ఆమె కూర్చొని టేబుల్ మీదున్న ఫైల్‌లోకి చూస్తోంది.

ఇంతలో పన్నెండేళ్ళ కుర్రాడొకడు పరిగెత్తుకుంటూ ఆమె దగ్గరకొచ్చి 'అక్కా.... అక్కా...' అని పిలిచాడు.

చూస్తున్న ఫైల్‌లో నుండి తలెత్తకుండా 'ఏరా తీతూ' అంది.

'వాకిట్లో నల్గురాడపిల్లలున్నారక్కా'

'రమ్మను లోపలికి'

'తీతూ తూనీగలా పరిగెత్తాడు'

నిముషంలో ఆడపిల్లలతో సహా లోపలికొచ్చాడు.

'వచ్చారక్కా' అన్నాడు.

'కూర్చోండి' అందామె తలెత్తకుండానే.

వాళ్ళు కింద పరిచివున్న చాపపై కూర్చున్నారు.

'ఇంట్లో ఎవరైనా ఉన్నారా?'

'ఉన్నారు' అన్నారంతా.

అమెరికాలో అల్పసంఖ్యాక వర్గాల ...జల ఆరోగ్య పరిరక్షణలో విశిష్ట కృషి ...రిపిన భారతీయ సంతతి వ్యక్తి జోస్ ...ంథోనీ పులెన్‌వీటిల్‌కి ప్రతిష్ఠాత్మకమైన 1990 వరల్డ్ హెల్త్ డే నేషనల్ అవార్డ్" ...భించింది. లోగడ 1987లో అమెరికా ...ధ్యక్షుని సతి శ్రీమతి బార్బారా బుష్‌కి ఈ ...వార్డు లభించింది

...ల్లినాయిస్‌లోని ఎన్స్వ్యాయిర్ ఫార్మా ...్యూటికల్స్, మెడికల్ వరల్డ్ సప్లయిస్ ...నే సంస్థలకు అధ్యక్షునిగా, చీఫ్ ...గ్జిక్యూటివ్ అధికారిగా వున్న జోస్ ...ంథోని ఇటీవల వాసా (విస్కాన్సిన్) ...ేయర్ నుంచి ఈ అవార్డును ...్వకరించారు

# అమెరికాలో భారతీయునికి పురస్కారం

లక్షలాది మంది బాలలకు . ప్రత్యేకించి ...రుపేద దేశాలలోని బాలలకు వ్యాధి ...రోధక ఔషధాలు సమకూర్చిన ప్రపంచస్థాయి "పోలియో ప్లస్" కార్యక్రమంలో అగ్రశ్రేణిలో నిలిచి కృషి జరిపినందుకు అవార్డు గ్రహీత ఆంథోనీని 'వాసా' మేయర్ జాన్ రాబిన్సన్ ప్రశంసించారు. ప్రపంచ వ్యాప్తంగా గల ...రాశ్రయులు, పేదల వైద్య సంబంధిత అవసరాలకు ప్రతిస్పందించే 'షేర్ అండ్ కేర్ ఇన్ కార్పొరేటెడ్' సంస్థను ఏర్పాటు చేయడం ద్వారా కూడా జోస్ ఆంథోనీ విశిష్ట స్థానాన్ని పొందుతున్నారని మేయర్ అన్నారు.

'వాళ్ళ పర్మిషన్ తీసుకొని వచ్చారా?'

'తీసుకున్నాం'

'మీరు కొంత కాలం ఇక్కడే వుండాలి. మీకు తిండి బట్ట ఆసు మేం చూస్తాం'

'అలాగే ఉంటాం'

'చాలా క్రమశిక్షణ, కఠిన నియమాలు పాటించాల్సి వుంటుంది'

'అలాగే ఈ క్షణం నుండి మీరెలా చెబితే అలాగే వింటాం. మీరు నిప్పుల్లోక నడవమంటె నడుస్తాం కాని మాక్కావల్సింది ఒకటే ఈ దుర్మార్గుల బారి నుండి మా శీలాన్ని మేం రక్షించుకో గలిగే శక్తి యుక్తులు వచ్చేట్టు చెయ్యండి' అన్నదో అమ్మాయి

ఆ పిల్లవైపు చూస్తూ 'నీ పేరు' అడిగింది శక్తి

'షీలా'

మిగతా వాళ్ళు అడక్కుండానే తమ పేర్లు చెప్పారు

పొట్టిగా, లావుగా వున్న పిల్లపేరు 'రమ'

పొడవుగా వున్న అమ్మాయి పేరు 'సరోజ'

మీడియమ్ హైట్‌లో వున్న పిల్ల పేరు 'చండి'

వాళ్ళంతా దాదాపు ఇరవై ఏళ్ళ వాళ్ళు వారిలో షీలా ప్రత్యేకంగా వుంటుంది భారి విగ్రహం, వయస్సుకి మించిన ఎదుగుదల, మొహంలో ఆవేశం, కోపం, బాధ, అసహనం పోటీ పడుతున్నాయి.

శక్తి చిన్నగా నవ్వింది.

'ఆవేశం కావాల్సిందే దాన్ని అవసర మైనప్పుడే వాడుకోవాలి. మీకీ రోజు నుండే లెసన్స్ ప్రారంభ మవుతాయి? అని 'తీతూ' అంటూ పిల్చింది.

తీతూ లోపలి కొచ్చాడు.

'సిముక తిస్సాని పిలుచుకురా' అంది.

తీతూ వెళ్ళి పోయాడు

మరో నాల్గు నిముషాల్లో తిస్సా లోపలి కొచ్చాడు వస్తూనే శక్తికి విష్ చేశాడు.

'తిస్సా! ఈ అమ్మాయిలకి గది చూపించు. సౌకర్యాలు చూడు. ఉదయం సాయంకాలం ఆసనాలు. మీతో పాటే ఈ రోజు నుండి వీళ్ళక్కూడా అన్ని విషయాల్లో శిక్షణ ఇవ్వబడుతుంది. నువ్విక వీళ్ళని తీసుకెళ్ళు' అంది.

'అలాగే. తండి' అన్నాడా అమ్మాయిలని చూస్తూ తిస్సా.

ఆడపిల్లలతనితో ఆశ్రమం లోపలి వైపుక వెళ్ళారు. పెద్ద హాల్లో కొన్ని గుడ్డ ఉయ్యాలల్లో పసిపిల్లలు నిద్ర పోతున్నారు.

నాల్గైదు సంవత్సరాల పిల్లలు ఆడుకుంటున్నారు. అక్కడ నల్గురు ఆయాలున్నారు.

వాళ్ళా పసి పిల్లలను చూడటం గమనిస్తూ 'వీళ్ళంతా ఆ మధ్య గొడవల్లో చనిపోయిన వాళ్ళ పిల్లలు' అన్నాడు తిస్సా.

షీలా కళ్ళముందు వారం రోజుల క్రిందట తమ జాఫ్నాలో జరిగిన హింసా కాండ కళ్ళ ముందు మెదిలింది. ఆ అమ్మాయికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. 'యీ పసి వాళ్ళని చూస్తుంటే కడుపు తరుక్కు పోతోంది. ఇంత అమానుష కార్యాలు చేస్తున్న వారిని విడువ కూడదు. ఈ మహాయజ్ఞానికి నేనూ ఒక సమిధను కావాలి' అని గట్టిగా మనసులో శపథం చేసుకొంది.

ఆ ప్రక్కగా ఉన్న గదుల్లో ఆడపిల్లలు– చిన్న పెద్ద సైజుల్లో గల సంచులు తయారు చేస్తున్నారు.

అవి టీ పొడి, కాఫీ గింజలు పోయటాని కుపయోగించే బ్యాగ్స్.

'ఆ సంచులన్నీ షాప్స్‌కి అమ్ముతాం' అన్నాడు తిస్సా.

మరో హాల్లో ఆడపిల్లలు కొందరు కొబ్బరి పీచుతో డోర్ మాట్స్ తయారు చేస్తున్నారు.

మరో చోట కొబ్బరి తీసేసిన చిప్పలతో టేబుల్ లైట్లు, రకరకాల బొమ్మలు. సున్నితమైన వారి పనితనాన్ని తెలుపుతూ తయారవుతున్నాయి.

అలా తయారు చేయబడ్డ వస్తువులకి వేరొక చోట రంగు లద్దుతున్నారు. ఆ తర్వాత వాటికి నగిషీలు చేర్చి ఆకర్షణీయంగా తయారు చేస్తున్నారు.

అక్కడొక చిన్న సైజు కుటీర పరిశ్రమ

సాగుతోంది. ఈ పరిశ్రమలో కార్మికులు, యజమానులు అంతా వారే.

తిస్సా, తీతూ– తప్ప అక్కడ మరొక మగవాడు లేడు.

"ఇంత మంది ఆడపిల్లలు ఇక్కడ ఎలా చేరారూ?" అడిగింది షీలా.

'మీ లాగే ఇక్కడి కొచ్చిన వాళ్ళు. శక్తి వీళ్ళందరికీ ఇలా జీవనోపాధి కల్పించింది' అన్నాడు తిస్సా.

'ఆవిడ పేరేమిటి శక్తా? గమ్మత్తుగా వుందే!'

'ఔను'

'ఇక్కడ నువ్వు తప్ప మరో మగాడు లేడుకదా? ఇందరాడ పిల్లల్ని నువ్వెలా రక్షించ గలవ్?'

'నేను రక్షించే దేమిటి?' అంటూ ఓ పెద్ద గదిముందాగి దాని గొళ్ళేనికి కట్టేసిన తాడు లాగేస్తూ అడిగాడు తిస్సా.

'మరి ఏ అర్ధరాత్రో, టెర్రరిస్టులో, పోలీసులో, సింహళ పార్టీయో, అదే విక్రాంతిదళ్ వచ్చి పడితే వీరందరినీ ఎవరు రక్షిస్తారు?

'ఎవరిని వారు రక్షించు కుంటారు. ఇక్కడ మీకు నేర్పించేది ముందుగా అదే. మిమ్మల్ని మీరు కాపాడు కోవటం మీ పట్ల మీకు ఆత్మ విశ్వాసం కల్గించటం. ఈ ఆశ్రమంలో ప్రధమ పాఠాలు'.

'ఎవరు నేర్పుతారవి? నువ్వేనా?'

'కాదు! ఇదిగో. ఇది మీ గది. మీ నల్గురూ ప్రస్తుతానికిందులో ఉండండి. ఇప్పుడు మీరు చూసిన పనుల్లో మీకేది నచ్చితే ఆ గదిలోకి వెళ్ళి అక్కడున్న వారి నడిగి పని తెలుసుకొని చేయండి. ఇక్కడ క్రమశిక్షణ, పని, చాలా స్ట్రిక్టుగా చూడబడతాయి. మీలో పిరికితనం, నిరాశ, నిర్లక్ష్యం, అలసత్వం కనిపిస్తే శక్తి క్షమించదు' అని వెళ్ళిపోయాడు.

అక్కడ నల్గురికి నాలుగు చాపలు, నాలుగు దిండ్లు ఉన్నాయి. కూజా నాలుగు గ్లాసులు ఉన్నాయి.

నల్గురూ మంచి నీళ్ళు తాగి బొమ్మలు తయారు చేసే గదిలోకి వెళ్ళి అవి తెలుసుకుంటుండగానే గంట మోగింది.

'ఏమిటి?' పక్కనున్న కాత్యా నడిగింది షీలా

## సాగరమథనం

'భోజనానికి సమయమైంది పదండి' అంది కాత్యా.

షీలా వాళ్ల దీన గాథ విన్నది కాత్యా! ఆమె దీర్ఘంగా నిట్టూర్చి 'ప్రభుత్వ సైనికుల దురాగతాలకి అంతం లేదు. నా భర్త జనతా విముక్తి మనిషని భావించుకొని నా కళ్ళెదుటే చంపేశారు. నేనెలాగో పసి బిడ్డతో వారి బారి నుండి తప్పించుకొని పారిపోయి యిలా ఇక్కడ ఆశ్రయం పొందాను. ఏనాటికైనా నా భర్తని చంపిన రాక్షసుల్ని చంపటమే నా జీవిత లక్ష్యం'. కాత్యా మాటల్లోని స్థిరత్వం చూసి షీలా ఆశ్చర్యపోయింది.

రొట్టెలు, కూర- ఇది మధ్యాహ్నపు భోజనం. కాత్యా వెళ్ళి తన పసిబిడ్డను తెచ్చుకొంది. వాణ్ణి వడిలో పడుకోబెట్టుకొని రొట్టెలు తినసాగింది.

భోజనాలయ్యాక తిరిగి పనిలో ప్రవేశించారు. సాయంకాలం 7-30కి గంట మోగింది.

బైటకొచ్చారంతా.

యువతులంతా- ప్యాంటు చొక్కాలు ధరించి మెయిన్ హాల్లోకి వెళ్తున్నారు.

తిస్సా గబగబ షీలా దగ్గరికొచ్చి నాలుగు జతల దుస్తులిచ్చాడు వాళ్ళకి.

"ఇవి వేసుకొని రండి' అని వెళ్ళిపోయాడు.

ఆ ప్యాంటు, చొక్కాలు వేసుకొని నల్గురూ మిగతా వారితో కలిసి అతి నిశ్శబ్దంగా ఆ హాల్లోకొచ్చారు.

హాల్లో ఓ ప్రక్కగా పెద్ద రాతి పలక పక్కకి తొలగించబడి వుంది. లోపలి మెట్ల గుండా నడిచి అంతా కిందికి వెళ్తున్నారు. షీలా ఆమె స్నేహితులు ఆశ్చర్యంగా చూస్తూ వారి ననుసరించారు.

అడుగున చాలా విశాలమైన ఖాళీ స్థలం వుంది. లైట్లు వెలుగు తున్నాయి దేదీప్యమానంగా.

అందరూ కిందికి దిగాక పలక యధాస్థానానికి వచ్చింది.

ఓ పక్కకి తిరిగి చూసిన నల్గురూ నిరుత్తరులై బొమ్మల్లా

...డిపోయారు.

...క్కడ–?

(ఇంకావుంది)

## కృష్ణమూర్తి శాస్త్రికి
## రాజా - లక్ష్మీ సాహితీ పురస్కారం



రాజా-లక్ష్మీ సాహితీ పురస్కారం ఈ ఏడాది ప్రముఖ సంస్కృత పండితులు రామవరపు కృష్ణమూర్తిశాస్త్రికి దక్కింది.

ఈ అవార్డు క్రింద పదివేల రూపాయలు, ప్రశంసాపత్రం లభిస్తాయి.

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా అమృతలూరులో జన్మించిన శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి విద్యాభ్యాసం దాదాపు గురుకుల వాసాలలోనే జరిగింది.

వీరు సుప్రసిద్ధ పండితులేగాక సంస్కృత నాటక రచయిత, ప్రయోక్తగా కూడా ప్రఖ్యాతి గాంచారు.

వీరికి నవంబరు 19న మద్రాసులో జరిగే ఒక కార్యక్రమంలో ఈ సాహితీ పురస్కారం అందజేయబడుతుంది.



## మధ్యలోనే రాలిపోయిన

## వెండితెర బంగారుతార

# కాంచనమాల

- ఆరిపాక సూరిబాబు

నర్తనశాలలో

తె లుగు చలనచిత్రసీమలో ధ్రువ
ారగా ప్రకాశించిన ఏకైకతార
ాంచనమాల. తన సహజ
ాందర్యంతో యావదాంధ్రులో కాన్ని
ఃద్రూతలూగించింది. నటిం
ునవి తక్కువ చిత్రాలే ఐనా
ిక్కువ ఖ్యాతిగాంచి ప్రేక్ష
హృదయాల్లో సుస్థిర స్థానాన్ని
ంపాదించుకుంది. అందానికి మారుపేరు కాంచనమాలనిఆంధ్ర దేశమంతటా నాడు వినిపించే మాట!

అనాటి నుంచి ఈనాటివరకు సహజసౌందర్య నటిగా ఒక్క కాంచనమాల పేరే సార్థకమై నిలచివుంది ఆమె కన్నులు మీనుల్లా మెరుస్తుండేవి. మోకాలివరకు నిడుపైనకురులు, సువర్ణరేఖ మామిడిపండు తీరు ముఖం, సంపెంగ లాంటి నాశిక దివినుండి భువికే తెంచిన అప్సరసాంగనలా ఆకర్షించేది అనాటి తోటి నటీనటులుకూడా కాంచనమాలను ఆరాధించేవారు అభినందించేవారు అంతటి సౌందర్యవతి



బాలనాగమ్మలో

తెనాలి నివాసి కాంచనమాల నాటకరంగంలో ప్రముఖనటులతో నటించి మంచిపేరు తెచ్చుకుంది తన తండ్రి, భర్త ప్రోత్సాహంతో కలకత్తాలో తీయబడిన "శ్రీకృష్ణతులాభారం"లో తొలిసారిగా నటించింది (1935) మిత్రవింద అనే చిన్న భూమిక

ఆ తర్వాత బొంబాయిలో తీయబడిన "వీరాభిమన్యు" చిత్రంలో నాయికగా నటించింది ఆమె బొంబాయిలో వుండగా, హిందీ చిత్రసీమలో ప్రసిద్ధులు ఈమెను చూడ్డానికి వచ్చేవారు నిర్మాత-దర్శకుడు మొహబూబ్ ఖాన్, నటుడు- నిర్మాత యాకూబ్ కాంచనమాల రూపలావణ్యాలకు ముచ్చటపడి తమ హిందీ చిత్రాలలో నటించమని, ఎక్కువడబ్బు, విస్తృతఖ్యాతి లభిస్తుందని తెలియజేస్తే, అందుకు కాంచనమాల తిరస్కరించింది అలా అన్నందుకు మొహబూబ్ నొచ్చుకున్నాడు (ఈ విషయం ఆ చిత్రానికి రచన చేసిన కొడవటిగంటి కుటుంబరావు చెప్పారు) "వీరాభిమన్యు" 1936సం లో విడుదలయింది

'విప్రనారాయణ' (1937) చిత్రంలో కాంచనమాల దేవదేవిగా, కస్తూరి నరశింహారావు విప్రనారాయణుడిగా నటించి ఇద్దరూ కీర్తి గాంచారు కాంచనమాల కీర్తిప్రతిష్ఠలకు మూలాధారమైన సంచలన చిత్రాలు మాలపిల్ల (38), గృహలక్ష్మి (38), ఈ రెండు చిత్రాలలో విభిన్న పాత్రలు చక్కగా పోషించి అందరికీ అభిమాన తారగా నీరాజనాలందుకుంది

వై వి రావు తీసిన జగదీశ్‌ఫిల్మ్స్ వారి మళ్లీ పెళ్లి (39) చిత్రంలో వితంతువుగా నటించి మంచి పేరు సంపాదిం

చుకుంది. ఏ అలంకారాలు లేకపోయినా ఎంతో ఆకర్షణీయంగా కనిపించింది. ఈ చిత్రం ఆనాడు ఆంధ్రదేశంలో గొప్ప సంచలనం కల్గించింది.

వాహినీవారి తొలిచిత్రం వందేమాతరం (39) నాగయ్యతో జంటగా నటించి ప్రేక్షకుల సానుభూతిని పొందింది. గృహిణిగా కష్టాలలో సతమతమయ్యే ఆ పాత్రను ఎంతో చక్కగా చేసింది.

తర్వాత కుబేరావారి మైరావణ (40) గూడవల్లి రామబ్రహ్మం తీసిన ఇల్లాలు (40), జెమినీవారి బాలనాగమ్మ (42) చిత్రాల్లో నటించి అందరి అభిమానాన్ని చూరగొంది. 'కాలచక్రం' చిత్రంలో నటించినా అంతగా రాణించ లేదు. 'పెంకి పెళ్లాం' (41) చిత్రంలో నటించినా ఆ చిత్రం ఏవో కారణాలవల్ల ప్రజలముందుకు రాలేదు.

తెలుగుచిత్రాలు తీసే ప్రముఖ నిర్మాత ఒప్పందపు నిబంధనల కబంధహస్తాల్లో చిక్కుకుపోవడం, ఇతర చిత్రాల్లో నటించడానికి వీలులేకపోయింది. పోనీ ఆ తమిళుడు తీసే తెలుగు చిత్రాలు అప్పుడు ఏమీలేవు. జీతం మాత్రం ఇచ్చేవాడు. తనుతీసిన ఒక చిత్రం నిర్మాణకాలంలో కాంచనమాల దురుసుగా ప్రవర్తించిందని ప్రతీకారంతో ఆమెను వెలుగులోకిరాకుండా చేశాడు. తత్ఫలితంగా ఆమె మతిచలించింది. మానసిక ఆందోళనకు గురికాబడింది. కొన్నాళ్లకు తన భర్త వెంకయ్యనాయుడు క్షయవ్యాధితో మరణించడంతో మరీ విలవిల్లాడిపోయింది.

ఒప్పందపు నిబంధనకాలం పూర్తయ్యాక కొందరు నిర్మాతలు ఈమెతో చిత్రాలు తీయాలని ఉబలాటపడ్డారు. త్రిపురనేని గోపీచంద్ "అనాధబాల", రాజమండ్రికి చెందిన కొందరు "గాంధీనగర్"అనే చిత్రం తీయాలని తలపెట్టారు. కానీ ఈమె పరిస్థితి బాగోలేనందున అవి ప్రయత్నాలుగానే మిగిలిపోయాయి.

శ్రీ కృష్ణతులాభారంలో తనతో పాటు నటించి ఎంతోఅభిమానించే లక్ష్మీరాజ్యం తన స్వంతచిత్రం "నర్తనశాల (63)లో కాంచనమాలని అతిథి పాత్ర



వేయించడం అతికష్టంమీద జరిగింది.

కాంచనమాలను అభిమానించి, ఆరాధించేవారు సినీమా ప్రేక్షకులేకాదు, కవులు, తోటి నటీనటులు, దర్శకులు, నిర్మాతలు ఎందరో వున్నారు. శ్రీశ్రీ రెండుసార్లు తన కవితల్లో కాంచనమాలని ఉటంకించాడు. "రాక్సీలో నార్మాషేరర్ - బ్రాడ్వేలో కాంచనమాల ఎటకేగుటో సమస్య కలిగిందొక విద్యార్థికి" అని సంధ్యా సమస్య కవితలో, మరో కవితలో "సినీమా పరిశ్రమ బాగుపడేదెప్పుడు? కాంచనమాల పిచ్చి కుదిరినప్పుడు!" అన్నాడు.

సుందరమ్మ, కాంచనమాల
"మాలపిల్ల" (1938)



భానుమతి ఆమెను చూడ్డాని తహతహలాడేనంది ఒకసారి. నా నటి కృష్ణవేణి తనుతీసిన 'దాంపత్యం'లో తన అభిమానాన్ని వ్యక్తం చేసుకోడ నికి కాంచనమాల పెద్ద ఛాయాచిత్రాని సెట్‌లో అమర్చి ప్రేక్షకులకు చూపింది

1935 సంవత్సరంలో ఆరంభించి తన సినీజీవితం 1942 సం.తో ము సింది. ఇంత తక్కువకాలంలో, తక్కు చిత్రాల్లో నటించి, ఎక్కువ కీర్తిగా చడమన్నది అరుదైన విషయం!

ప్రపంచ తెలుగు మహాసభల్లో కాం నమాలకు జమున చేజ్ఞాపికను ఇప్పిం సన్మానించారు.

తెలుగుతారల్లో ప్రేక్షకుల అభిమ నాన్ని, ఆరాధనాభావాన్ని చూరగొన తొలి తార కాంచనమాల. ఇంటింట ఆనాడు కాంచనమాల కేలండర్లు గో లకు వ్రేలాడుతుండేవి.

7 సంవత్సరాలకాలంలో 11 చిత్రా నటించి యావదాంధ్రలోకాన్ని ఉర్రు తలూగించి, మనోఫలకంపై నిలిచి యింది. అందానికి మారుపేరైన కాం నమాల తే. 24-1-1981 దిన మద్ర సులో మరణించింది.




కాలనీ చుట్టూ ప్రహరీ గోడ. ఎత్తు ఆరడుగులు ఉంటుంది. వెడల్పు ఒక అడుగు. గోడ మీద నిటారుగా నిలబడి చుట్టూ చూస్తున్న బుజ్జిగాడికి ఆ గోడమీధ నించి నడిచి నడిచి విసుగొచ్చి పట్టుంది.

ఏదో దీర్ఘాలోచనలో ఉండి పరాకుగా చుట్టూ చూస్తున్నాడు

గోడ అవతల రోడ్డు మీద నుంచి లారీలు రివ్వున సాగి పోతున్నాయి. ఒక లారీలో మొక్కలు చిన్న చిన్న గోలేల్లో ఎక్కడికో వెళ్ళిపోతున్నాయి.

చెంగున గోడ మీద నుంచి క్రిందకి గెంతాడు బుజ్జిగాడు

కాంపౌండు తుప్పలలో నుంచి పరిగెడుతూ ఉంటే ఎవరో పిలిచారు

"ప్రభాకరో ."

ఆగలేదు బుజ్జిగాడు. రంయ్ మని పరిగెడుతున్నాడు

ఆ కాలనీలో తెలుగు వాళ్ళు, బెంగాలీ వాళ్ళు, ఒరియావాళ్ళూ, కన్నడిగులు, మళయాళీలూ, తమిళులూ అంతా వున్నా, ఒరియావాళ్ళ సంఖ్యే ఎక్కువ.

ఒరియా పిల్లలతో ప్రభాకర్‌కి దోస్తీ వాళ్ళు పిలుస్తున్నారు అక్కడ గోళీకాయలాట జోరుగా సాగుతోంది

వాళ్ళ పిలుపు అందని దూరం వచ్చేశాక బుజ్జిగాడు తమ ఇంటి కాంపౌండు వంక మెల్లగా నడుస్తున్నాడు

వెనకనుంచి చంద్రో వచ్చాడు

"నాకు పది గోళీలు కావాలి . రేపు టౌన్‌లోకి వెళ్ళి కొనుక్కుంటా. మళ్ళీ ఇచ్చేస్తా ఎలానూ నువ్వు ఆటలోకి రావడం లేదు ఇయ్యవూ . " ఒరియాలో అడిగాడు

"నా దగ్గర గోళీలన్నీ అయిపోయాయి... ఓడిపోయాను వాళ్ళు లాక్కున్నారు... నాకు చాలా పని ఉంది " ఒరియాలోనే చెప్పి ముందుకు నడిచాడు ఇంతలో రోడ్డు మీద పడి ఉన్న రెండు పెన్ టార్చ్ సెల్స్ కనబడ్డాయి వంగి తీసి జేబులో వైరూ, చిన్న టార్చి లైటూ బల్బూ తీసి అది టెస్ట్ చేశాడు. బల్బు చిన్నగా వెలిగింది. అవి జేబులో వేసుకుని ఆలోచనలో ఇంటి వంక నడుస్తున్నాడు

చంద్రో వదల లేదు "కాలనీ గోడ వెనకాల పాన్ దుకాణంలో గోళీలున్నాయి కొనుక్కో వెళ్ళు" బుజ్జిగాడికి చిరాకు వేసింది

"కాని నా దగ్గర పైసలు లేవే?"

"ఇదిగో, ఇంద పావలా నానమ్మ ఇచ్చింది.... గెలిస్తే నాకు కొన్ని గోళీలియ్యాలి .."

"ఎన్ని?"

"గెలిచిన వాటిలో సగం. ."

"సరే"

బుజ్జిగాడి దగ్గర నుండి పావలా తీసుకుని చంద్రో వెళ్ళి పోయాడు.

బుజ్జి ఇంటికి రావడమేమిటి మేడ మీదకు పరిగెత్తి అక్క స్కూల్ బ్యాగ్‌లో ఫుట్ రూల్ తీసుకుని కిందకు దిగాడు

అది పద్మ కంట పడింది

"అమ్మా, నా ఫుట్ రూల్ తీసుకు పోతున్నాడే " అని వెంటనే తమ్ముడి మీద చెప్పేసింది

"బుజ్జీ! అక్కదెందుకు తీశావ్ "

"ఇప్పుడే ఇచ్చేస్తా "

మెట్లు దిగి స్కేలుతో దడి వరకూ పొడవూ, వెడల్పూ కొలుస్తున్నాడు లెక్క సరిగా రావడం లేదు.

స్కేలుతో నేల మీద గుర్తులు వేశాడు క్రిందటి రోజే వాన పడిందేమో మట్టి అంతా తడిగా ఉంది. నిలువునా, అడ్డనా చుక్కలు పెడుతున్నాడు కొద్ది కొద్ది దూరంలో

"అమ్మా, నా స్కేలుతో మట్టిలో గీస్తున్నాడే.. రేపు స్కూల్లో ఎలా? టీచరు కొడుతుంది" పద్మ లబోదిబోమంది

ఏమేమి చెట్లు వేస్తే బావుంటుందా అని ఆలోచించాడు పువ్వుల మొక్కలు వేస్తే పువ్వులు అందంగా ఉంటాయి. నానమ్మ పూజకి పనికి వస్తాయి

పండ్ల మొక్కలు వేస్తే ఎంచక్కా పళ్ళు తినొచ్చు మామిడి చెట్లొక పది జామ చెట్లొక పది నారింజ చెట్లు ఒక పదీ, నిమ్మ చెట్లు – నిమ్మ ఆవకాయ అంటే బాబాకి ఇష్టం ఇలా వేస్తే ఓహో బోల్డు పళ్ళు శలవల్లో తాతగారి ఇంటికి

వెళ్ళినపుడు నేరేడు పళ్ళు తిన్నాడు అవీ బాగానే ఉన్నాయి చెట్టు క్రింద కోసుకో నవసరం లేకుండా బోల్డు బోల్డు పళ్ళు రాలిపడి ఉన్నాయి

అవి చొక్కా ఒడిలోకి ఏరుతుంటే వెదవా బట్టలు పాడవుతాయి ఎక్కువ తింటే కళ్ళు కలకలూ అవీ పళ్ళాయని విస్మయానన్ని కోప్పన్నాడు అయినా జామపళ్ళు నేరేడు పళ్ళ కంటే బావుంటాయి అవే ఎక్కువ వెయ్యాలి

మామిడి పళ్ళు బోల్డు ఖరదు అవి ఎక్కువ వేసుకుంటే తినగా మిగలినవి అమ్మెయ్యవచ్చు నానమ్మ పెట్టే ఆవకాయికి బరంపురం వరకూ వెళ్ళి మామిడి కాయలు తెచ్చుకోనవసరం లేదు విజయనగరం నుంచి అత్త ఆవకాయకి మామిడికాయలు తీసుకు రానవసరం ఉండదు

మామిడి చెట్లే ఓ వంద వేసేస్తే ఆ జాగాలో అలా అలా చుట్టూ తిరుగుతున్నాడు బుజ్జి

ఎక్కడో టార్చిసెల్స్ వెతుక్కుంటూ ఉంటాడనుకున్న బుజ్జి తండ్రి ఐదున్నర గంటలకి బుజ్జిగాడు ఇంటి ముందే కనబడడం ఆశ్చర్యం అనిపించింది

"మీ వాడు కొలనీ కాంపౌండు గోడ మీద పచార్లు చేస్తున్నాడు రావుగారూ కాస్త జాగ్రత్త పడితే కాలో చెయ్యో విరుచుకుంటాడు "

"అవును సార్ అటు పక్క పడితే మరీ ప్రమాదం వచ్చే లారీలూ అవీ అయినా దుందుడుకు వాడు బుజ్జిగాడు మా వాడొకడు వీడికి తోడు సైకిళ్ళు పుచ్చుకున్నారంటే ట్రంకు రోడ్డు మీదయినా ఎలాంటి భయమూ లేకుండా రివ్వున వెళ్ళిపోతూ ఉంటారు "

మరొక తెలుగాయన రావుగారికి చెప్పాడు

"ఏరా బుజ్జీ ఏం చేస్తున్నావ్? ఆ స్కేలెందుకు తీశావ్? దానితో మట్టిలో గీస్తున్నావ్ అది మళ్ళీ పని కొస్తుందా?"

మొక్కలు వేసుకుంటే బావుంటుందని మన ఇంటి ముందు జాగాలో గుర్తు పెడుతున్నాను ఆవకాయకి మనం మామిడి కాయలు కొనుక్కోనక్కర లేదు పద్మకి జామకాయలు ఇష్టం కొబ్బరికాయల చెట్టు వేస్తే నానమ్మ పూజకి ఎంచక్కా కొబ్బరికాయలు కొనక్కర లేదు కదు బాబా పెద్దక్కకి గులాబీలూ, అమ్మ మల్లెలూ మరి కొనక్కరలేదు "

వాడి ముఖంలో ఏదో ఆనందం

"రావ్‌కి నవ్వొచ్చింది వెయ్యి వెయ్యి మంచిదే నేను టౌన్‌లోకి వెళ్ళాలి " అంటూ రావ్ మేడ మీద తన బాగంలోకి వెళ్ళిపోయాడు

మేడ మీద ఉన్న రెండు భాగాలలోనూ తెలుగు కుటుంబాలే ఉంటున్నాయి కింద ఒక భాగంలో గుజరాతీ వాళ్ళు మరొక భాగంలో ఒరియా వాళ్ళూ అంతా ఒకే సంస్థలో పని చేస్తున్నారు ఎవరి మా నాన్న వాళ్ళున్నా క్రింది భాగానికి ఉన్న పశువుల బెడద మీది భాగాలకి ఉండదు ఏ ఆవో వచ్చి మెట్ల దోవలో పడుకోకుండా ఓ దడి ముందుంది నాలుగు బాగాలకీ మేడకీ ముందు కొద్దిగా ఖాళీ స్థలం ఉంది

బుజ్జిగాడి ఆలోచన తెగడం లేదు అమ్మ కంటే మల్లెపూవు లంటే ఇష్టం నాన్నగారు మల్లెపూలు కొంటే నానమ్మ పూజకని కొన్ని తీసేసుకుంటుంది పద్మకి గులాబీలంటే ఇష్టం తన కయితే మామిడి కాయలూ, జామకాయలూ బావుంటాయి

మెట్ల మీద కూచుని ఆలోచిస్తున్నాడు

"ప్రభాకరో ఇవిగో గోళీలు ఆరు గెలిచా నీకు మూడు నాకు మూడు " ఒరియా వాళ్ళబ్బాయి వచ్చాడు

"బావుంది నా మూడూ కూడా నువ్వే తీసుకో ఆరేయ్ చంద్రో మామిడి కాయలు బావుంటాయా జామకాయలు బావుంటాయా?"

"నాకు గంగూరామ్ రసాగొల్లాలే బావుంటాయి "

వాళ్ళని చూస్తే బుజ్జిగాడికి జాలేసింది

"పోన్లే నువ్వు గోళీలు ఆడి అందరినీ గెలువు మొత్తం వాళ్ళందర్నీ ఓడించెయ్ నా దగ్గర మంచి డబ్బా ఉంది గోళీలు వేసుకోవడానికి బాగుంటుంది అది నీకిస్తా గోళీలు నిండిపోయాక అవన్నీ కొట్టువాడి కిచ్చేసి ఓ బంతి కొంటే ఎంచక్కా ఆడుకోవచ్చు బంతి ఆడే వాళ్ళందరూ తలా ఓ పావలా ఇవ్వాలి అలా డబ్బులు కూడ చేసి బ్యాటు కూడా కొనుక్కుందాం "

చంద్రో ప్రభాకర్ వంక ఎంతో గౌరవంతో చూశాడు నిజమే బంతి, బ్యాటూ కొనుక్కుంటే గోళీ కాయ లాట కంటే చాలా మజా వస్తుంది

–"చీకటిపడినా ఆట పూర్తి కాలేదా, ఒరేయ్ బుజ్జీ ఇక ఇంట్లోకి వచ్చి కాళ్ళూ, చేతులూ కడుక్కుని ఆ హోమ్ వర్క్ చేసుకో "

మీద నించి పిలిచింది ప్రభాకర్ తల్లి

చంద్రో, ప్రభాకర్ ఏమిటేమిటో ఆలోచనలు చేసేస్తున్నారు

"ఒరేయ్ బుజ్జీ అమ్మ పిలుస్తోంది మిదకిరా "

పద్మ వచ్చి స్కేలు వాడి చేతిలోంచి లాక్కుని మీదకి వెళ్ళిపోయింది

"నానమ్మా నానమ్మా నకు మంచి మంచి ముక్కలు కోసి పెట్టు ..."

పళ్ళూ కాస్తా '

–అసుర సంధ్య వేళ దీపం వెలిగించి స్తోత్ర రత్నావళి చదువుకుంటున్న నానమ్మ వాడి వంక గోముగా చూసింది

పుస్తకాలు ముందేసుకుని కూచుంది సావిత్రి

"ఏరా బుజ్జీ, చదువు నీదా? నాదా? అయిందా కాళ్ళు కడుక్కోవడం "

దేశ సంస్కృతి జాతి జీవన విదానంలో ప్రతిబింబిత మవుతుంది హిందూ సమాజంలో భౌతిక సుఖాల కంటె ఆధ్యాత్మిక విలువల పట్ల మక్కువ ఎక్కువ విదేశీ, పాశ్చాత్య నాగరికత పెరుగుతుండడం వలన భారతీయ తత్వం ఆనందం వంక, సుఖం వంకకు మొగ్గుతోంది డబ్బుతో కొనుక్కోగలిగేది సుఖం

ఈ విషయం పిల్లలకు బోధపడేలా చెప్పాలి తను అది ఎలా మనసుకి హత్తుకునేలా చెప్పాలా అని ఆలోచిస్తోంది తను

కాని ఎందుకో ఉద్యోగం వదలాలని పించడం లేదు కేవలం ఐదు వందల కోసం ఇంత శ్రమా? అదే శ్రమతో పదిమంది పిల్లలకి ఇంట్లోనే పాఠం చెప్పుకుంటే సరిపోతుంది కదా ఈ ఉద్యోగం ఎందుకని రావు చెబుతూనే ఉన్నాడు

తనని తను విశ్లేషించు కుంటోంది సావిత్రి నిజమే ఐదు వందల కోసమే రోజుకి ఆరు గంటల పాటు సరియైన గుర్తింపు లేని స్కూల్లో తను ఉద్యోగం చేస్తోంది

కారణం?



# నాకు నమ్మకం లేదే

వేణ్నీళ్ళకి చన్నీళ్ళలా పనికొస్తుందనా?

అలా అనడానికి ధైర్యం చాలదు... భర్త జీతం గాలుగు వేలు.... తమ ఖర్చుల్లో తన సంపాదన సముద్రంలో నీటిబొట్టు లాంటిది.

మరి తనెందుకు చేస్తోంది?

పది మందికి పనికి రావాలనా?... నిజంగా తనలో అంత సేవాదీక్ష ఉంటే జీతాలు సరిగ్గా ఇవ్వలేక పోతున్న బడే కదా! ఊరికే సేవగా జీతం తీసుకోకుండా చెయ్యవచ్చు కదా!

కాదు.. డబ్బు తనకు కావాలి... నిజంగా కావాలా? అంత అవసరమూ లేదు.

మరి ఎందుకు శ్రమ పడుతున్నట్టు?

ఇంట్లో మడీ, తడీ, ఆచారం, పూజా ఇవన్నీ అంటే తనకు తెలియకుండానే ఒక రకమైన విసుగా? సావిత్రి తల్లీ పూజలూ, వ్రతాలూ, నోములూ వీటిలో నమ్మకం ఉన్నదే–

కాని మడి అంటే చాదస్తం కాదు– మడి అంటే శుభ్రత. కానీ మడికీ, శుభ్రతకీ, చాదస్తానికీ మధ్య ఉన్న గీతలెంత సన్నటివి?–

సావిత్రికి సుఖం, ఆనందం మధ్య గీత గజిబిజిగా కనబడింది.

"అమ్మా.... నీ ఆలోచన లేనా నా లెక్కల సంగతి చూస్తావా?" బుజ్జిగాడు గోముగా అడిగాడు.

"వస్తున్నా... చెయ్యి లెక్క.... రాకపోతే అడుగు... ఇంగ్లీషు పాఠం రాశావా?... సైన్స్‌పరీక్షలో తక్కువ మార్కులొచ్చాయని చెప్పావు..."

దేవుడి గది లోంచి వింటూ ఉంది మీనాక్షమ్మ.

"నాకీ లెక్క రావడం లేదు..... నువ్వు చెయ్యి... నేను ఆ తరువాత ఎక్కించేసుకుంటా... ఇంతకీ మామిడి చెట్టుకి ఎన్ని కాయలు కాస్తాయి?...."

"ఏమిటీ?"

"మామిడి చెట్టు ఒక్కంటికి ఎన్ని కాయలు కాస్తాయి?"

"మామిడి చెట్టు లెక్క వచ్చిందా?"

"కాదు. అడుగుతున్నా...."

పరాకుగా బుజ్జిగాడి సైన్సు నోట్సు తిరగేస్తున్న సావిత్రికి సర్రున కోపం వచ్చింది.

"ఏమిట్రా, వెధవ ఆటలూ నువ్వూ... లెక్కలు చెయ్యరా అంటే మామిడి కాయలూ, గోళీకాయలూ మీటా వాగుడు...."

"శ్ అయితే నే లెక్కలు చెయ్యను.... నాకు రావడం లేదు.... పుస్తకం గిరవాటేసి దేవుడి గదిలోకి వెళ్లాడు బుజ్జి.

"నానమ్మా. కలకండ పెట్టవూ?...."

సావిత్రి కోపం తారాస్థాయికి అందుకుంది.

వేలెడంత లేడు. ఈ వెధవకి ఇంత కోపమా?

"ఒరేయ్ బుజ్జీ...." ఆమె చివాలున లేచి దేవుడి గదిలోకి వెళ్ళింది.

దళసరి కళ్ళద్దాల లోంచి పుస్తకం లోకి చూస్తూ ఏదో స్తోత్రం మెల్లగా చదువు కుంటున్న ముసలావిడ లేచి బుజ్జిగాడి చేతిలో నైవేద్యం పెట్టిన కలకండ ముక్క వేసింది.

"ఒరేయ్... బుజ్జీ ముందు ఆ పుస్తకం తెయ్యి. అలా గిరాటేశావ్– పుస్తకం అంటే ఏమనుకున్నావ్. సరస్వతి దేవి తెలుసా? తియ్యగా తీసి కళ్ళకద్దుకో...." అంది సావిత్రి.

"నే నద్దుకోను."

"తీస్తావా లేదా?"

"నే తియ్యను."

"తియ్యవూ?...."

"తియ్యను."

సావిత్రికి మరి కోపం ఆగలేదు.

"మీరే వాడిని పాడు చేస్తున్నారు." రోషంగా అని దేవుడి కంచులో వెలుగుతున్న వత్తి మీద చెయ్యి పెట్టేసింది....

"వెళ్ళి పుస్తకం తీస్తావా? చెయ్యి కాల్చేసు కోనా?"

"అమ్మా నాకు నమ్మకం లేదే...." బుజ్జిగాడు జాలిగా అన్నాడు. వాడి పంతం చూసి సావిత్రికీ పంతం పెరిగింది.

చూస్తుండగానే ఆమె చేతిని దీపం మీద పెట్టి ఉంచేసింది. చురుక్కు మంది చెయ్యి.

బుజ్జిగాడిలో చలనం లేదు. అలా చూస్తూ ఉండిపోయాడు.

ముసలావిడకి అంతా అగమ్యగోచరమై పోయి అవాక్కయి పోయింది.

చర్మం కాలిన వాసన గదిలో గుప్పుమంది.... బుజ్జిగాడు పరిగెట్టుకుని వెళ్ళి తన తల్లి చేతిని తీసేసాడు.

"అమ్మా నాకు నమ్మకం లేదంటే వినవేం?"... భోరున ఏడ్చేశాడు.

ముసలావిడ బిడ్డడ్ని ఒడిలోకి చేరదీసి,

"భడవా... నమ్మకం లేకపోతే మరి అమ్మ చెయ్యి ఎందుకు తీసేశావ్... అమ్మ చెయ్యి కాలిపోతేనేం అని ఊరుకో గలిగావా! నమ్మకం అంటే అదేరా తండ్రీ... నీ తల్లిమీద నీకున్న ఆపేక్ష ఎలాంటిదో, నీ తల్లికి నీమీద ఉన్న ఆపేక్ష అలాంటిదే. అదే ప్రేమ... అదే నమ్మకానికి ముందు మెట్టు."

"నానమ్మా... అమ్మ చేతికి మందు పూ యవూ..." వాడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు

"నే పెడతా... ముందు నువ్వు ఆ పుస్తకం తీసుకుని కళ్ళ కద్దుకో... ఊ ..లే..." వాడు బయటికి వెళ్లాడు.

"సావిత్రీ... నువ్వు చేసిన పని బాగా లేదు. పిల్లల్ని ఓపికతో లాలించి, నచ్చచెప్పి మలుచుకోవాలి. నేను పాతకాలపు దానినే అనుకో ఆరుగురి పిల్లల్ని పెంచడం ఎంత కష్టమో ఆలోచించావా? ఉన్న ముగ్గురితోనే ఇలా తంటాలు పడిపోతున్నావ్... నాకు నమ్మకం లేదని... వాడు చంటి వెధవ ఎందుకన్నాడో ఆలోచించావా?... ఆ ఆలోచనకి కారణం మనమే... మన పెద్ద వాళ్ళమే...ఆ మాట 'నాకు నమ్మకం లేదే' అని ఎవరో అనడం వాడు విన్నాడు. అరిందాలా అది నీమీద ప్రయోగించాడు. అరిందాలా అనడంతో నీ మనసుకి గుచ్చుకుంది. నీ పొరపాటు నీకు అర్థమై వాడికి నచ్చచెప్పే ఓర్మిలేక నిష్ఠూరంగా చెయ్యి కాల్చుకున్నావ్..."

అలమార నుండి వెన్నముద్ద దాచిన గిన్నె తీస్తూ అంది...

రావ్ స్కూటరు శబ్దం విని కళ్ళు తుడుచుకుంది సావిత్రి.

సోఫాలో కూర్చుని కళ్ళ వెంట నీళ్ళు కారుస్తూ పుస్తకం గుండెలకు అదుముకుంటున్న బుజ్జి గాడిని బయట కిటికీలోంచే చూశాడు రావ్.

"మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వంట గది వైపు నడిచాడు.

"సావిత్రీ... వాడొచ్చే వేళయ్యింది... ఇదంతా తెలిస్తే వాడి మనసు బాధ పడుతుంది?... పిల్లలలో మార్పు రావడానికి మనం చెయ్యాల్సింది ఇలా కాదమ్మా..."

"ఏం చేస్తున్నారూ?" అంటూ రావ్ గదిలోకి వచ్చాడు. సావిత్రి అరచెయ్యి మూసుకోవాలనుకుని "అబ్బ!" అంది.

"ఏమైంది?"

"చిన్న చురక... ఫరవాలేదు... అత్తయ్యగారు వెన్న పెట్టారు..."

"బాబా, బాబా, అమ్మేమో..." ఏదో చెప్ప బోయాడు బుజ్జి. తల్లి ముఖం చూసి ఆగి పోయాడు.

"అమ్మా, నాకు నమ్మకం కలిగిందే... ఇదిగో సరస్వతీదేవిని కళ్ళకద్దుకుంటున్నా!" అంటూ పుస్తకం అద్దుకున్నాడు. కన్నీటి చారికలు వాడి బుగ్గలమీద కనబడుతూనే ఉన్నాయి.

"బుజ్జీ!" సావిత్రి పిల్ల వాడిని కౌగిలించుకుంది.

-ఏమైందని అడగలేదు రావ్.

సావిత్రి చెబుతుందన్న నమ్మకం అతనికి ఉంది.

## రిషి పంథాలో సల్మాన్‌ఖాన్

క్రొత్త అమ్మాయిలతో నటించటంలో రిషికపూర్ రికార్డు సృష్టించాడు. అదే రీతిలో సల్మాన్‌ఖాన్ కూడా నడుస్తున్నాడట. భారతీయ చలన చిత్ర 75 ఏళ్ల చరిత్రలో పెద్దగా హిట్ అయిన 'మైనే ప్యార్‌కియా' చిత్రం నుంచి యిప్పుడు ఫైల్లో వున్న మాధురి, జుహీ, నీలంలను వదిలేసి కొత్త వాళ్లను బుక్ చేసుకుంటున్నాడు. రిషి రికార్డును సల్మాన్ బద్దలు కొట్టాలనుకుంటున్నాడేమో! మరి రిషి ఏం చేస్తాడో?

## కడార్ల రాజేందర్, జగిత్యాల

★ మీకు నచ్చిన క్రికెటర్, టెన్నిస్ ఆటగాడు ఎవరు?

● ఇంకా అంత పిచ్చి ముదిరి పోలేదు!

★ మీకు వృత్తి రీత్యా ఏదైనా ఉద్యోగం ఉన్నదా? వుంటే ఆ ఉద్యోగం ఏమిటో బోలేనా?

● వృత్తే– రాత! నమ్మండి నమ్మక పొండి అయినా 'లాభసాటి' ఉద్యోగాల్లో వుంటూ అంతకంటే 'లాభసాటి'– రెండో జాబ్ చేపట్టడానికి నేను గవర్నమెంటు ఉద్యోగినీ కాదు అత్యాశాపరురాలినీ కాదు.

## పోతోజు వెంకటాచారి, బోడుప్పల్.

★ అశ్లీల చిత్రాలను నిషేధించమంటూ దర్నాలు ఓ పక్క చేస్తూ అర్ధ నగ్న అందాల పోటీల కోసం ఎగబడు తున్నారు స్త్రీలు దీనికి కారణం ఎమిటి ? రా?

● ఒకటి నైతికం– ఎవరికీ ఒకరిని కించపరిచే హక్కు లేదని– అందులో స్త్రీ అయినంత మాత్రాన- రెండోది ఆర్థికం, డబ్బు కోసం, వృత్తి రీత్యా క్లబ్ డాన్సు చేసినంత మాత్రాన మీరామె స్త్రీ కనుక దెబ్బతీస్తారా?!

★ ఈ సంవత్సరాన్ని అంతర్జాతీయ సంవత్సరంగా ప్రకటించడం ఎంతవరకు సబబు? అమలు ఎలా జరుగుతుం దంటారు?

● మరీ అంత శల్యసారధ్యం చేస్తే ఎలా స్వామీ? విజయవంతం కావడం జనానికి అవసరం– రాజకీయ నాయకులకి కాదు వారెప్పుడూ కులం మీదా జనపు అజ్ఞానం మీదా తమ కోటలు కట్టుకుంటారు అంచేత ఆ రెండూ పోవడం నిజంగా రూపుమాపడం వారి ధ్యేయం ఎప్పుడూ కాదు కాని ప్రభుత్వపు బాధ్యతలు కొన్ని వుంటాయి కద– అవి వారు ప్రకటించినప్పుడు వాటిని విజయవంతం చేయాలని జనం తాపత్రయ పడాలి

## పి. వెంకటేష్, అయిజ

★ పెళ్లికి సాంఘిక ప్రకటన అవసరమా?

● అక్కర్లేదు– పిల్లలికి కావాలి!

## పెయ్యేటి చాముండేశ్వరి, ఒంగోలు

★ ఉత్తరాల రచయితల సంఘం పెట్టాలంటే ఉత్తరాలు రాసేవారికి ఎలా తెలియ చేయాలి?

● పత్రికలకి ఉత్తరాలు రాయడం ద్వారానే చిట్టి తల్లీ (మరీ కాంట్రాక్టు మాట్లాడుకున్నట్టు సీరియల్ రచయితలనే పొగుడుతూ రాయించడం పనిగాపెట్టుకోకు!)

## ఎం. ఆర్. చిట్టికృష్ణ, హైదరాబాదు

★ మేడం, ఓ నవల మంచిది అని పిలువబడేది ఎప్పుడు?




● పదిమంది చేత 'అనిపించి'నప్పుడు కాదు పది మంది అన్నప్పుడు

★ ఈ మధ్య మీరు చూసిన మంచి నవల ఏదేనా ఉంటే చెప్పండి

● చాలానే చూశా ముఖ్య చిత్రాలు చాలా కాస్ట్లీగా కన్పిస్తున్నాయి?

## సామ్రాజ్యలక్ష్మి, న్యూఢిల్లీ

★ చాలా కాలంగా ఆంధ్రపత్రికలో చాలా రెగ్యూలర్‌గా చదువు తున్నాను మీ ప్రశ్నావళి పేజీ ఎంతో ఆసక్తిగా చదువుతాను కాని యింతవరకు ఎప్పుడూ ఉత్తరం రాయలేదు మీ జవాబులు చాలా బాగుంటాయి 20-4-90 పత్రికలో ఎం ఎల్ కుమారి గారి కిచ్చిన జవాబు నన్ను ఎంతో కదిలించింది మీ మనస్సు అద్దంలో చూపించినట్లు అయింది ఎవరూ లేరని బాధపడేకన్నా మనసును మరో వైపు తిప్పుకుని సంతోషంగా వుండవచ్చును మీకు నా జోహార్లు

● సోదరీ, ఎన్నో సంస్థలలో తలదాచుకుందుకు– సర్వం కోల్పోయాక వచ్చే ఎందరెందరినో, చూసి మాట్లాడి, ధైర్యం చెప్పి– వారికి ఊరట కల్గించే ప్రయత్నాలు చాలా మంది చేస్తున్నారు అలాగే నేనూ ఒక సేవికనే. వృద్ధాశ్రమాలలో 'కుమిలిపోయే వారిని చూస్తే– నాకు కోపం కూడా వస్తూంటుంది– పిల్లలు దిక్కులేని వారిగా వదిలేశారని రోడ్డున పడ్డామని బాధపడతారు. చాలా మందికి వచ్చి చూసి పల్కరించి వెళ్లే దిక్కు కూడా వుండదు ఎడ్రసు లివ్వకుండా వచ్చి దిగ బెట్టేసి పోయే పిల్లల్ని, తిం లేకున్నా ఫరవాలేదు గౌరవంగా బ్రతుకుదావ పారిపోయివచ్చే పెద్దలని కూడా చూస్తూ వున్నాం . ఏదో ఎవరో ఆదుకుంటా రన్నది ఎప్ప మాట– ఈ రోజున డబ్బులేని వాడు దుబ్బ కొరగాడు– తల్లితండ్రులకే దిక్కులేదు ఇక అ చెల్లెళ్ల నాదుకునే దెవరు? అందుకే ధైర్యం అన్వేషణ ప్రారంభించాలంటా

## న్యాయ పతి రమేష్‌బాబు, హైదరాబాదు

★ నా దృష్టిలో ప్రతి మగవాడూ ప్రేమిం తీరాలి ప్రేమకు ఉన్నంత పవర్ మరి దేనికీ ల లేదు– ఒప్పుకుంటారా?

● నీటిమీద ప్రేమ వాగ్దానాలు రాసే మీర అంటూ వుంటే ఎలా కాదనడం?! మగవా




ప్రేమించడం ముఖ్యంగాని ప్రేమ సాఫల్యం అం ముఖ్యం కాదు కనుక– ఫరవా లేదు– ప్రేమించండి!

★ మగ పిల్లల తల్లితండ్రులకు కట్నాలు వేలక వేలు. లక్షలకు లక్షలు ఆడపిల్లల తల్లితండ్రుల యిస్తూనే వున్నారు యిచ్చి పుచ్చుకోవడాలు బాగ జరుగు తున్నప్పుడు గొంతు చించుకు పోయేలా మీ మహిళా సంఘాలు నిరాహార దీక్షలు సమ్మెలు ర్యాలీలు, నిరసనలు ఎందుకండీ దండగ!

● ఆశ చావదు కదా? ఏ ఒక్కరేనా మార పోతారా అని– యీ గోల

★ సినీ తారలకు సన్మానాలు చేసి డబ్బు చేసుకున వ్యాపార సాంస్కృతిక సంస్థలు హైదరాబాదులో ఎక్కువగా ఉన్నాయి

● మీకు సినిమారంగం అక్కడికి తరలి రావాలన కద కోరిక? సినిమా వాళ్ళు ఏదైనా కొనగలరు– (వారికి అవసరం అయితే!)

○






అడ్వొకేట్: బి.భాస్కరరావు ఎం.ఎ., ఎల్.ఎల్.బి.

ఎమ్. బాలాజీరావు, బళ్లారి (కర్నాటక)

ప్రశ్న: నేను గుంతకల్లులో బి. కామ్. వరకు చదివాను. నేను బళ్లారిలో ఏడవ తరగతి చదువుతుండగా మా తండ్రిగారు మరణించారు. మా తల్లిగారి పుట్టిల్లు గుత్తి. అందుచేత నేను గుంతకల్లులో ఏడవ తరగతి నుంచి బి. కామ్. వరకు చదివాను. 1983 లో బి. కామ్ ముగించాను. నేను ఇప్పుడు నిరుద్యోగిని. సర్టిఫికెట్ ప్రకారం నా పుట్టిన తేది 1-6-1959. కానీ నేను 11-4-1962వ తేదీన గుత్తి ప్రభుత్వ ఆసుపత్రిలో జన్మించినట్లు నా తల్లి ఈ మధ్యనే తెలియజేసింది. నేను గుత్తి గ్రామ పంచాయితీ ఆఫీసులో విచారించగా అది నిజమని తెలిసినది. నేను వారి దగ్గర జన్మ తేదీ సర్టిఫికెట్ తీసుకున్నాను. ఇప్పుడు పుట్టిన తేదీ సర్టిఫికేట్‌లో మార్పు చేయాలంటే ఏమి చెయ్యాలి?

జవాబు: మీకు అన్నదమ్ములు, ఉన్నట్లు వ్రాయలేదు. మీరు ఒక్కరే సంతానం అని తెలుస్తున్నది. గుత్తి గ్రామ పంచాయితీ వారు మీ జన్మ తేదీ సర్టిఫికేట్ ఇచ్చారు. గనుక మీ జన్మ తేదీ మార్చమని గుంతకల్లు మున్సిఫ్ మేజిస్ట్రేట్ కోర్టులో దావా వెయ్యండి. మీరు నిరుద్యోగి గనుక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల జన్మ తేదీ నిబంధనలు (1984) మీకు వర్తించవు. పుట్టిన తేదీ గురించి ఉమేశ్‌చంద్ర కేసులో 1982లో ముగ్గురు జడ్జీలు గల సుప్రీంకోర్టు ధర్మాసనం తీర్పు చెప్పారు. ఉమేశ్‌చంద్ర పుట్టిన తేదీ మునిసిపల్ రికార్డులలో వ్రాయబడలేదు. అయినప్పటికీ భారతీయ సాక్ష్య చట్టము (1872) లోని 35 సెక్షన్ ప్రకారం స్కూలు రికార్డులను పరిగణనలోనికి తీసుకోవాలని, సుప్రీం కోర్టు తీర్పు చెప్పారు. కాబట్టి మీ పుట్టిన తేదీ గుత్తి గ్రామ పంచాయితీలో వ్రాయబడినట్లు సర్టిఫికేట్ ఇచ్చారు. గనుక మీ పుట్టిన తేదీ మార్చమని కోర్టులో దావా వెయ్యండి. మీకు అనుకూలంగా కోర్టు ఉత్తర్వులు ఇచ్చిన తర్వాత పుట్టిన తేదీ మార్చమని హైదరాబాద్‌లోని సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డునకు వ్రాయండి.

ప్రభాకర్, హైదరాబాద్-27

ప్రశ్న: మేము ఇద్దరము అన్నదమ్ములము. 1989 సెప్టెంబర్‌లో మా తండ్రి మరణించారు. 1985లో మా తండ్రి ఒక వీలునామా వ్రాశారు. అందులో మా ఇద్దరికి రెండు సమాన భాగములు చేసి ఇల్లు వ్రాశారు. బ్యాంక్‌లో ఉన్న డబ్బును సమాన వాటాలుగా మా ఇద్దరి పేరున వ్రాశారు. మాకు ఇద్దరు అక్కలు, ఇద్దరు చెల్లెళ్లు ఉన్నారు. వారికి వివాహము అయినది. వారికి బ్యాంక్‌లో డబ్బు అడిగే హక్కు ఉన్నదా?

జవాబు: మీ అక్కలు, మీ చెల్లెళ్లకు వివాహము అయినది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు పుల్లారెడ్డి కేసులో వివాహము అయిన ఆడపిల్లలకు తండ్రి ఆస్తిలో హక్కు లేదని 1987 లో తీర్పు చెప్పింది. కనుక వివాహము అయిన మీ చెల్లెళ్లు, అక్కలకు మీ తండ్రి ఆస్తిలో హక్కు లేదు.

కొసన హనుమంతరావు, అనకాపల్లి.

ప్రశ్న: నేను మునిసిపల్ బాలికల ఉన్నత పాఠశాలలో 1984-85లో ఏడవ తరగతి చదివాను. ఏడవ తరగతిలో అత్యధిక మార్కులు వచ్చినందున మొదటిసారిగా 1985-86లో తెలుగు విజ్ఞాన పారితోషికము 500 రూపాయలు పొందితిని. రెండవసారి 1986-87 లో విజ్ఞాన పారితోషికము పొందితిని. మూడవసారి 1987-88లో విజ్ఞాన పారితోషికము అందలేదు. నేను మా ప్రధానోపాధ్యాయునితో జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయమునకు వెళ్లగా వారు 1984-85లో మొదటిసారిగా నా పారితోషికము పంపినట్లు తెలిపారు. నా పారితోషికము అందలేదు. నేను చాలాసార్లు విశాఖపట్నం వెళ్లి వినరములు అడుగగా మాట్లాడటం లేదు. నాకు పారితోషికం అందేటట్లు చేస్తారని కోరుతున్నాను. మీరు నాకు సలహా ఇవ్వవలెను.

జవాబు: మీరు బాలికోన్నత పాఠశాలలో ఎలా చదువుతున్నారో వివరించలేదు. మీరు 1984-85లో ఏడవ తరగతి ప్యాస్ అయి అత్యధికంగా మార్కులు వచ్చినందువలన మీకు పారితోషికం 1985-86లో ప్రభుత్వం మంజూరు చేశారు. రెండవ పారితోషికం 1986-87లో మూడవ పారితోషికం 1987-88 లోను ప్రభుత్వం మంజూరు చేశారు. విశాఖపట్నం జిల్లా శాఖాధికారి మీ పారితోషికం డ్రా చేసినట్లయితే అది మీకు చెల్లించి వెయ్యాలి, లేదా దుర్వినియోగం జరిగి వుండాలి. ఇక మీ పారితోషికం ఇప్పుడు చెల్లించాలంటే ప్రభుత్వం మళ్లీ మంజూరు చెయ్యాలి. గ్రాంట్ లేప్స్ అయిపోయి వుంటే మళ్లీ బడ్జెట్‌లో ఈ పారితోషికం చేర్చాలి. వెంటనే మీకు పారితోషికం అందటం కష్టం. ఏమైనా మీ పారితోషికం గురించి ఎవరూ పట్టించుకున్నట్లు లేదు. కనుక మీరు సివిల్ ప్రొసీజర్ కోడ్‌లోని 80 సెక్షన్ క్రింద లాయర్ నోటీసు విశాఖపట్నం జిల్లా విద్యాశాఖాధికారికి, కలక్టర్‌కు పంపండి. మీ నోటీసు అందిన వెంటనే సమాధానం వస్తుంది. లేనట్లయితే 60 రోజులు దాటిన తర్వాత అనకాపల్లి మున్సిఫ్ కోర్టులో దావా వెయ్యండి. మరొక గత్యంతరం లేదు కదా!

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..........................................................................

పేరు: ..........................................................................

పూర్తి చిరునామా: ..........................................................................

..........................................................................

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

తారానాథ్‌కు వేకువ ముందే లేచే అలవాటుంది. ఆ రోజు నాలుగు మ్ముప్పావుకు లేచి కూర్చుని వళ్ళు విరుచుకున్నాడు.

పక్కన మంచంమీద బోర్లగా పడుకుని నిద్రిస్తున్న చంద్రిక నగ్న దేహం బెడ్ లైట్ వెల్తుర్లో కనపడింది.

ఇంద్రనీలమణులు నెత్తిన దిమ్మ రించినట్టు జుట్టు తలచుట్టూ పరచుకుని వుంది.

మనసులో ఎగసిపడే కోర్కెను బలవంతాన అణచుకుంటూ 'ఇపుడు కాదు' అనుకున్నాడు.

లేచి నిలబడ్డాకగాని తను నగ్నంగా వున్న సంగతి అతనికి గుర్తు రాలేదు.

గది నాలుగు మూలలూ పరికించి చూచి వాకిలి దగ్గర పడివున్న లుంగీ చేతి కందుకున్నాడు.

లుంగీ చుట్టుకుంటూంటే రాత్రి జరిగిన సంఘటనల అనుభవాలు గుర్తుకు రాసాగాయి.

పెళ్ళయి పదేళ్ళయినా చంద్రిక నుండి పొందుతున్న సుఖం నిత్యనూతనంగా ఎప్పటి కప్పుడు కొత్త చిగుర్లు వేస్తున్న లతలా నవ నవోన్మేషంగా వుంటున్నది.

తారానాథ్ చంద్రికను వివాహం చేసుకున్నపుడు అందరూ "ఇది మూణ్ణాళ్ల ముచ్చట" అన్నారు.

అప్పుడతని వయసు ముప్పై ఒకటి. చంద్రిక వయసు పదిహేడు.

మోటార్ సైకిల్ రేసుల్లో ఆలిండియా ఛాంపియన్‌గా వరుసగా మూడేళ్ళు గోల్డ్ మెడల్స్ తీసుకున్న తర్వాత అతనిలో ఏదో నిర్లిప్తత నిరామయత్వం ఆవహించసాగింది.

"ఇక ఇతని . ఛాప్టర్ క్లోజ్. ఈసారి యితనికి ఛాంపియన్‌షిప్ దక్కదు" అని ఇతరు లనుకోవడం అతను చెవులారా విన్నాడు.

చంద్రిక పదహారో ఏడు సినీ ఫీల్డులో అడుగెట్టి సంవత్సరంలో నే తారాజువ్వలా నెంబర్ వన్ పొజిషన్‌లోకి వెళ్ళిపోయింది.

అనుకోకుండా బీచ్‌లో పరిచయం అయ్యారు తారానాథ్ చంద్రిక! ఇద్దరూ సెలెబ్రిటీస్ కనుక మూడో వ్యక్తి అవసరం లేకుండానే ఒకరి నొకరు గుర్తు పోల్చుకున్నారు. ఒకరి కొకరు తారసపడిన క్షణం మహత్యం ఏమిటో గాని చంద్రిక షూటింగ్ జరిగే ప్రదేశానికి తారానాథ్, తారానాథ్ పాల్గొనే రేస్‌కు చంద్రిక హాజరవసాగారు.

సూపర్ హాట్ రొమాన్స్‌గా పత్రికలలో గాసిప్ రావడం మొదలయిన కొద్ది రోజుల్లోనే వివాహం చేసుకున్నారు తారానాథ్ చంద్రిక!

వివాహం అయిన దగ్గర్నుండి తారానాథ్ జీవితంలో మహర్దశ మొదలయింది'

"అద్భుతమైన వాడితో ప్రేమ నటిస్తూ సినిమాల్లో నటించడం నా వల్ల కాదు' అంటూ సినీతారగా తన జీవితానికి చరమ గీతం పాడింది చంద్రిక.

"చంద్రీ నీలోని అసాధారణ నటనాశక్తిని నాశనం చేసానన్న చెడ పేరు నాకెందుకు. నువ్వు సినిమాల్లో నటిస్తూనే వుండు". అన్నాడు తారానాథ్.

"ఊహు- నేను నిర్ణయం తీసుకున్నా తిరుగుండదు".

"పోనీ ఒక పని చెయ్యి- . నువ్వు అద్భుతంగా పాడుతావు హీరోయిన్లక ప్లేబ్యాక్ పాడు- జనం శ్రావ్యమైన నీ కంఠం విని నీ రూపును వూహించుకుంటారు".

"సరే" వెంటనే వొప్పుకుంది.

చంద్రిక గాత్రం హీరోయిన్లందరకు సరిపోయింది. కొద్ది నెలలలోనే నంబర్ వన్ గాయనీమణిగా మారింది చంద్రిక.

ఈ లోపల మోటార్ సైకిల్ రేసెస్‌లో అనేక రికార్డులు బద్దలు కొడుతూ భారత దేశస్థులెవరూ మున్నెన్నడూ సాధించని

**ఇంతవరకూ సాగిన కథ - 1 :** ఆమె పేరు మోహిని. సినిమాథియేటర్‌లో తనను కలుసుకున్న అతన్ని తన ఎపార్టుమెంటుకు తీసుకువెళ్తుంది. ప్రణవనాథ్‌గా గుర్తించిన ఆమె అతన్ని తన . పిస్తోలుకు బలిచేస్తుంది.

విజయాలను సాధించ సాగాడు తారానాధ్.

మాతా కంపెనీ యజమాని రుస్తుంజీ తారానాధ్‌ను పిలిపించుకుని మాతా మోటార్స్‌లో డైరెక్టరుగా ఉద్యోగం యిచ్చాడు.

ఉద్యోగం యిచ్చాడనేకంటే ఆయన తారానాధ్‌ను ముఖ్య సలహాదారుడుగా జేర్చుకున్నాడంటే నిజానికి దగ్గరగా వుంటుందేమో!

కాలం గడిచిన కొద్దీ పిల్లలు లేని రుస్తుంజీకి తారానాధ్ ఆత్మీయుడై పోయాడు.

తారానాధ్ రుస్తుంజీని పితృ భావంతోనూ రుస్తుంజీ తారానాధ్‌ను కన్న బిడ్డ కన్న మిన్నగానూ చూచుకోసాగారు.

మాతా మోటార్స్‌లో తయారయ్యే మోటార్ సైకిల్స్ డిజైన్ దగ్గర్నుండి మార్కెటింగ్ వరకూ ప్రతి విషయంలో నూ తారానాధ్ సలహాలు తీసుకునే వాడు రుస్తుంజీ. అందుకే కొత్త రకం "సూపర్ ఫాస్ట్ మొబైక్ తయారు చేద్దాం" అని రుస్తుంజీ అనగానే రాత్రింబగళ్ళు ఆలోచించి నమూనా మొబైక్ మోడల్ సిద్ధం చేసాడు తారానాధ్.

"గుడ్- ఉయ్ విల్ ప్రొసీడ్ విత్ ద మాన్యుఫాక్చర్ ఆఫ్ ది మోడల్" అన్నాడు రుస్తుంజీ.

కొత్త మొబైక్ తయారయింది! మొదటి మొబైక్ ట్రయల్ రన్ వేసి చూడాలని తారానాధ్ నిర్ణయించుకున్నాడు.

అందుకే ఆ రోజు పెందలకడ ఫ్యాక్టరీకి ప్రయాణమవాలనుకున్నాడు.

వాకిలి దగ్గర పడివున్న లుంగీని తీసి చుట్టుకుని వంట యింటిలోకి వెళ్ళి బ్లాక్ కాఫీ తయారు చేసుకుని తాగుతుంటే తారానాధ్‌కు రాత్రి బెడ్‌రూం సీన్లు గుర్తుకు రాసాగాయి.

"షి యీజ్ ఎ రియల్ గర్ల్" అనుకున్నాడు.

మంచం మీద జేరాక ఒకరి దుస్తులు ఒకరు తీసి వేయడం అలవాటు చేసుకున్నారు.

తారానాధ్ బెడ్‌రూం బయట మీరు



అని పిలిచే చంద్రిక బెడ్‌రూంలో చేరగానే చనువుగా 'రారా', 'ఏరా', 'ఏమిట్రా' అని పిలుస్తూ అతన్ని కవ్వించటానికి అతను నేర్పిన బూతు మాటలుపయోగిస్తుండేది.

ఆ రాత్రి తనకంటే పదహారేళ్ల చిన్నదైన చంద్రికతో సమంగా ఉత్సాహం చూపటానికోసారి తారానాథ్ శరీరం వెనుకాడింది.

"గేరు మార్చురా- మూవ్‌మెంట్ స్లో అయింది" అని చంద్రిక తారానాథ్ చెవిలో గొణగగానే రెట్టించిన ఉత్సాహంతో పెచ్చురిల్లి ప్రవర్తించసాగాడు.

"ఎంతమందినో రేసుల్లో వోడించావు- ఇప్పుడు వెనకబడతావేంరా?"

""నో నెవర్! తారానాథ్ వోటమి ఎరుగడు!"

"ఈజ్ యిట్"

"యస్ చంద్రీ"

"......."

ఇద్దరి శరీరాలు గ్లానికి లోనయి, మనసులు నిస్తేజంగా మారిన దాకా తారానాథ్‌ను కవ్విస్తూనే వుంది చంద్రిక.

అలసి రొప్పుతూ విశ్రాంతిగా పడుకున్న సమయంలో గిరుక్కున లేచి కూర్చుని "వన్, టూ, త్రీ..." అంటూ అంకెలు లెక్కపెట్టసాగింది.

ఆరు లెక్క పెట్టక ముందే లేచి కూర్చుని "నో అయామ్ నాట్ అవుట్"- అంటూ ఒడ్డాన్నయ్యాడు.

"అరే గురూ- నువ్వెంతకూ కదలకపోతే నాక్ అవుట్ అయ్యావనుకున్నారా!" అంది చంద్రి.

"నో చంద్రీ"

తెల్లవారు జామున అలసి చెమట స్నానం చేసిన శరీరాలు బడలికతో నిద్రలోకి జారుకున్నాయి.

ఖాళీ కాఫీ గ్లాసు సింక్ దగ్గరుంచి స్నానాల గదిలోకి వెళ్లాడు తారానాథ్.

పది నిముషాల్లో స్నానం చేసి బెడ్‌రూంలోకి వచ్చి ప్యాంట్, స్పోర్ట్స్ బనియన్ సాక్స్ స్నీకర్స్ వేసుకుని వెళ్లబోతూ డబల్ కాట్ దగ్గరకు వెళ్లాడు.

దక్షిణపు వైపు నున్న కిటికీ నుండి తోటలోని గులాబి పొదల మీదుగా

# మోహినీతాండవం

వస్తున్న మలయ మారుతానికి చంద్రిక స్వల్పంగా వణకడం చూచి బెడ్‌షీట్ ఆమె మీద కప్పాడు.

ఆమె కోరిక ప్రకారం యింట్లో పనివాళ్లు లేరు. "ఫ్రీగా యింట్లో వుండటానికి వీలుండదు" అని వివాహం అయిన మొదట్లో చంద్రిక అన్న మాటలు గుర్తొచ్చి నవ్వుకున్నాడు తారానాథ్.

"వెళుతున్నా చంద్రీ" అంటూ బెడ్‌రూం తలుపు దగ్గరకు వేసి వెళ్లిపోయాడు తారానాథ్.

"వెళ్లకురా" అంటూ మత్తుగా అంటున్న చంద్రిక మాటలు అతనికి వినపడలేదు. వినపడి అతను ఆగి వుంటే తర్వాత దుస్సంఘటన జరిగి వుండేది గాదు.

## 2

ద్రాక్షారామప్రసాద్ తన కప్పగించిన పనిని బహు క్షుణ్ణంగా పరిశీలించటం అలవాటు చేసుకున్నాడు. తను చేయవలసిన వివిధ కార్యక్రమాలను పద్ధతి ప్రకారం విభజించి కాగితాని కొక వైపున రాసుకున్నాడు. రెండో వైపున ఆయా కార్యక్రమాలను అమలు చేస్తే వచ్చే ప్రమాదాలను తీవ్రతను బట్టి వరుసగా రాసుకున్నాడు.

కాగితం రెండు వైపులా నిశితంగా అనేకసార్లు పరిశీలించి ఏ పద్ధతి ననుసరిస్తే తక్కువ ప్రమాదకరంగా వుండి ఎక్కువ విజయవంతం అవుతుందో నిర్ధారించుకున్నాడు.

ద్రాక్షారామానికి కావలసిన ప్రతి



## కీర్తి 'కిస్ మీ'

కిమీకాట్కర్ స్థానంలో యిప్పుడు మరోనటి హిందీ చిత్రరంగంలోకి అడుగుబోతోంది. కీర్తిసింగ్ అనే ఈ క్రొత్త నటి 'జంగిల్ లవ్' అనే చిత్రంలో నటిస్తున్నది. ఈ చిత్రంలో గోగాకపూర్ కూడా నటిస్తున్నాడు. ఈ 'జంగిల్ లవ్' చిత్రమే కాకుండా కీర్తి 'కిస్‌మి అనే చిత్రంలో కూడా నటిస్తోంది మరి కిమీ లేనిలోటు కీర్తి ఎంతవరకు తీరుస్తుందో చూడాలి!

విషయం బహు చిన్న వివరాలతో సహ అదివరకే అందించారు!

కొత్త మొబైక్ 'చంద్రిక' డిజైన్ ప్లాన్, మాతా మోటార్ కంపెనీ ప్లాన్, సెక్యూరిటీ గార్డులుండే ప్రదేశాలు, వాళ్ల గస్తీ అలవాట్లు తారానాథ్, రుస్తుంజీ, కొత్త మోడల్ బళ్లు నడిపే ఇద్దరు స్పేర్ డ్రైవర్లను గురించిన పూర్తి వివరాలు, మద్రాస్ శివార్లలో మాతా మోటార్స్ వున్న అన్నానగర్ వివరాలు అన్నీ అతని ముందున్నాయి.

అన్నానగర్‌లో ఎక్కువ భాగం మాతా మోటార్ కంపెనీ ప్లాంట్, ఆఫీస్ బిల్డింగ్, వర్కర్స్ క్వార్టర్స్ కాఫీ హోటల్స్, ప్రొవిజన్ స్టోర్స్‌లతో నిండి వుంది. అయితే అన్నానగర్‌లో ఒక పక్కన సినిమా షూటింగ్‌కు పనికి వచ్చే మినీ డిస్నీలాండ్ మోడల్‌లో 'సంపత్ లాండ్' ఏర్పాటు చేసాడు సంపత్ అనే కోటీశ్వరుడు.

సంపత్ లాండ్‌ను అందులో నిత్యం జరిగే సినిమా షూటింగ్స్‌ను చూడటానికి ప్రతి రోజూ అనేక వందల మంది

# చతుష్పథం

"నువ్వెవరు?" = "నేను ప్రశ్నని!"
"ఏం కావాలి?" = "సమాధానం కావాలి"
"ఎక్కడనుంచి వస్తున్నావు?" = "సందేహంలోంచి"
"ఇక్కడ లేదు సమాధానం!" "ఎక్కడుంటుంది?"
"అతడివద్ద!" "ఎవరతను?"
"జ్ఞానం!" = "అతని చిరునామా ఏమిటి?"
"చాలా చిరునామాలున్నాయి!" = "కొన్ని చెప్పండి!"
= "అనుభవం, అక్షరం, ఆలోచన..." = "అవన్నీ నాకు తెలుసు!"
= "తక్కినవి నేను చెప్పను!" – "ఎవరు చెబుతారు?"
= "ఆమె నడుగు" "ఆమె ఎవరు?"
= "బుద్ధి!"

-డా. మిరియాల రామకృష్ణ

టూరిస్టులు అన్నానగర్‌కు వస్తారు.

"రైట్- మన పనికి మరీ అనుకూలం. దేశం నలుమూలల నుండి అనేక మంది టూరిస్టులు వస్తుంటారు గాబట్టి అన్నానగర్‌కు వచ్చే ఆగంతకులను గూర్చి ఎవరూ పట్టించుకోరు" అనుకున్నాడు ద్రాక్షారామం.

మాతా మోటార్స్ తయారీలో వున్న వినూత్న మొబైక్ చంద్రికకు, తారానాథ్ తన భార్య పేరు పెట్టుకున్నందుకు కారణం వుంది.

గతుకుల రోడ్డు మీద కూడా స్పీడుగా వెళ్ళే విధంగా దృఢంగా వుండడమే గాకుండా అత్యంత అధునాతన మైన కంప్యూటర్ పరిజ్ఞానం వుపయోగించి తయారైన ఎలక్ట్రానిక్ బోర్డ్ మొబైక్‌ను స్విచ్ వేసిన దగ్గర్నుండీ స్విచ్ తీసిన దాకా సర్వకాల సర్వావస్థల యందూ అన్ని విషయాలను కంట్రోలులో వుంచుతుంది.

పెట్రోలు ఎంత వుంది, బండి ఎంత వేగంతో నడుస్తున్నది, అంత వేగంతో నడుస్తున్నప్పుడు లీటర్ పెట్రోల్ ఎన్ని కిలో మీటర్లు నడుపుతుంది. టైర్ల కండిషన్ ఎలా వుంది. గాలి సరిగ్గా వుందా, బ్రేక్ సిస్టమ్ సక్రమంగా వుందా, ఫ్రంట్ ఏక్సిల్ రేర్ ఏక్సిల్ కండిషన్‌లో వున్నాయా, ఏక్సిల్స్ మీద ఒత్తిడి మితిమీరి లేదు గదా అన్న విషయాలు ఎప్పటికప్పుడు చెక్ చేస్తూ లోపం వున్నప్పుడు ఆ విషయం ఎర్ర అక్షరాలలో బోర్డ్‌లో కనపడేట్టు చేస్తుంది.

అంతేగాదు బండి స్పీడ్‌ను బట్టి గేర్‌ను దానంతటదే మార్చుతుంది కూడా!

తారానాథ్ చంద్రికతో కాలం గడపటాని కెంత కుతూహల పడుతుంటాడో మొబైక్ డిజైన్ చేసేప్పుడు అంత కుతూహలం చూపేవాడు.

తృప్తి నివ్వడంలో చంద్రికను మించిన స్త్రీ వుండనట్టే కొత్త మొబైక్‌ను మించిన మోటార్ సైకిల్ వుండగూడదని తారానాథ్ అనుకునేవాడు.

కొత్త మొబైక్ తయారీ వివరాల రహస్యం తెలిసినప్పుడే ద్రాక్షారామం మనసులో ఆ ఆలోచన మెదలింది.

మాతా మోటార్స్ ఫ్యాక్టరీలో రక్షణ ఏర్పాట్లు ఎంతో పకడ్బందీగా వుంటాయి. రక్షణ వలయాన్ని ఛేదించుకు లోపలకు వెళ్ళడమే ఎంతో కష్టం. ఒకవేళ లోనికి వెళ్ళినా మొబైక్ మాడల్ దగ్గరకు వెళ్ళడం దుస్సాధ్యం. అందరికీ కనపడే విధంగా అద్దాల కేసులో వుంచారు మొబైక్ మోడల్‌ను అందువలన ఫ్యాక్టరీ లోపల మొబైక్‌ను టాకిల్ చేయడం అసాధ్యం.

మాతా కంపెనీ అనుబంధ సంస్థలలో మాతా ఎలక్ట్రానిక్స్ ఒకటి. రాయవెల్లూరు దగ్గర ఒక కుగ్రామంలో ఏర్పాటు చేసారు మాతా ఎలక్ట్రానిక్స్ యూనిట్‌ను. తిరుమంగళం అనే కుగ్రామం పొలిమేరల్లో వుందా యూనిట్.

పది ఎకరాల స్థలంలో ఏర్పాటు చేయబడ్డ ఆ యూనిట్‌కు నామకః గేటు దగ్గర ఒక సెక్యూరిటీ గార్డు వున్నాడు. యూనిట్‌లో పని చేసే వాళ్ళలో ఎక్కువ మంది చీకటి పడే సరికి పని ముగించుకుని బిల్డింగ్‌కు తాళం వేసి వెళ్ళిపోతారు.

మేనేజర్ అసిస్టెంట్ మేనేజర్ మాత్రం ఆవరణలోని క్వార్టర్సులో వుంటారు.

అమావాస్య రెండు రోజులుందనగా ద్రాక్షారామం మాతా ఎలక్ట్రానిక్స్ యూనిట్ బిల్డింగ్ వెనుక నున్న వెంటిలేటర్ గుండా లోపలకు వెళ్ళాడు.

హాలులో ఒక పక్కన బల్లల మీద వరుసగా కంప్యూటర్ బోర్డులు కనపడ్డా యతనికి. కొన్ని వేల బోర్డులు తయారయి వున్నాయి. బల్ల మీద చంద్రిక మొబైక్ అన్న బోర్డు చూచి సంతృప్తిగా తలూపాడు. ఫర్ టెస్ట్ బైక్ అన్న బోర్డును చూడగానే అతని కళ్ళు ఆనందంతో మెరసాయి. దూరాన ఎక్కడో గార్డు తిరుగుతున్న సవ్వడి వినపడుంది.

ద్రాక్షారామం ఎక్స్ప్లోజివ్స్ గురించి తనకు వున్న పరిజ్ఞానాన్ని పూర్తిగా వినియోగించదలిచాడు.

మినప గింజంత పరిమాణంలో వున్న సి-4 బాంబు ఎలక్ట్రానిక్ బోర్డ్‌లో అమర్చాడు. (ఆ బాంబునే ఫ్రాన్స్‌లో ప్లాస్టిక్ అని ముద్దు పేరుతో పిలుస్తారు.)

బాంబు నుండి సన్నని వైర్లు స్పీడో మీటర్ సెంటర్‌కు, గ్యాస్ టాంక్ సెంటర్‌కు, ఫ్రంట్ ఏక్సిల్ సెంటర్‌కు కలిపాడు. మొబైక్ స్పీడ్ వంద కిలో మీటర్లు అందుకోగానే ముందు ఫ్రంట్ ఏక్సిల్ విస్ఫోటనకు లోనవుతుంది. ఆ తర్వాత రెండు సెకన్లకు పెట్రోల్ టాంక్ బద్దలైపోతుంది.

చూచేవాళ్ళకు మొబైక్ తయారీలో ఏదో లోపం వుండి ఫ్రంట్ ఏక్సిల్ విరిగి బండి అడ్డదిడ్డంగా పరుగెత్తి టాంకు బద్దలయిపోయి తునాతునక లయిందనిపిస్తుంది.

"మొబైక్ తయారీలోనే ఏదో లోపం వచ్చింది" అనుకుంటారంతా.

కంప్యూటర్ బోర్డులో తన పని ముగించుకొనివచ్చిన దారినే బయటకు వెళ్ళిపోయాడు ద్రాక్షారామం పని అనుకున్న దాని కన్న సులువుగా అయినందుకు సంతోషపడూ్త.

మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో రైలు దిగిన ద్రాక్షారామం సరాసరి ఎంక్వయిరీ కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు.

కౌంటర్ పక్క వారగా నిలబడ్డ గిరిజాల జుట్టు యువకుడు నల్లకళ్ళద్దాల్లోంచి ద్రాక్షారామాన్ని పరీక్షగా చూసూ్త "ఏ వూరెళ్ళాలి సార్" అని అడిగాడు.

"తెనాలి వెళ్ళాలి- హైద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ మిస్ అయ్యాను" జేబులోంచి ఐడింటిటీ కార్డు తీసి అతనికి చూపుతూ.

"అలాగా నేను టికెట్ తెచ్చిసా్తను తర్వాత రైలుకు- మీ పేరు?"

"సమరారుణ"

"ఇక్కడే వుండండి- క్షణంలో తెచ్చిసా్త" కౌంటర్ దగ్గరకు వెళ్ళి తిరిగి



వచ్చి కవరొకటి యిచ్చాడు ద్రాక్షారామానికి.

ద్రాక్షారామం మెన్స్ టాయిలెట్‌లోకి వెళ్ళి కవర్ చించి చూచాడు. లోపలున్న తాళం చెవి మీద లాకర్ కౌంటర్ 3/4 అని వుంది.

లాకర్ కౌంటర్ దగ్గరకు వెళ్ళి 3/4 లాకర్ తెరచి సూట్‌కేస్ తీసుకుని బయటకు నడిచాడు.

సెంట్రల్ స్టేషన్‌కు దగ్గర్లో వున్న చిన్న హోటల్‌లో అరుణకుమార్ పేరుతో రూము తీసుకున్నాడు.

రూము తలుపు లోపల గడియ వేసుకుని సూట్‌కేస్ వోపెన్ చేసాడు. సూట్‌కేస్‌లో తనకు కావలసిన సామాన్లన్నీ వున్నాయి.

లుంగీ, అండర్‌వేర్, ప్యాంట్ షర్టు, సి 4 బాంబు పని చేయకపోతే వాడవలసిన ఎక్విప్‌మెంట్స్ అన్నీ వున్నాయి.

సూట్‌కేస్ మూసి సంతృపి్తగా నిట్టూర్చాడు. ప్లాన్‌లో తర్వాత ఎజెండ కోసం అతనెంతో కష్టపడాల్సి వచ్చింది.

అన్నానగర్‌లోని మాతా మోటార్స్ నుండి మద్రాస్ సెంట్రల్ స్టేషన్ దిశగ వచ్చే రోడ్డు దాదాపు పదిహేను కిలో మీటర్ల పైనే వుంటుంది.

తారానాథ్ కొత్త మొబైక్ చంద్రిక టెస్టరన్ జరిపేదా రోడ్డు పైనే. ఒక రోజంతా ఆ రోడ్డు మీద తిరిగి చూచాకగాని తనకు పయోగించే యిల్లు కనపడలేదు ద్రాక్షారామానికి. రోడ్డు వారగా వున్న మూడంతసు్తలు మేడను చూడగానే సంతృపి్తతో ఈల వేసాడు.

దగ్గర్లో వున్న కిళ్ళీ కొట్టతన్ని విచారిసే్త ఆ యింటి వోనరు తంగమణి అని, మనుమడు ఆమే ఆ యింట్లో వుంటారని, మనుమడు వీరప్ప కుసీ్త పోటీలు చూడటానికి బొంబాయి వెళ్ళాడని తెలిసింది.

విభూతితో అడ్డంగా నుదిటి మీద గీతలుంచుకుని స్టీలు బుట్టలో టెంకాయ, అరటి పళ్ళు వుంచుకుని ఆమె



ం తాళం వేసుకుని వెళ్లడం
౩నించిన అతని మనసులో పథకం
్రం అయింది.

★ ★ ★ ★

గంట తర్వాత.

'అమ్మా- అమ్మా'' గేటు తట్టాడు
్లదుస్తులు ధరించిన ద్రాక్షారామం.
ని తలను కప్పి వేస్తూ విగ్గూ.
ఖాన్ని కప్పుతూ జానెడు పొడుగు
్డం వున్నాయి. మెడలో రుద్రాక్ష
వళాలున్నాయి.

తలుపు తీసిన తంగమణి ఆగంతకుడిని
ాచి ''యారయ్యా! యారు నువ్వు''
ంది విసుగ్గా.

''నానమ్మో సామి అయ్యప్పసామి-
ూరప్పా యారప్పా'.

తంగమణి నుదురులోని ముడి కొంత
ంకు తిన్న నైంది కాని అనుమానం
వల్లేదు.

''యారప్ప లేడు. బొంబాయి పోయి
'డు'' అంది.

''అడడే- యారప్ప లేడా! ఎంతాశపడి
'తిని''

''నీకుదా యారప్ప తెలుసునా?''

''నాను యారప్పసిన్నప్పుడు నిండా
్నేగితం. అంజి తరగతి వరుకుదా క్లాసు
ంటు.''

తంగమణి మనసులో ఎ అనుమానం
ోయింది. కాని గేటు తెరువలేదు.

''అంజి క్లాసు అయిన మీంద మా

# మోహినీతాండవం

అయ్యకు ఆంధ్ర ట్రాన్సఫర్ అయ్యింది-
యీ ఏడు అయ్యప్ప సామి దీచ్చ
తీసాను. దోవ పొడుగుంతా
శివాలయాలు దరిశించుకుంటా శబరి
మల పోతుండాను.''

ఆహా అన్నట్టు తలూపింది తంగమణి.
యారప్ప స్నేహితుడిమీద గౌరవం పెరిగిం
దామెకు.

గేటు తెరచి ''దా లోపల వచ్చి
కూరుసో'' అంటూ మేడ వరండాలోకి
దారి తీసింది.

ద్రాక్షారామం వరండాలో నిలబడి
వుండిపోవడం చూసి ''కూచో మీ'' అని
కుర్చీ చూపింది.

''దీచ్చపూనిన మించి కురిసీలో
కూకోలేదు. మంచం మింద పడుకో
లేదు.''

''యారప్పవుంటే నిన్ను చూసి నిండా
సంతోష పడేవాడు'' అయ్యప్పస్వామి
మీద బాగా గురి కుదిరింది తంగమణికి.

''సంతోషమా ఎగిరి గంతులేసి నన్ను
యింట్లో వుంచుకునేవాడు కాదా?''

తంగమణి మాట్లాడలేదు.

''కాళాస్త్రి సూసి యిటు వస్తుంటిని-
దారిలో రైలులో నిలంబడి వుంటి. ఎవుడో
పరుసు కాజేసే''

డబ్బు లడుగుతాడేమోనని అను
మానం వచ్చి ముఖం చిట్లించింది
తంగమణి.

''ఆసావి సల్లంగ సూడబట్టి సూట్కేస్
వుండే. టేసన్లో గేటు దగ్గర డబ్బు కట్టి
బయట పడితి! హొటేలులో బస సేద్దారంటే
యీ మదరాసునిండా దొంగలు. అప్పుడు
యారప్ప మదిలో గురుతొచ్చి నిండా
సంతోషపడితి.

యారప్ప యింట్లో వుండి యీ సుట్టు
పక్కలవుండే శివాలయాలు సూసి
అబిసేకాలు సేయించి ఎలిపోదాం
అనుకుంటి.''

తన యింట్లో బస అడుగుతున్నాడని
అర్థం అయిన తంగమణి ఆలోచనలో
పడింది.

''అమా- ఓ మాట సెబుతా యినుకో-
ఓటేలులో దిగినా గది అద్దె యిచ్చి
పూడ్చాలి. నాకు నీ యింటిలో బస
యివ్వు. దినానికి వంద సొప్పున
డబ్బిస్తా-ఓటేలులో దిగుదామంటే నిండా
బయం గుండాది.''

తంగమణి ఇక తాత్సారం చేయలేక
పోయింది.

''ఆమ'' అంటూ తలూపింది.

''ఉప్పుడే ఆటలో (ఆటో) సూట్కేంసు
తీసుకు వస్తును'' అంటూ వెనుదిరిగి
వెళ్లి అరగంటలో సూట్కేస్ తీసుకుని
ఆటో లోంచి దిగాడు.

గేటు ముందు ద్రాక్షారామం.

''అమా- అదుగో ఆంజినోటు- అయిదు
రోజు లుంటాను. నా దగ్గర వుంటే
కరుసయిపోవును'' అయిదు వందల
నోటు తంగమణి చేతిలో పెడుతూ
అన్నాడు ద్రాక్షారామం.

''వద్దప్పా-యారప్పకు కోపం వచ్చి
పూడ్చును''

''వానికి సెప్పకమా- స్నేగితం
స్నేగితమే- మరియాద మరియాదే!''

''మొదటి అంతరస్తు రెండో
అంతరస్తు ఎగస్పోర్ట్ ఆపీసుకు కిరాయి
కిచ్చి వుంటి. నేను వుంటానికి కింద అదో
ఆ రేకుల గది మాతరం వుంది. మూడో
అంతరస్తులో యారప్ప గది వుంది''
డబ్బు బొడ్లో దోపుకుంటూ అంది.

''పోన్లే అమా - నేను యారప్ప గదిలో
వుండి పూడుస్తాను. పద్దన సూరియ



# లతామంగేష్కర్‌కు

# రాజా - లక్ష్మీ అవార్డు



ప్రతిష్ఠాత్మకమైన 'రాజా-లక్ష్మీ' అవార్డు ఈ ఏడాది గానకోకిల లతామంగేష్కర్‌కు దక్కింది.

శ్రీ రాజా-లక్ష్మీ ఫౌండేషన్‌వారి ఈ అవార్డుక్రింద 50 వేల రూపాయల నగదు, ఒక ప్రశంసాపత్రం లభిస్తాయి.

తన గాన మాధుర్యంతో దేశ, విదేశాల్లోనివారిని సైతం ఆకట్టుకున్న లతామంగేష్కర్‌కు ఈ సంగీత జ్ఞానం వంశ పారంపర్యంగా అలవడింది. 1948-84 సంవత్సరాల మధ్య 20 భారతీయ భాషలలో 30 వేల పాటలు పాడి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కిన ప్రతిభాశాలి లతామంగేష్కర్.

1968 సంవత్సరంలో భారత ప్రభుత్వం 'పద్మభూషణ్'తో సత్కరించింది. 1989 సంవత్సరానికి దాదా సాహెబ్ పాల్కే అవార్డుతో సన్మానింపబడింది.

ఈమె పేరున మధ్యప్రదేశ్ ప్రభుత్వం లక్షరూపాయల వార్షిక అవార్డును కూడా నెలకొల్పింది.

ఈవిధంగా ఎన్నో అవార్డులు, సత్కారాలను పొందిన గానకోకిల 'రాజా-లక్ష్మీ' అవార్డుకు ఎంపిక చేయటం ఎంతైనా ముదావహం. నవంబరు 19న అవార్డు లతకు బహూకరింపబడుతుంది.

---

నమస్కారాలు సేత్తును. నిండా బాగుంటుంది."

తంగమణి తలూపి మూడో అంతస్తులోని గది తాళం చెవి యిచ్చింది.

తాళం చెవి తీసుకుని పైకి వెళ్ళబోతుంటే "రేడియో ఉందా? సినిమా పాటలు పెట్టవుగందా?" అనుమానంగా అడిగింది.

"చివ చివా - అయ్యప్పసామి - దీచ్చలో వుంటినమా - రోంజు వొరుమాడు సాపాటు -అంతే- చినిమా గినిమా బంద్. దీచ్చ అగితే పెండిలి చేత్తా నన్నాడు మా అయ్య."

"మా నాయినే." సంతోషంగా తలూపింది తంగమణి.

మూడో అంతస్తులో వొకేవొక గది ముందు వరండా వుంది. తాళం తీసుకులోపలకు వెళ్ళాడు. గది గోడలనిండా మల్లయోధుల పోస్టర్లు ఫొటోలు వున్నాయి.

నవ్వారు మంచం పక్కన టీపాయ్‌మీద లంగోటీ దట్టించిన శాండో యువకుని ఫోటో వుంది.

"వీరప్ప ఫొటో చూస్తే మల్లయోధుడులా వున్నాడు. వీడు యింటికి తిరిగి వచ్చేలోపుగా బిచాణా ఎత్తివేయాలి" అనుకున్నాడు.

గదిలోకి వెళ్ళగానే తలుపు లోపల గడి వేసుకుని సూట్‌కేస్ మంచంమీద వుంచి మూత తీసి లోపల సామాను ఒక్కొక్కటి బయటకు తీయసాగాడు.

కేవలం ఆరంగుళాల పొడవుండే టెన్నెసీ డిస్కవరర్ టెలిస్కోపు తీసి పక్కనున్న బల్లమీదుంచాడు. వెయ్యి గజాల దూరంలో వున్న వస్తువు నలభై అడుగుల దూరంలో వున్న వస్తువులాగా కనపడుతుంది అందులోంచి చూస్తే.

రైఫిల్ మరీ అద్భుతంగా వుంది. రైఫిల్ అనే కంటే పిల్లలు ఆడుకోటానికి చేసిన రైఫిల్ నమూనా అంటే బాగుంటుందేమో. బారెల్, ఫైరింగ్ ఛేంబర్, ఫ్లాష్ సప్రెసర్, సైలెన్సర్, కిందట్రిపాడెలో ఎక్కువ భాగం అల్యూమినియంతో తయారైంది. ఆ వాంపైర్ సూపర్ ఎక్స్‌ప్రెస్ రైఫిల్‌కు లేసర్, స్కోప్ ఫిట్ చేసి వుంది. ఫైరింగ్ చాంబర్ అయిదు 7.62 మిల్లీ మీటర్ల స్టీల్ పాయింట్ ఎక్స్‌ప్లోజివ్ షెల్స్ నిండ వుం...

వేలు ఆనిస్తే చాలు యాక్షన్‌లో వెళ్ళేలా వుంది ట్రిగ్గర్.

పదిహేను వందల గజాల దూరం... వున్న టార్గెట్‌ను గురి చూచి కొట్ట... శక్తివంతమైన ఆ రైఫిల్ బరువు కేవ... పది పౌన్లు మాత్రమే.

"ఒకవేళ ప్లాస్టిక్ బాంబు పేలి ప... జరగకపోతే రెండు వందల గజా... దూరంలో వున్న రోడ్డు మీద గంట... వంద కిలో మీటర్ల వేగంతో మోటర్‌బైక్ మీ... ప్రయాణం చేస్తున్న తారానాథ్‌ను రైఫి... షాట్‌తో అంతం చేయాలి.

గాలి లేకపోతే అతని చెవి తమ్మక... అంగుళం ఎత్తున గురి చూచి రైఫి... పేల్చాలి!" అని అనుకున్నాడు.

"ప్లాస్టిక్ బాంబ్ పని చేయక పోవడ... అంటూ వుండదు! తారానాథ్‌ను న... చేతుల్తో కాల్చి చంపడం తప్పి... బాగుండును. నా ఆరాధ్య హీరోన... డబ్బుకోసం నేనే కాల్చి చంపే దుస్థి... కలుగకుండా వుండాలి" అనుకున్నాడు ద్రాక్షారామం.

(ఇంకావుంది)

## సినిమా..సినిమా..

"కులంకంటే గుణం గొప్పది. మతంకంటే మానవత్వం గొప్పది. ఆచారంకంటే ఆదర్శం గొప్పది అనే పాయింట్స్‌పై ఈ ఫ్యామిలీ డ్రామా ఉంటుంది," అన్నారు పి.ఎన్. రామచంద్రరావు ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయ్, వై.టి. నాయుడు నిర్మించిన శ్రీ గాయత్రి కళాచిత్ర వారి "మాస్వారి కాపురం" చిత్రంలో రాజేంద్రప్రసాద్, గాయత్రి, గొల్లపూడి మారుతీరావు, కోటశ్రీనివాసరావు, వేలు, బ్రహ్మానందం, రావి కొండల రావు, డాక్టర్ శివప్రసాద్, వై. విజయ, జయ విజయ, జయలలిత, విసీల, 'బడి' తాతాజీ, లక్ష్మి దేవదాస్, నటించారు. గొల్లపూడి మాటలు, వేటూరి గీతాలు, రాజ్‌కోటి సంగీతం, పద్మకుమార్ ఛాయ, వెంకట్– నర్సింహారావు సహకార దర్శకత్వం, లెనిన్ కూర్పుశాఖలు నిర్వహించారు.

"ఆగస్ట్ 10 నుంచి 30 వరకు జరిగిన రెండో షెడ్యూల్‌తో షూటింగ్ ముగిసింది. మలయాళంలో విజయవం



"తేనెటీగ"లో సితార

తంగా ప్రదర్శింపబడిన 'చిత్రం' అనే చిత్రం ఆధారం," అన్నారు ఎం మోహన్‌బాబు ఈయన ప్రధాన పాత్ర ధరిస్తూ నిర్మించే "అల్లుడుగారు" చిత్రంలో శోభన, రమ్యకృష్ణ, చంద్ర మోహన్, జగ్గయ్య, సత్య నారాయణ, గుమ్మడి, సుధాకర్, చిట్టిబాబు, సరస్వతి, కవితాకుట్టి పాత్రధారులు ప్రియదర్శన్ కథకు సత్యానంద్ సంభాషణలకర్త, కె వి మహదేవన్ సంగీతం, ఎ. విన్సెంట్- కె ఎస్ ప్రకాష్ ఛాయ, బి సూర్యకుమార్ శిల్పం, సుందరం నృత్యాలు, నందూరి గోపాల్- సత్య రవీంద్రబాబు సంయుక్త దర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో సి ఎస్ ఆర్ బాబు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ నిర్వహణ ఎం కృష్ణ, జి. పురుషోత్తం దర్శకత్వం కె. రాఘవేంద్రరావు

## కౌసల్యా పిక్చర్స్‌లో రాజేంద్రప్రసాద్

'సెప్టెంబర్ నుండి తిరుపతి పరిసరాలలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది తమిళంలో ఎన్నో ప్రదర్శనలిచ్చి, బహుముఖ ప్రశంసలందుకున్న వెంకట్ రాసిన 'మర్యాదక్కి ఒరు మనవి' నాటకం ఆధారం," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి ఈయన సమర్పించే కౌసల్యా పిక్చర్స్ చిత్రంలో రాజేంద్రప్రసాద్, లిజి, వేలు, బ్రహ్మానందం ఆదిగాగల వార పాల్గొంటారు మౌళి దర్శకుడు





శ్రీలక్ష్మీపిక్చర్స్ చిత్రంలో బేబి షామిలీ, శోభన

# సినిమా....సినిమా.....

## విజయప్రసన్న ఫిలిమ్స్

జీవితంలో 'మిస్' అయిన ఓ మధురమైన అనుభూతిని తిరిగి పొందితే ఎలా ఉంటుందన్న తమాషా చిత్ర కథ," అన్నారు రేలంగి నరసింహారావు ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బోగవల్లి ప్రసాద్ నిర్మించే విజయప్రసన్న పిలిమ్స్ చిత్రంలొ ఎ ఎన్ ఆర్, శారద, రాజేంద్రప్రసాద్, వాణీ విశ్వనాద్, సత్యనారాయణ, గుమ్మడి, జై విజయ, నిర్మల, ఆదిగాగల వారు పాల్గొం టున్నారు శ్రీనివాస చక్రవర్తి, సత్యానంద్, కీరవాణి, శరత్, బాస్కరరాజు, తార, సత్తిరాజు, నందం హరిశ్చంద్ర రావు, కోటగిరి వెంకటేశ్వరరావు తెర వెనుక కృషి చేస్తున్నారు

## "ముద్దంటే చేదా"

"రొమాంటిక్ థ్రిల్లర్ సరిత చెల్లెలు అమూల్యను పరి చయం చేస్తున్నాం విశాఖ పట్టణం, అరకు లోయ ప్రాంతాలలో షూటింగ్", అన్నారు జి సత్యనారాయణ ఈయన సమర్పించే వి వి కమర్షియల్స్ "ముద్దంటే చేదా" చిత్రంలో వినోద్‌కుమార్, అమూల్య, నాజర్, సుదాకర్ మల్లికార్జునరావు జయరేఖ, 'సినిమా ట్రేడ్ గైడ్' వెంకటేశ్వరరావు, జయలలిత, ప్రసన్నకుమార్, వాణి పాత్ర దారులు అక్కిపెద్ది వెంకటేశ్వరశర్మ కథ, మాటలు రాశారు మోహన్ సితార స్వరకల్పనలో సీతారామశాస్త్రి గీతాలు రాశారు జి కె కృష్ణన్, కృష్ణ చైతన్య, సత్యం, బాలు, చంటి, వెంకటేశ్వరరావు, అనిల్ మల్నాడ్ ప్రభృత సాంకేతిక వర్గంతో జి పూర్ణ ప్రకాష్ నిర్మించే ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే దర్శకత్వం రేలంగి మల్లిక్

## "భారత్ బంద్"

"ప్రాంతీయాభిమానం వర్గాలు ప్రజలు కోరుకోవడంలేదు. రాజకీయాలలో తమ స్థానం సుస్థిరం చేసుకోవడానికి నాయకులే అలా చేస్తుంటారు. వాటిని ప్రజలు ప్రతిఘటించాలి అనే ఇతివృత్తం. ఆగస్టు 20 నుంచి సెప్టెంబర్ 7 వరకు హైదరాబాద్‌లో జరిగే రెండో షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. సుభాష్ నిర్మించే విజేతా ఆర్ట్ క్రియేషన్స్ "భారత్‌బంద్" చిత్రంలో వినోద్‌కుమార్, రఘు, నవనటి రమ, సుధారాణి, రామిరెడ్డి, కోకా రాఘవరావు, బాబూ మోహన్, బాబ్జీ, రాధాకృష్ణ, ప్రమోద్ చక్రవర్తి, జీడిగుంట శ్రీధర్, ప్రత్యేక పాత్రలలో నిర్మాతలు అశోక్‌కుమార్, కృష్ణ, డైరెక్టర్ ఆదిత్య నటిస్తున్నారు. జొన్నవిత్తుల పాటలు, విజయశేఖర్ సంగీతం, కోడి లక్ష్మణరావు ఛాయ, సాయికుమార్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, వడ్డి రామానుజం సహదర్శకత్వం, తాతా సురేష్ కూర్పుతో ఎ. విశాలాక్షి సమర్పణ.

-జి.వి.జి.




"నవయుగం"లో మీనా




విజయరాఘవరావు!

"ధన్ ధనా– టక్ టకా– ధన్ ధనా– టక్ టకా– తక తకిట– తకతకిట– తకతకిట– తకతకిట ఖండజాతి లయలో శరవేగంతో పరిగెత్తుతోంది రైలు. బెజవాడ రావడానికింకా ఎనిమిదీ గంటలన్నా పట్టచ్చు. పానకాల్రావుకు నిద్ర రావడంలా అమావాస్య చీకటి రాత్రుల్లో చెట్లూ, చేమలూ, గుళ్ళూ– గోపురాలూ, పల్లెలూ– పట్నాలూ, గతంలోకి మాటుమణిగి పోతుంటే, ముందు రాబోయే స్వేచ్ఛనన్నీ భవిష్యత్తులో పొంచి కూర్చున్న ఆశల్లా పుష్పించుకురిసూ పానకాల్రావు మనస్సును పదే పదే పీకుతున్నాయి దగ్గర కొస్తున్న కొద్దీ! అతని తొందర వాటికేం తెలుసు మరీ! ఇవ్వాళన్నా యీ మాయదారి రైలును మరికాస్త తొందరగా పరిగెత్తించే నాథుడే లేడా?! తెలుసు. అల్లా జరగడం అసంభవమని. అయినా బాణం తగిలిన జింకలా కొట్టుకుంటున్న పానకాల్రావు గుండెల్లో తర్కశక్తి నెప్పుడో మింగేసింది ఆవేశం!

"మదర్ సీరియస్... కమ్ సూన్' మామయ్యిచ్చిన టెలిగ్రామిది... ఇదమిద్ధం తెలియడంలా అలాంటి పరిస్థితిలో పానకాల్రావేమిటి, పాపారావైనా– పార్వతమ్మయినా– ఆ సందిగ్ధావస్థలో ఎవరైతేనేం– తడబడక తప్పదు గదా? ప్రాణాలతో తల్లిని చూసి తీరాలి. "నాన్నా! ఎల్లా వున్నావురా? ఎన్నాళ్ళయిందో నిన్ను చూచి!..." అంటూ ఆప్యాయంగా తల్లి బుజ్జగిస్తూ పలికితే, తను– గంగా యమునా సరస్వతు లీదుకుంటూ ఒడ్డు చేరుకుని, స్వర్గానికి నిచ్చెనకట్టి, గంధర్వగానంతో అప్సరసలు నృత్యం చేస్తున్న ఇంద్రసభలో జొరబడ్డట్టు మురిసిపోడూ మరి!

ఏమిటో!!

రాత్రింబవళ్ళూ కవిత్వం రాసే పిచ్చితో ఇలాంటి వూహలే, రైల్లో కూర్చున్నా! తెల్లగా 'ధగ' 'ధగ'లాడే గడ్డం, లాల్చీ, ధోవతీ– 'ఫట్టు'మని పరాయి వాళ్ళు చూస్తే, విశ్వకవి టాగూరు గారి వేలువిడిచిన తమ్ముడిలా కనిపిస్తాడు పానకాల్రావ్! పత్రికలో పని చేస్తున్నాడు. సబ్ ఎడిటర్. "క్షణం తీరిక లేదు. దమ్మిడీ ఆదాయం లేదు" అంటుంటాడు పదే పదే అయినా చేసే పనిలో మామిడికాయ రసం తాగుతున్నట్టు సంతృప్తి కనబడడంతో, "మనసు గుర్రం' కళ్ళాలింకా చేజారి పోలేదు! ఎన్నాళ్ళ నుంచో "అమ్మ"ను చూడాలనుకుంటూ, ఢిల్లీ నుంచి బెజవాడకు పోయే విమానాలవీ, రైళ్ళవీ "టైమ్ టేబుల్స్" రోజూ తన పత్రికలో అచ్చవుతుంటే బట్టీ పెట్టడం తప్ప, పని కల్పించుకుని టిక్కెట్టుకొని బెజవాడ వైపు ప్రస్థానం చేసే ఘడియలిల్లా తల్లి అనారోగ్యంతో తన్ను పీక్కుతినబోతున్నాయని అతను కలగన లేదెప్పుడూ...

"ధన్ ధనా టక్ టకా.."

రెండవ తరగతి పెట్టి కిక్కిరిసి, సంధు చూలాల్లా కదలలేక కదులుతున్నట్టు తూలుతోంది, అర్ధ నిద్రతో వున్మీలితమైన కొందరు ప్రయాణీకుల కళ్ళల్లో– రైలు....

ఈ మధ్య టీ. వీ. జోరుకదా! ఆదివార మొస్తే "మహాభారతం" తప్పదందులో కొందరు ప్రయాణీక ప్రేక్షకులకు! కానీ రైల్లో ఎల్లా?! సొంత జీవితపు "భారతం"లోని ఒడుదుడుకులు మరిచిపోవడానికి "మహా భారతం" పుస్తకం చదువు కుంటున్నాడు పానకాల్రావు... అనుకోకుండా వచ్చిన ప్రయాణం గనక "అన్‌రిజర్వుడు" పెట్టిలో ఎలాగో కాళ్ళు ముడుచుకుని కాలక్షేపం చేస్తున్నాడు. బెజవాడ

రావాలి. స్టేషన్లో మామయ్య కనపడి "అమ్మకేం ప్రమాదం లేదులే, భయపడకు పానకాలూ" అనాలి....

"నజాయతే మ్రియతేవా కదా చిన్నాయంభూత్వా భవితా వానభూ యాః..."

"భగవద్గీత" పేజీలు తిరుగుతున్నాయి....

"వాట్ ఎ రాటెన్ రష్?"

సూటూ బూటూ, 'ఫెదర్' హ్యాటూ, చేతిలో వి.ఐ.పి. ఫాన్సీబ్యాగూ, అర్ధరాత్రయినా 'ఆరంజి కలర్' కూలింగ్ గ్లాసుల్తూ.... మిగలక మిగలక మిగిలిన అర ఇంచీ ఖాళీ స్థలం వైపు పానకాల్రావును "జరగమ"ని "ఫారిన్ జంటిల్మన్" ఠీవితో సంజ్ఞ చేస్తూ, ఏం జరుగుతున్నదో అర్థం చేసుకునే లోపలే బిత్తర చూపులు చూస్తున్న పానకాల్రావు పక్కన "దభీలున" కూర్చుండి పోయాడొక ఆగంతకుడు!!

సంగీత సాహిత్యా లెవరికైనా శాంత మనస్కుల్ని చేస్తాయేమో! హఠాత్తుగా జరిగిన అన్యాయానికి బాధపడుతూ కూడా నెమ్మదస్థుడైన పానకాల్రావు "ఏమనాలో" తెలీకుండానే "నమస్తే" అనేసి, ఇంకొంచెం జరిగి కూర్చున్నాడా పెద్ద మనిషి "వసతి" కోసం!

"**అతిథీ దేవో భవా!**"

ఇదీ మన భారతీయుల నిండుతనం!

"ఎందాకా?" తన పై వుద్యోగస్థుడిలా ప్రశ్నించాడా పెద్దమనిషి!

"బెజవాడ."

"ఇంకేం. నేనూ బెజవాడే. ఎప్పుడూ విమానంలో తప్ప ప్రయాణం చేయలేదు. అమెరికా నుంచి మేం దిగి నాల్గురోజులైనా కాలా. అబ్బా! ఇలాంటి చెత్త రైళ్ళల్లో మీరెలా ప్రయాణం చేస్తారర్రా! ఇట్ ఈజ్ ఎ షేమ్! మా వూళ్ళో ఇంట్లోకన్నా రైల్లోనే కమ్మటి నిద్దరొస్తుంది! వాషింగ్టన్‌లో పడుకుంటే, న్యూయార్క్‌లో "బెహరా" వొచ్చి కాఫీ యిచ్చి లేపిందాకా మూసిన కన్ను తెరవక్కర్లా.... అది సరేగాని, ఏమిటా పుస్తకం?"

"మహా భారతం."

పానకాల్రావు కయోమయంగా వుంది. అయినా ఈయన లెక్చర్లువింటూ ఎలాగోలా రాత్రి గడిచి కొంప జేరుకొంటే కొంత ఆదుర్దా తగ్గుతుందేమో! మరి వేరే గత్యంతరం?

"మీకు థ్రిల్స్ కావాలంటే "మహా భారతం" చదివేం లాభమండీ! ఇదిగో "గాన్ విత్ ది విండ్" నేను ముప్పయ్యొకటో సారి చదువుతున్నా. మనం బెజవాడ చేరే లోపల మళ్ళీ చదువడం పూర్తయితే మీకిస్తా లెండి... అయినా యీ రైళ్ళల్లో ఫ్యాన్లు బాగు చేసే నాథుడే లేడాండీ! ఇక్కడ గాలిరాదు- కిటికీ తెరవాలంటే సుత్తితో కొట్టినా బిగుసుకు పోయి కదల్దు! చూశారా ఆ "బల్బు"లన్నీ ఎలా పగిలి పోయాయో! వెనక పెట్టెలో బాత్‌రూమ్‌లో నీళ్ళుబొట్టు లేదు. అందుకే ఇక్కడి కొచ్చా. మిమ్మల్ని ఇబ్బందిపెడ్తూ- పాపం! మీ ఇండియా ఇంకా, స్టోన్ ఏజ్ కాలంలోనే నిద్రపోతున్నట్టుంది! ఇప్పుడు తెలుసా మీకు?" చంద్రలోక మేంటి"- "సూర్యలోక మేంటి"- "అంగారక లోకమేంటి"- చివరకు "బ్రహ్మలోకం"లో కూడా చక్కర్లు కొట్టి, పొద్దున భూమి మీద "టీ" త్రాగి వెళ్ళిన వాళ్ళం, మళ్ళీ భార్యాబిడ్డలతో పాతాళానికి కొట్టుదానికి రాత్రి భోజనాల వేళ కిల్లు చేరుకోగలం!! గణితమండీ!- అంతా శుద్ధ గణితం మహిమంటే నమ్మండి! అది- అమెరికా అంటే! అలాంటి లెఖ్ఖలు తెలిసిన మహానుభావు డొక్కడైనా మీ వూళ్ళో పుట్టాడా చెప్పండి?!"

ఆవేశంతో వొళ్ళు మండుకొస్తోంది పానకాల్రావుకు. ఒక్కుమ్మడిగా లేచి "రామానుజం- రామానుజం" అంటూ మన మేథమేటిక్స్ మేధావి పేరు తలుచుకుంటూ, పక్కవాడి పళ్ళు రాలేట్టు చంప చఢారుమని అతికిద్దామనుకున్నాడు... కానీ...

తనలో నివురుగప్పిన నిప్పులా, భూమిగర్భంలో బంగారంలా దాక్కున్న సాహిత్య సంస్కారమలా చేయనిస్తుందా! అసలు వీడెవడు? మన భారతీయుడేనా? చూడ్డానికి మాత్రం అలాగే వున్నాడే! అదేమిటీ- పచ్చి తెలుగు మాట్టాడుతుంటే! ఎరువుకు తెచ్చుకున్న సూటూ బూటూ లాగేస్తే- కళ్ళూ, కాళ్ళూ- ముక్కూ, నోరూ- అన్నీ, మనలాగే వున్నాయి మరి! అయితే ఇంత "దర్జా"గా వాగుతున్న పెద్దమనిషి తనతో "రెండో తరగతి" (అదీ, అన్‌రిజర్వ్‌డ్!)లో దేని కిరుక్కున్నట్టు?!! పోనీ తనకెందుకీ గొడవంతా? తనకున్న దిగుళ్ళు చాలకనా! ఇలాంటి "బేవార్సు" వాళ్ళు గజానికి పదిమంది దొరుకుతారు వెతుక్కుపోతుంటే... అయినా, అతన్ని "బేవార్సు" వాడనుకోవడం తన పొరపాటే అయితే?!! తను మాత్రం విమానంలోనో, ఫస్ట్‌క్లాస్ రైలు పెట్టెలోనో ప్రయాణం చేయగల అర్హత లేనివాడా మరి! అనుకోకుండా తనూ యీ "గర్డ్" పెట్టె "గలీజు"లో కళ్ళు మూసుకుని కాలక్షేపం చెయ్యాల్సిరాలా?! అతనికీ, అలాంటి అవసర ప్రయాణం "కాకతాళీయ న్యాయంగా" తటస్థించిందేమో పాపం!

నెమ్మదిగా అడిగాడు పానకాల్రావ్.

"మీదసలే వూరండీ?"

"కొన్నాళ్ళు జపాన్‌లో వుండే వాళ్ళం. మా ఫ్యామిలీలో సగం మంది కెనడాలో పెద్ద పెద్ద వుద్యోగాల్లో హేమాహేమీల్లా పని చేస్తున్నారు. నాకో రెండేళ్ళ క్రితం అమెరికాలో వరల్డ్ బ్యాంకులోకి ట్రాన్స్‌ఫర్ అయింది. మీ ఆంధ్రా గవర్నమెంటు వాళ్ళు "బీదల కోసం ఇళ్ళు కట్టించే పథకం" కింద మా దగ్గర నాలుగు మిలియన్ల డాలర్ల అప్పు కోసం దరఖాస్తు పెట్టుకున్నారు. ఆ సందర్భంలోనే, మీటింగ్‌కోసం బెజవాడ వెళ్తున్నా. "సీధా ప్లేన్ లేదు. రైలే తొందరగా చేరుతుం"దని ఎవరో చెప్పారు. అందుకూ యీ రభస!"

న్యాయంగానే వుందతని వుదంతం! కానీ తన అసలు ప్రశ్నకు జవాబు రాలేదింకా. "ఇతను స్వతః తెలుగువాడా, కాదా" అని. ఈ ధర్మసందేహం తీర్చుకుని తీరాలి... అనుకున్నాడు పానకాల్రావు.

"అవునండీ! రైల్లోనే నయం. ఈ రోజుల్లో విమానాలైనా మనల్ని "టైమ్"కు అందించి చస్తాయి గనకనా... ఒఖ్ఖమాట... మీరు "తెలుగు" ఇంత స్వచ్ఛంగా మాట్లాడుతున్నారు. తెలుగు వాళ్ళేనా?"

ఇంగ్లీషులో సమాధానమిచ్చాడాయన.

"యస్. బేసికల్లీ వుయ్ ఆర్ ఆంధ్రాస్. బట్ నౌ వుయ్ ఆర్ అమెరికన్ సిటిజన్స్".

ఏమైనా, అతనికీ విషయం మీద చర్చ రుచించినట్టు లేదని, అతని ముఖ కవళికలే



# ఆప్తబంధువు

చెప్తున్నాయ్!

''ధనాధనా- టక్ టకా ''

మనమేం మాట్లాడుకుంటున్నా రైలుకేం బట్టింది! శరవేగంతో- 'కాలం'లా పరుగెడ్తూనే వుంటుందది! భూమాత చుట్టూ తిరుగుతున్న కోడి, పానకాల్రావు పక్క మనిషి, దర్జాగా తన సగం సీటు లాక్కుని, 'ఫారిన్'' వింతలన్నీ ఏకరువు పెడుతూ, సోది కబుర్లు చెబుతున్న మాటే మరిచిపోయి తన కోసం పంచప్రాణాలూ దారబోసే మాతృదేవతను గురించే ''పదే ''పదే'' ఆలోచిస్తూ, ఆమె ఆయురారోగ్యాల కోసం భగవంతుణ్ని ప్రాదేయపడుతూ, మళ్లీ ప్రయాణ బడలికలో మగత నిద్ర ముంచెత్తుకొచ్చే లోపల, ''మహాభారతం'' లోంచి ''భగవద్గీత'' పేజీలు తిప్పటం మొదలెట్టాడు అటు కన్నతల్లి అనారోగ్యపు అశాంతికీ ఇటు యీ ఆగంతకుడి ''మాతృదేశ విమర్శ ''దాడికీ'', ''కృష్ణార్జున సంవాద' మే శరణ్యమని నమ్మిన పానకాల్రావు

ఇంతలో ఆయనన్నాడు ''అవర్ డెస్టినేషన్ ఈజ్ నియరింగ్! కొంచెం బాత్రూమ్ కెళ్లొస్తా నా బ్యాగ్‌లో ఫారెన్ ఎక్స్ఛేంజి కొల్లలుగా వుంది కాస్త జాగ్రత్తగా చూస్తుండండేం'

పానకాల్రావు కాశ్చర్యమేసింది తలా తోకా తెలియని తన మీద ఎంత ''భరోసా'' ఈయనకు! ''ఆ డబ్బు బ్యాగ్ లోపలికే తీసుకు పోదురూ'' అందామనుకుంటున్న తన సమాధానం వినకుండానే జనాన్ని తోసుకుని బాత్రూంలో కెళ్ళి పోయాడా ''ఫారెన్ రిటర్న్!''

''నైనం ఛిందంతి శస్త్రాణి
నైనం దహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో
నశోషయతి మారుతః ''

ఇలా చదువుతూ, చదువుతూ ఎంత సేపైందో! మైమరచి బాహ్య ప్రపంచంతో సంబంధమే లేనట్టు గాఢమైన సుషుప్తిలోకి చొచ్చుకు పోయింది పానకాల్రావు మనస్సు మధ్య మధ్య ఎక్కేవాళ్లూ దిగేవాళ్లూ ''నీడ నీడ''గా కనబడుతున్నారంటే ఒకసారి టికెట్ కలెక్టరొచ్చి చెక్ చేసి పోతూ పోతూ టాగూర్‌లా అందమైన గడ్డంతో, అపురూపమైన వదనారవిందంతో ''మాంచి'' పెద్దమనిషిలా కనబడుతున్న పానకాల్రావు నడిగాడు కూడా ''ఇక్కడెవరన్నా టిక్కెట్టు లేకుండా ఎక్కి మిమ్మల్ని అవస్థ పెట్టలేదు కదా సార్? అన్ రిజర్వుడు కంపార్టుమెంట్లల్లో మాకు రోజూ ఇదే గొడవ కదా! అందుకే అడుగుతున్నా''

''అబ్బె! ఏం లేదండీ!''

మాట వరసకనేశాడు పానకాల్రావు టిక్కెట్ కలెక్టర్‌కు థాంక్స్ చెప్పి

''ధన్ ధనా- టక్ టకా ''

తెల్లవారుతోంది. ఈ స్టేషను గాక, ఇంకొక్కటి దాటితే బెజవాడ ''ఇడ్లీ కాఫీ' అరుపులు ప్లాట్‌ఫారమ్ మీద మోగుతున్నాయి

తన మనసునే వూగుతూ వూగుతూ, వోరబడ కాస్త కూర్చొని నిద్రపోతుంటే బాత్‌రూమ్‌లో గంటకు పైగా గడిపి, ముస్తాబై వచ్చిన ''ఫారిన్'' పెద్దమనిషి'

''బెజవాడ వచ్చేస్తోంది మీరూ బాత్రూమ్ వగైరా వెళ్లొచ్చి ఫ్రెష్‌గా కూర్చోరాదూ?'' ఆప్యాయంగా సొంత చుట్టంలా ఆయన అలా అంటే ''వద్దు''న బుద్ధెయ్యలేదు పయనమైనాడు పానకాల్రావు- కాలకృత్యాలు తీర్చుకోవడానికి

ఖండలయలోంచి ఆదితాళంలోకి దిగి, చివరకు తాళం తప్పినట్టు రైలు రొద ఆగింది నెమ్మది నెమ్మదిగా!

''బెజవాడ వచ్చింది! అమ్మను చూడాలి!

మామయ్య నాకోసం వెతుకుతున్నాడేమో!'' అసలు రైలాగినా ఆదుర్దాతో పానకాల్రావ్ గుండెల్లో కొత్త కొత్త రైళ్ళు పరుగెడుతున్నాయి! బాత్‌రూమ్ తలుపు తీసుకుని, దిగే జనాన్ని తోసుకుంటూ సొంత సీటు దగ్గరకొచ్చేడు

అరే!!

తన పెట్టే, బెడ్డింగూ కూచున్న చోట శూన్యం! ఆ ఫారిన్ పెద్దమనిషి లేడక్కడ!! పరిగెడుతున్న గుండెకాయ, ఒక్కసారిగా కొట్టుకోడమే మానేసి నట్టయింది! సామాను పోతే పోయింది-అమ్మకు



# యువతా కవిత

## సిగరెట్టు

అందమైన ప్యాకెట్టు
అందులోన సిగరెట్టు
చూపరుల నాకట్టు
రుచి చూస్తే ఓ పట్టు
అలవాటుకి తొలిమెట్టు
వదిలితే మరి ఒట్టు
బ్రతుకంతా తాకట్టు
తోటి వారిని ఇబ్బంది పెట్టు
బడ్జెట్ కి లోటు పెట్టు
గుండెకు పొగపట్టు
ఊపిరి మెలిపెట్టు
ఆయుష్షని అరికట్టు
అందుకే దానిని దూరంపెట్టు

-పుల్లాపంతుల వేంకటసుబ్బారావు

## భ్రమ

నేనను కున్నా,
ఈ సమాజ మహావృక్షం
చల్లని నీడలో, ప్రేమనువంచి,

మమతానురాగ మల్లెల
జల్లులు, కురిపించి,
దీన జనావళికి తోడుగా జీవించాలని,

కాని,
నేనిపుడే తెలుసుకున్నా,
ఇది రాక్షస సమాజమని,
స్వార్థపు విషవృక్షమని,
కులరక్కసి నీలి నీడని,

అందుకే,
రక్తపు మడుగులలో తేలియాడుతున్న
దీన జనావళి ఆర్తనాదాలను వింటూ,
నేను వారితో కలసి పోతున్నానని.

- వై. శ్రీనివాసరావు

## ప్రేమ పావురాలు

నా నీరాజనము నీకై
చేస్తున్నా ప్రతి దినం

గొంతు పెగిలితే
ప్రేమాలాపనలనే వినిపిస్తుంది!

నా చెవులు నీ ప్రేమ
పలుకులే వింటుంది!

నా కళ్ళు నీ ముగ్ధ మనోహర
రూపాన్నే చూస్తున్నవి!

నా అధరాలు నీ లేత బుగ్గలనే
ముద్దిడుతున్నవి!

నా చేతి వ్రేళ్ళు నీ చెక్కిళ్ళను
గిలిగింతలు పెడుతున్నవి!

నా మనస్సు నీ ఒడిలో
ఎప్పుడు ఒదిగి నిద్రిస్తుంది!

నా కలం సిరాను స్రవించి
ప్రేమ కవితలే వ్రాస్తున్నది!

ఇవి నా ప్రేమకు సాక్ష్యాలై
మన ఇరువురిని
అంబర వీధుల్లో

విహరింప జేస్తున్నాయి
ప్రేమ పావురాలుగా!

-సుజశ్రీ

తెచ్చిన మందులన్నీ, అందులోనే వున్నాయి!"

ఏం చేయడమో ఆలోచించే లోపల మామయ్య గొంతు వినిపించింది.

"పానకాలూ- పానకాలూ-"

ఇద్దరూ, పడకగదిలో కొత్తగా పెళ్ళైన భార్యాభర్తల్లా కౌగలించుకున్నారొక్కసారి!

"మామా! అమ్మెలా వుంది!"

"గండం తప్పిందోయ్! నీ కోసమే కలవరిస్తోంది .. పద కూలీని పిలుస్తా సామానేదీ?"

చావు కబురు చల్లగా చెప్పమంటారు! అయినా తల్లిని ప్రాణాలతో చూడగలుగుతున్నానన్న ఆశలో పానకాల్రావుకు సామాను పోయిన దుఃఖం కించిత్తు కూడా బాధపెట్టలేదా క్షణంలో! గొంతులోంచి చేదు కాకరకాయ కక్కేసినట్టు "దబా" "దబా" సామాను పోయిన వ్యవహారమంతా మామయ్యతో చెప్పేశాడు పానకాల్రావ్!

"అరి నీ తస్సదియ్యా పట్నాల్లో కాపురం జేస్తూ ఆమాత్రం జాగ్రత్త లేకపోతే యెల్లాగోయ్! రైలు కదిలే లోపల త్వరగా పదమరి రైల్వే సబ్ ఇన్స్పెక్టర్ మనవాడే. గోపాలంగారు... నడూ నడూ చెప్పి చూద్దాం "

ఇంకా యేమేమిటో అంటున్నాడు మామయ్య ఈ లోపల కిందటి స్టేషన్లో అవతరించిన "టిక్కెట్ కలెక్టర్"రే, మన "ఫారిన్ గెస్టు" నొక పోలీసు బంట్రోతుతో సహా నెట్టించుకొస్తూ, వీళ్ళ పెట్టి దగ్గరికి చేరుకున్నాడు!

"ఏమండీ? యీయన టిక్కెట్టు మీ దగ్గరుందా?"

"అదేమిటీ! ఆయన టిక్కెట్టు నా దగ్గరెందుకుంటుందండీ?!

"అయితే ఆయన మీ "బావమరిది" కాదా మరి?!" మామయ్య, పానకాల్రావు దిగాలుపడి చూస్తున్నారు! వరల్డ్ బ్యాంకు మెంబరు గారి ముఖాన కత్తి వేస్తే నెత్తురు చుక్క లేదు!!

"ఈ కొత్త బావమరి దెక్కడ దాపరించాడో" అని మామయ్య నిర్ఘాంతపోతున్నాడు!

అన్నాడు పోలీసు బంట్రోతు "మీరి అతని చేతిలోని యీ పెట్టి మీది మీ చిరునామా, మీ వుద్యోగ వివరాలూ, పేరూ వూరూ, అన్నీ అతనికి ఎంతో పరిచయంలా, గోపాలంగార్ని నమ్మించేశాడండీ! ఆ వొళ్ళు టిక్కెట్టు ముక్కా చేతిలో లేకపోబట్టి గోపాలంగారి కనుమాన మొచ్చి. సరిగ్గా యీయన గేటు దాటేసుకుంటున్న సమయానికి లంకించుకుని, వాకబు చెయ్యమని మమ్మల్నిలా పంపారండీ!"

"ఓరి బగవంతుడా! నా పెట్టా, బేడా పోకుండా రక్షించడమే కాకుండా, నాకొక, కొత్త "ఆప్తబంధువు"ను కూడా సృష్టించావు గదరా!

ఫ్యాన్లు పని చేయని, బల్బులు పగిలి, కిటికీలు బిగుసుకుపోయిన భారతదేశపు రైళ్ళల్లో హిమాలయాల నుంచి, కన్యాకుమారి దాకా ప్రతిక్షణం వేలాది భారతీయులు దైనందిన కృత్యాల్లో ముగ్ధులై ప్రయాణం చేస్తూనే వుంటారు అవి మన కోసం- మనం వాటి కోసం- జీవిస్తూనే కాలం గడుస్తుంది! అయితే వాటిల్లోనే, "అమెరికా, ఇంగ్లండు" వగైరాలూ, "అంగారక గ్రహం"- "బ్రహ్మలోకం" వగైరాలూ, చక్కర్లు కొట్టి, ఎప్పుడోప్పుడు తిరిగొచ్చే సమయానికి టికెట్లెస్ ట్రావెల్ కోసం శ్రీకృష్ణ జన్మస్థానం పోబోతూ, మన మన "బావమరుదు" లయ్యే సదవకాశం, ఎంత మందికి దక్కుతుందో మరి!!"

అనుకుంటూ "దేశపు అమ్మనూ", "కడుపున కన్నతల్లినీ"- ఇద్దర్నీ తలుచుకుంటూ, మధ్య మధ్య తన విచిత్ర ప్రయాణపు కబుర్లతో సతమత మవుతూ, మామయ్యతో సహా గుర్రబ్బండెక్కాడు పానకాల్రావ్!!




**స్వాగత్ కిందకి చూశాడు.**

**ఆ రోజు వాటర్ వర్క్స్ డిపార్ట్‌మెంట్ వ్యక్తిగా వచ్చిన వాడు- నిర్లక్ష్యంగా కారు దిగాడు. అతని వెనుకే గూండాల్లా వున్న నలుగురు వ్యక్తులు దిగి- భవనం వేపు నడుస్తున్నారు.**

(గత సంచిక తరువాయి)

స్వాగత్ ఎలర్ట్ అయ్యాడు.

శ్రీమతి భయంగా చూస్తూ అంది.

"మనకోసమే వస్తున్నారు. వాడు ఎంతదూరం నుంచైనా- పరుగెత్తే మనిషిని సైతం గురి తప్పకుండా కాల్చగలడు-"

స్వాగత్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి- ఆవేశంతో అతని నరాలు పొంగి- రక్తం వేగంగా ప్రవహించింది.

ఈ రాస్కెల్స్ అమాయకులైన శైలజను, పవన్‌ను చంపారు. ఈ రాక్షసుల మూలంగానే తన జీవితం ఇన్ని మలుపులు తిరిగి ఇంత చిత్రవధ ననుభవించాల్సి వచ్చింది....

"నువ్వు ఇక్కడే వుండు-" అన్నాడతను.

కిటికీలోంచి కిందకు చూశాడు.

కిటికీకి తలుపులు లేవు- పాతకాలం నాటిదవడం మూలంగా చాలా పెద్దగా- ఒకేసారి నలుగురు వ్యక్తులు పట్టేలా వుంది. అంతస్థుకీ- అంతస్థుకీ మధ్య సన్‌షేడ్స్ కూడా లేవు- కిటికీ ఎక్కుతున్న అతన్ని భయంగా చేయి పట్టుకుని అంది శ్రీమతి.

"ఏం చేయబోతున్నావ్?"

అతను జవాబివ్వ లేదు. మెరుపులా కిటికీలోంచి కిందికి దూకాడు.

కెవ్వుమన్న ఆమె ఆర్తనాదం ఆమె గొంతులోనే నిక్షిప్తమై పోయింది.

నెమ్మదిగా సిగరెట్లు కాలుస్తూ వస్తున్న ఆ అయిదుగురూ హఠాత్తుగా తమ మీద అంత ఎత్తు నుంచి దూకిన అతన్ని ఊహించ లేక పోవడం వల్ల- బ్యాలెన్స్ తప్పి- ఐదుగురూ కిందపడ్డారు.

మెరుపు వేగంతో లేచాడు స్వాగత్-

పాషా కడుపులో బలంగా తన్నాడు. బాధగా అరిచి నేలమీద దొర్లుతున్నాడతను- మరో కాలితో ఇంకొకడి గడ్డం కింద తన్నాడు.

<u>ఇంతవరకూ సాగిన కథ - 23 :</u> తనను వ్యతిరేకిస్తున్న భార్యనవ్యను దారికి తెచ్చుకునే విషయంలో స్వాగత్‌కు మేనమామ భాగ్యరాజ్ సహకరిస్తాడు. శైలజ హత్యకేసులో చిక్కుకున్న నవ్యను విడిపించేందుకు పబ్లిక్ ప్రాసిక్యూటర్ స్వాగత్‌కు కొన్ని సలహాలిస్తాడు. శైలజను గురించిన వివరాలు తెలుసుకుంటుండగా స్వాగత్ పి. ఆర్.ఒ. పవన్‌కుమార్ హత్యకు గురవుతాడు. ఇన్నాళ్లూ నవ్యలో విషబీజం నాటిన భాగ్యరాజ్ బండారం శ్రీమతిగా నటిస్తున్న స్వాగత్ మరదలు పల్లవి బయటపెడుతుంది.

'ఫట్' మన్న శబ్దంతో పాటు రక్తం అతని నోటిలోంచి ముక్కులోంచి ఉబికి ఉబికి బుడగలుగా వస్తోంది.

అప్పుడే లేచి తన మీద పడబోతున్న వాణ్ని గమనించిన స్వాగత్- విసురుగా కుడిచేయి పిడికిలితో పక్కలో కొట్టాడు.

వాడు ఊపిరందక బాధతో విలవిల్లాడుతూ నేల మీద పడ్డాడు. వాణ్ని చూస్తూ ఒకే ఒక్క క్షణం ఆలస్యం చేశాడు స్వాగత్-

ఆ క్షణాన్ని అద్భుతంగా ఉపయోగించుకున్నాడు నాలుగో వ్యక్తి

బలంగా వెనక నుంచి రెండు చేతులూ అతని మెడ మీద బిగించి నొక్కసాగాడు.

స్వాగత్ ఊపిరందక ఉక్కిరిబిక్కిరవుతున్నాడు.

అప్పుడే మరోవ్యక్తి లేచి- కసిగా పిడికిలి బిగించి స్వాగత్ కడుపులో కొట్టాడు.

నరాలు తెగినట్టనిపించింది స్వాగత్‌కి- గొంతు మీద అతని చేతులు ఇంకా బిగుస్తున్నాయి.

పైన కిటికీలోంచి చూస్తున్న శ్రీమతి భయంతో గుండెల మీద చేతులు వేసుకుని చూస్తోంది.

అతను రెండో సారి కొట్టడానికి పిడికిలి బిగించి చేయి విసరబోతుండగా స్వాగత్ మోకాల్ని వేగంగా ఎత్తాడు.

అది ఊహించని ఆ వ్యక్తి గడ్డంకింద. అతని మోకాలు బలంగా తగిలి- వెల్లకిలా పడ్డాడు. అది చూసిన వెనకనున్న వ్యక్తి ఆశ్చర్యంతో అతని చేతులు కొంచెం పట్టు సడలాయి. అంతే- విపరీతమైన వేగంతో స్వాగత్

మోచేతిని విసురుగా వెనక్కి విసిరాడు. అది కత్తిలా వెళ్ళి అతని కడుపు కింది బాగాన తగిలి- అతను మరుక్షణం చేతులు వదిలి-

"అమ్మా" అంటూ నేలకొరిగాడు.

స్వాగత్ క్షణం కూడా ఆలస్యం చేయలేదు.

అక్కడే పడున్న ఎండిపోయిన చెట్టు కొమ్మ అందుకున్నాడు.

అప్పుడే పైకి లేవబోతున్న ఓ వ్యక్తి తల మీద బలంగా మోదాడు.

అతని తల పగిలి- రక్తంతో అతని ముఖం ఎర్రగా- భయంకరంగా మారి- ఆర్తనాదం చేసి పడిపోయాడు.

తన వెనుక చప్పుడయి మెరుపులా వెనక్కి తిరిగాడు స్వాగత్- కానీ అప్పటికే ఆలస్యం అయింది.

ఆ వ్యక్తి చేతిలో కత్తి పట్టుకుని- వికృతంగా నవ్వాడు. అతని నోటి నుంచి వస్తున్న రక్తంతో ఆ నవ్వు భయంకరంగా ఉంది.

స్వాగత్ కొమ్మ విసరబోయాడు-



అంతే మెరుపు వేగంతో ఆ వ్యక్తి కత్తి విసిరాడు.

అది ఊహించిన స్వాగత్ చివాలున పక్కకు జరిగాడు. వెంట్రుక వాసిలో ఆ కత్తి అతని కుడిభుజాన్ని రాసుకుంటూ వెళ్ళి ఎదురుగా వున్న మర్రి చెట్టులో బలంగా దిగబడింది.

స్వాగత్ కొమ్మను రెండు చేతుల్తో పట్టుకుని బలంగా విసిరాడు.

ఆ వ్యక్తి తటాలున కిందకు వంగాడు.

ఆ వేగాన్ని కంట్రోల్ చేయలేక స్వాగత్ బ్యాలన్స్ తప్పి కిందపడబోయే క్షణంలో –

పాషా లేచి– రివాల్వర్ తీశాడు!

కిందపడిన స్వాగత్ చుట్టూ చూశాడు.

నలుగురూ తన చుట్టూ చేరి వికృతంగా నవ్వుతున్నారు–

ముగ్గురి చేతుల్లో చురకత్తులు– పాషా చేతిలో నల్లగా మెరుస్తున్న రివాల్వర్!

నలుగురిలో ఒకడు స్వాగత్‌ని కాలుతో బలంగా తన్నాడు. స్వాగత్ ఎగిరి రెండడుగులు అవతల పడ్డాడు. అక్కడున్న ఇంకొకడు అదే వేగంతో తన్నాడు– స్వాగత్ కళ్ళముందు చీకట్లు ముసురు కుంటున్నాయి–

కసి– పట్టుదల– ఆవేశం అతని నరనరాల్లో ప్రవహిస్తున్నాయి.

తన్నడానికి కాలెత్తిన అవతలివాడి కాలును రెండు చేతుల్తో బలంగా పట్టుకుని మెలి తిప్పాడు.

అతను బాధగా అరుస్తూ కిందపడ్డాడు.

సరిగ్గా అప్పుడే రివాల్వర్ ట్రిగ్గర్ నొక్క బోతున్నాడు పాషా.

'నవ్వా' మని భయంతో అరిచింది శ్రీమతి.

ఆ పాత భవనంలో ఆమె కేక ప్రతిధ్వనించింది.

ఉలిక్కిపడి పైకి చూశారంతా–

అంతే– క్షణం కూడా వృధా చేయకుండా కాలితో పాషా చేతిలోని రివాల్వర్‌ను బలంగా తన్నాడు స్వాగత్.

అది ఎగిరి పదడుగుల దూరంలో పడింది. స్ప్రింగ్‌లా లేస్తూనే– కుడిచేతి పిడికిలితో పాషా దవడ మీద అదే వేగంతో – తన మీదకు కత్తితో వస్తున్న మరొక వ్యక్తి గడ్డం కింద రెండో చేత్తో ఒకేసారి బలంగా కొట్టాడు. ఇద్దరూ బాధగా కేకలు వేస్తూ కిందపడ్డారు. చివాలున వెనక్కి తిరిగి తన మీదకు రాబోతున్న వ్యక్తిని కాలుతో పొత్తికడుపు కింద విసురుగా తన్నాడు.

భయంకరంగా అరుస్తూ నేల మీద పడ్డాడా వ్యక్తి.

స్వాగత్ మెరుపు వేగంతో వెళ్ళి రివాల్వర్ అందుకున్నాడు.

కిందపడ్డ నలుగురూ నిశ్చేష్టులై చూస్తున్నారు.

## తప్పని తప్పు

తప్పులు చేయని వానికోసం
తడుముకుంటున్నా
అంతో ఇంతో
అంతా తప్పులు చేసినవారే!

గొప్పలు చెప్పుకోడానికి
తప్పులు చేయని వాడెవడున్నాడు?

అందుకే
మనిషిలోని తప్పును దిద్దమంటున్నా
నిర్లక్ష్యపు తుప్పు వదలకొట్టమంటున్నా
తప్పు చేసినవాని
తల తీయొద్దంటున్నా
మళ్ళీ నీవో పెద్ద తప్పు చేయొద్దంటున్నా!

-దిట్టకవి కృష్ణబాబు

రివాల్వర్‌తో లేవమని సైగ చేశాడు స్వాగత్.

నలుగురూ భయంగా లేచి చేతులెత్తారు.

"వెనక్కి తిరిగి చూశారంటే మీ తలలోంచి బుల్లెట్స్ దూసుకు పోతాయి. అలాగే నడుస్తూ పైకి పదండి–" అన్నాడు.

నలుగురూ చేతులెత్తి అలాగే నడుస్తూ మెట్లు ఎక్కారు.

స్వాగత్ వారి వెనుకే నడుస్తూ – రెండో అంతస్తులోకి వెళ్ళగానే ఆదుర్దాగా ఎదురైన శ్రీమతితో –

"కిటికీలు లేని గదెక్కడుందో చెప్పు శ్రీమతీ!" అన్నాడు.

ఆమె భయంగా వారిని చూస్తూ– రెండో గది తాళాలు తీసింది.

"లోపలికి పదండి ఫ్రెండ్స్" అన్నాడు స్వాగత్.

అంతా లోపలికెళ్ళారు.

శ్రీమతి చప్పున తలుపులు లాగి– బోల్టు పెట్టి తాళం వేసింది.

రివాల్వర్ జేబులో పెట్టుకుంటూ నవ్వి అన్నాడు స్వాగత్–

"సినిమాలు చూడ్డం వల్ల– ఏవిటి లాభం అనుకునే వాడిని– ఇప్పుడు తెలిసింది ఎంత లాభమో–"

శ్రీమతి నవ్వింది.

"వెళ్దాం పద. మన మీద ఎటాక్‌కు మీ నాన్న మనుషుల్ని పంపాడంటే– అవతల నవ్యకూడా ఏదో ప్రమాదంలో ఉన్నట్టు నాకనుమానం–" అన్నాడు వడివడిగా కిందికి ...గుతూ–

"అవును..... ఆ రాక్షసులు ఎంతకయినా తెగించగలరు–"

ఇద్దరూ– వేగంగా వెళ్ళి కార్లో కూర్చున్నారు. కారు స్టార్ట్ చేసిన శ్రీమతిని చూసి–

"వన్ ...నిట్–" అని కిటికీలోంచి చేయి బయటికి ఎట్టి–

పక్కనే ...ర్క్ చేసివున్న పాషా కారు ముందు ...డు టైర్లనీ రివాల్వర్‌తో పేల్చి–

"మన మిత్రులు తప్పించుకున్నా– సిటీకి రావడం కాస్త ఆలస్యం చేద్దామని...." అన్నాడు.

కారు శరవేగంతో దూసుకు పోతోంది.

★ ★ ★ ★ ★ ★

"నా కంఠంలో ప్రాణముండగా నేనీపని చేయను–"

ఆవేశంతో వణికిపోతూ అంది నవ్య.

అంతే–

ఆమె రెండు చెంపల మీద ఐదువేళ్ళు తేలాయి.

"నీ ప్రాణంతో మాకు ప్రమేయం లేదు. నీ ప్రాణంకన్నా ముఖ్యం నీ సంతకం మాకు. చేయి....." కోపంగా అంది భార్గవి.

"ఛీ... ఆడదానివై యుండి- ఇలాంటి దారుణం చేయడానికి సిగ్గులేదూ-

ఎంత అందంగా నాటకమాడారు?ఎంత ఆత్మీయత నటించారు?

డబ్బు కోసం ఇలా నటించే మీలాంటి గుప్పెడు గింజలకోసం ఒళ్ళమ్ముకునే ఆడకూతురు నయం."

ఆమెను అసహ్యంగా చూస్తూ అంది నవ్య.

అప్పటి వరకూ సోఫాలో కూర్చుని సిగార్ కాలుస్తున్న భాగ్యరాజ్ ఆవేశంతో లేచాడు. అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

నెమ్మదిగా నవ్య దగ్గరకొచ్చి- సిగార్‌ని ఓ సారి పీల్చి- చేత్తో పట్టుకుని.

"ఏదో ఆడపిల్లవి కదా అని దయతలుస్తుంటే- ఇష్టం మొచ్చినట్టు మాట్లాడు తున్నావ్- ఏం చూసుకునే నీకా పొగరు? పెట్టు... మర్యాదగా సంతకం పెట్టు..." అంటూ సిగార్‌ను ఆమె చెంపకు అంటించాడు-

బాధతో కెవ్వున అరిచింది నవ్య.

పకాలున నవ్వింది భార్గవి.

"అది శాంపిల్ మాత్రమే బేబీ- సంతకం చేయక పోతే ఇంతకు వెయ్యి రెట్లు చిత్రవధ అనుభవిస్తావ్-" అంది.

"మీరు నన్ను చంపినా సరే- సంతకం మాత్రం చేయను-" అంది నవ్య.

భాగ్యరాజ్ భార్గవిని చూశాడు.

ఇద్దరి కళ్ళూ ఏదో మాట్లాడు కున్నాయి.

మరుక్షణం భార్గవి లోపలికెళ్ళి ఓ బాటిల్‌తో తిరిగొచ్చింది. అది అందుకుని అన్నాడు భాగ్యరాజ్-

"ఇదేవిటో తెలుసా బేబీ- యాసిడ్-" అంటూ అక్కడ టీపాయ్ మీదున్న ఓ మెటల్ ఫ్లవర్‌వాజ్‌ను అందుకుని- బాటిల్లోని ద్రవాన్ని దాని మీద రెండు చుక్కలు వేశాడు.

బుస్సున పొంగి- పొగల మధ్య- రెండు రంధ్రాలు ఏర్పడ్డాయి.

"చూశావుగా- మెటల్‌నే కరిగించి వేసేంత పవర్‌ఫుల్ యాసిడ్ ఇది-

ఇప్పుడు నువ్వు సంతకం చేయకపోతే ఈ బాటిల్‌లోని ద్రవాన్ని ఒక్కో చుక్కా- నీ శరీరం మీద వేస్తూ- బాటిల్ ఖాళీ చేస్తాను- ఓకో" నవ్య భయంగా చూసింది.

ఆమె కళ్ళలోని భయాన్ని గమనించి నవ్వి అంది భార్గవి.

"ఎంతో అందమైన దానివని నీ మీద నీకు నమ్మకం కదూ! కాలి ఎముకలు కనిపించే నీ ముఖంతో నీ మొగుడు ఎలా కాపురం చేస్తాడో ఆలోచించుకో-"

"చెప్పు బేబీ- సంతకం చేస్తావా?" అడిగాడు భాగ్యరాజ్ బాటిల్ మూత తీస్తూ.నవ్య ఆలోచిస్తోంది.



ఈ దుర్మార్గుల వలలో పడి దేవుడిలాంటి భర్తను అనుమానించి- అవమాన పర్చింది. ఇదే తన ఆస్తి అయుంటే- ఎప్పుడో సంతకం పెట్టి పీడ వదిలించుకునేది- కానీ- ఇది స్వాగత్ ఆస్తి. తన ప్రాణాల మీద తీపితో అతనికి అన్యాయం చేయిడం తన వల్లకాదు. ఇప్పటికే అతనికి తన ద్వారా జరిగిన అన్యాయం చాలు. అతన్ని ఘోరాతి ఘోరంగా అవమానించిన నేరానికి తనకీ శిక్ష కూడా చాలదు.

"ఏవిటి ఆలోచిస్తున్నావ్-" గర్జించాడు భాగ్యరాజ్-

"వెల్- మూడే మూడు నిముషాలు టైమిస్తున్నాను. బాగా ఆలోచించుకో. మాక్కావల్సింది ఈ ఆస్తి. నీక్కావల్సింది నీ మొగుడు- నీ ఒక్క సంతకంతో ఇద్దరి కోరికలూ నెరవేరతాయి. ఏవంటావ్?" అన్నాడు.

నవ్య మాట్లాడలేదు.

"వన్-" వాచీ చూసి అంది భార్గవి.

స్తంభానికి తనను కట్టేసిన తాళ్ళు ఆమె చేతులకు రాసుకుని విపరీత మైన బాధగా వుంది.

ఆమె సంతకం విషయం ఆలోచించడం లేదు.

స్వాగత్!!

ఏమయ్యాడు? ఈ దుర్మార్గులు అతనికేహాని తలపెట్ట లేదుగదా-

స్వాగత్- ప్లీజ్ త్వరగా వచ్చెయ్- నీ ఆస్తితో పాటు నీ భార్యను కూడా రక్షించుకో-

నన్ను క్షమించు నేస్తం. ప్రపంచంలో ఏ భార్యా తన భర్తను అవమానించని రీతిలో నిన్ను అవమానించాను. అయినా నన్ను ద్వేషించకుండా ఇంకా ప్రేమించే నీ అనురాగ హృదయాన్ని గుర్తించలేని గుడ్డిదాన్నయి- నా జీవితంతో పాటు నీ జీవితాన్ని కూడా నాశనం చేసిన పాపాత్మురాలిని నేను...

"టూ-" అంది భార్గవి

భాగ్యరాజ్ యాసిడ్ బాటిల్ మూత తీసి- రెడీగా పట్టుకున్నాడు. నవ్య భాగ్యరాజ్ చర్యలు- భార్గవి మాటలు గమనించే స్థితిలో లేదు. ఆమె మనస్సు నిండా స్వాగత్ నిండి- పశ్చాత్తాపంతో ఆమె కుమిలి పోతోంది.

"త్రీ!!" అంది భార్గవి.

భాగ్యరాజ్ ఆమె ముందు పేపర్స్ పెట్టాడు.

నవ్య ఓ క్షణం పేపర్సనీ- భాగ్యరాజ్‌నీ చూసింది.

అంతే-

"థూ" అంటూ అతని ముఖం మీద ఉమ్మింది.

ఊహించని ఆమె చర్యకు అతనే కాదు- భార్గవి కూడా అప్రతిభు లయ్యారు. మరుక్షణం- పట్టరాని ఆవేశంతో వణికిపోతూ-

## లవ్ గేమ్

"యూ స్టుపిడ్– ఎంత ధైర్యమే నీకు..." అంటూ బాటిల్ ఎత్తి ఆమె ముఖం మీదకి విసరబోయేంతలో –

ఏం జరిగిందో అక్కడున్న ఆ ముగ్గురికీ అర్థం కాలేదు.

అతని చేతిలో యాసిడ్– నేల మీదున్న కార్పెట్ మీద పడి– కార్పెట్‌ను కాల్చేస్తుండగా– అతని చేయి రక్తంతో తడిసి... కెవ్వున అరిచింది భార్గవి.

"ధైర్యం అమెది కాదు భాగ్యరాజ్– నీది– నీ పెళ్లానిది..."

గుమ్మం ముందు రివాల్వర్‌తో నిలబడున్న స్వాగత్‌ను... అతని వెనుక నిలబడిన శ్రీమతిని సంభ్రమాశ్చర్యాలతో చూసింది నవ్య.

"వెల్ కం మై బాయ్– వెల్ కం– సరిగ్గా సమయాని కొచ్చావ్" అన్నాడు భాగ్యరాజ్.

స్వాగత్ విసురుగా వచ్చి నవ్య కట్లు విప్పసాగాడు.

సరిగ్గా అప్పుడు– అతని చేతిలోని రివాల్వర్ గాలిలోకి లేచి పడింది. ఆశ్చర్యంగా చూశాడు స్వాగత్.

భార్గవి గాలిలోకి లేచిన రివాల్వర్‌ను పట్టుకుని నవ్వుతూ అంది–

"పెళ్లాన్ని రక్షించుకునే ప్రయత్నంలో మా శక్తిని తక్కువ అంచనా వేశావ్ అల్లుడూ– ఆ ప్రయత్నం అపి– మౌనంగా చేతులెత్తి నిల్చో" అంది.

అప్రయత్నంగా చేతు లెత్తాడు స్వాగత్.

పెద్దగా నవ్వి అన్నాడు భాగ్యరాజ్.

"ఏం బేబీ– మొగుడొచ్చి కాపాడతాడని ఎంతో ఆశతో ఎదురు చూశావ్– ఏమైందిప్పుడు– ఇప్పటికైనా సంతకం చేయమ్మా".

"నేను చేయను"– దృఢంగా– స్థిరంగా అంది నవ్య.

భాగ్యరాజ్ ఆమె చెంపల మీద బలంగా కొట్టాడు.

అంతే–

రాక్షసుడై పోయాడు స్వాగత్.

ఎవరూ ఊహించని రీతిలో గాలిలోకి ఎగిరి– కుడికాలుతో భాగ్యరాజ్ దవడమీద బలంగా తన్నాడు.

"అమ్మా" అంటూ నేల మీద పడ్డాడు భాగ్యరాజ్.

భార్గవి ట్రిగ్గర్ నొక్కబో తుండగా–

ఆమె చేయి పట్టుకుని బలంగా మెలి తిప్పింది శ్రీమతి.

"బేబీ–" కోపంతో అరిచింది భార్గవి.

"షటప్– నన్నలా పిలిచే అధికారం నీకు లేదు" అంటూ రివాల్వర్ అందుకుంది.

స్వాగత్ భాగ్యరాజ్‌ని ఆవేశంతో ఒళ్ళు మరిచి చితకబాదు తున్నాడు.

శ్రీమతి నవ్య కట్లు విప్పింది.

సరిగ్గాఅప్పుడు–

అవతల గది నుంచి నలుగురు వ్యక్తులు హాల్లోకి ప్రవేశించారు. వారి చేతుల్లో కత్తులు– సైకిల్ చైన్లు వున్నాయి.

స్వాగత్ ఒకే ఒక క్షణం ఆశ్చర్యంతో చూశాడు వారిని.

ఆ క్షణంలో –

కింద పడున్న భాగ్యరాజ్– అతని కాలు పట్టుకుని బలంగా మెలి తిప్పాడు–

బ్యాలన్స్ తప్పి కింద పడ్డాడు స్వాగత్–

అంతే–

నలుగురూ అతని మీదకు దూకారు.

"పట్టండు దాన్ని కట్టేయండ్రా" అరిచాడు భాగ్యరాజ్–

"ఆగండి" గర్జించింది శ్రీమతి రివాల్వర్ గురిపెట్టి.

నలుగురూ ఆగిపోయి భాగ్యరాజ్‌ని చూశారు.

"బేబీ" శ్రీమతి పక్కనే నిల్చున్న భార్గవి అంది.

శ్రీమతి పక్కకు చూసింది.

అంతే–

నలుగురిలో ఓ వ్యక్తి చేతిలోని చెయిన్ విసురుగా ఆమె చేతిని దాటి రివాల్వర్‌ను లాగింది. అది చప్పున అందుకున్నాడు భాగ్యరాజ్.

"నువ్విలాంటి హీరో వేషాలు వేస్తావనే ముందుగా జాగ్రత్త పడ్డాను అల్లుడూ– మర్యాదగా నీ పెళ్లాం చేత సంతకం చేయించి– హాయిగా ఇద్దరూ కలిసి కాపురం చేసుకుంటారో– లేక ఇద్దరూ– ఈ గదిలోనే చచ్చిపోయి అమర ప్రేమికు లవుతారో ఆలోచించుకో"– అన్నాడు.

"ఓ మామయ్యగా ప్రేమగా అడిగి వుంటే నా మొత్తం ఆస్తి నీకిచ్చేవాడిని కానీ మిస్టర్ చీట్– ఆస్తికోసం మా జీవితాలతో ఆటలాడి– నా కళ్లముందే నా భార్యను కొట్టి హింసించావ్. అందుకే నా ఆస్తిలో చిల్లి గవ్వ కూడా నీకు దక్కనివ్వను" ఆవేశంగా అన్నాడు స్వాగత్.

"అయితే ఆఖరిసారిగా దేవుణ్ని తలచుకోండి" రివాల్వర్ గురిపెట్టాడు

భాగ్యరాజ్.

"ఆ అవసరం మాకు లేదురా ఇడియట్– ఆ దేవుణ్ణి నువ్వేతలచుకో" అన్నాడు స్వాగత్.

ఒక్క క్షణం కూడా ఆలోచించలేదు భాగ్యరాజ్. ట్రిగ్గర్ నొక్కాడు.

బాధగా గుండెల మీద చేయి పెట్టుకుని– స్రవిస్తున్న రక్తాన్ని అరికట్ట డానికి విఫల యత్నం చేస్తూ నేల కొరుగుతాడనుకున్న స్వాగత్–

నవ్వుతూ నిలబడడం చూసి ఆశ్చర్యంతో షాక్ తిని– మరోసారి ట్రిగ్గర్ నొక్కాడు.

"అది నీ మాస్టర్ కిల్లర్ రివాల్వరే మిస్టర్. బట్ బ్యాడ్‌లక్– అందులోని బుల్లెట్లన్నీ నీ గ్యాంగ్‌ను బంధించ డానికి ఖర్చయి పోయాయి. సో– ఇప్పుడు దేవుణ్ణి తలచుకో వలసింది ఎవరో నువ్వే ఆలోచించు"– అంటూ జేబులోంచి రివాల్వర్ తీసి గురి పెట్టాడు స్వాగత్– అందరూ అప్రయత్నంగా చేతు లెత్తారు.

"వెరీగుడ్– మర్యాదగా అంతా అలాగే చేతులెత్తి ఆ గదిలోకి నడవండి"– అన్నాడు స్వాగత్.

ఎవరూ కదల్లేదు.

రివాల్వర్ పైకెత్తి ట్రిగ్గర్ నొక్కాడు స్వాగత్.

హాల్లో సీలింగ్‌కు వేలాడుతున్న షాండ్లియర్ తెగి నేల మీద పడి ముక్కలైంది.

"చూశారుగా ఇంకా ఇందులో ఐదు బుల్లెట్లున్నాయి... కమాన్– నడవండి" అన్నాడు.

అంతా ఆ గదిలోకి వెళ్లాక– గది తలుపు తాళం వేసి పోలీసులకు ఫోన్ చేశాడు స్వాగత్.

ఎదురుగా కనిపిస్తున్న నవ్య గది వేపు చూశాడు. అది బోల్టు పెట్టి వుంది. వెళ్లి తీశాడు.

లోపల అందరి నోళ్ళకూ ప్లాస్టర్స్ వేసి– చేతులూ కాళ్ళూ కట్టేసి.... ఏడుస్తూ కూర్చున్నారు.

సావిత్రి – మీనాక్షి– మన్మథరావ్– సుందరమూర్తి.

స్వాగత్ అందర్నీ వెంట బెట్టుకుని హాల్లోకి వచ్చాడు.

నవ్యను చూసి ఘొల్లుమన్నారు సావిత్రి– మీనాక్షిలు.

"బాబూ– దేవుడి లాంటి నిన్ను అపార్థం చేసుకుని– ఆ భాగ్యరాజ్‌ని దేవుడని నమ్మాం– మాకు ఆ భగవంతుడు మంచి శిక్షే విధించాడు." స్వాగత్‌ను చూసి రెండు చేతులూ జోడించి అంది సావిత్రి.

స్వాగత్ మాట్లాడలేదు.

ఇంతలో పోలీసు లొచ్చారు.

అందర్నీ గదిలోంచి బయటకు తీసుకొచ్చారు.

భాగ్యరాజ్– భార్గవీలు తలెత్తి అందర్నీ ఓసారి చూశారు.

నెమ్మదిగా నడుస్తూ శ్రీమతి దగ్గర కొచ్చి అన్నాడు భాగ్యరాజ్....




"సారీ బేబీ– నీ కోసమే ఇదంతా చేశాను. కానీ నువ్వే మా కెదురు తిరిగావ్– ఎనీహౌ– గాడ్ బ్లెస్‌యూ మై చైల్డ్!"

కళ్లలో తిరుగుతున్న నీటిని ముంజేతితో తుడుచుకుంటూ అన్నాడు భాగ్యరాజ్. భార్గవి మాట్లాడ లేదు. కూతుర్ని చూస్తూ నిశ్శబ్దంగా రోదిస్తోంది.

మరుక్షణం అందర్నీ వ్యాన్‌లో ఎక్కించి పోలీస్ జీప్ వెళ్ళిపోయింది.

స్వాగత్ అందర్నీ ఓసారి చూసి– మౌనంగా మేడ మీద కెళ్లిపోయాడు.

సరిగ్గాఅప్పుడు–

సూర్యం– ఓ పాతికేళ్ళ యువకుడితో ప్రవేశించాడు.

అతన్ని చూసిన నవ్య ఉలిక్కిపడింది.

అతన్నెక్కడో– ఎప్పుడో చూసిన జ్ఞాపకం.

"గుర్తుపట్టావా అక్కా!"– అడిగాడు సూర్యం.

నవ్య మాట్లాడ లేదు. అతన్నే చూస్తోంది.

అతను రెండు చేతులూ జోడించి అన్నాడు–

"నమస్తే– నాపేరు కామేష్."

ఉలిక్కిపడింది నవ్య.

"అవును మేడం... నేను కాలేజీలో మీకు సీనియర్‌ని. స్వాగత్ క్లాస్‌మేట్‌ని. ఆ రోజుల్లో కాలేజీల్లో స్వాగత్‌కున్న పరపతి– ఇమేజ్ నాకు జెలసీ కలిగించింది. అందుకే అతన్ని అల్లరిపాలు చేయాలని నిర్ణయించు కున్నాను. సుధకి స్వాగత్ అంటే ప్రాణమని తెలిసి– ఆ అవకాశాన్ని అందంగా ఉపయోగించు కోవడం కోసం– స్వాగత్ పేరు మీద సుధకి లవ్ లెటర్స్ రాశాను. ఆ విషయం తెలియని సుధ– స్వాగత్‌ని గాఢంగా ప్రేమిస్తున్నానని రిప్లై రాసింది. ఉత్తరాలు సీక్రెసీ కోసం వేరే అడ్రస్‌కి రాయమని నేను సుధకి రాయడంతో– ఆమె ఉత్తరాలన్నీ డైరెక్ట్‌గా నాకు చేరేవి.

ఇక ఆ తర్వాత కథ మీకు తెలిసిందే. సుధకి పెళ్లి చూపులు– స్వాగత్‌ని సలహా అడగమని మీరే సుధని స్వాగత్ దగ్గరకి పంపారు. అయితే– తనకేమీ తెలీదనీ– అసలు తనకా ఉద్దేశమే లేదని స్వాగత్ సుధతో అనేసరికి– ఆ అవమానం భరించలేక ఆమె ఆత్మహత్య చేసుకుంది.

# వేలుకి నచ్చిన జోక్‌లు



## అర్హత

"దూరదర్శన్‌లో 'టెలిప్రాంప్టర్' చూస్తూ వార్తలు చదివే వారికి ముందు అనుభవం ఏమైనా ఉండాలా?"

"ముందు సీట్లో కూర్చున్న వారి ఆన్సర్ పేపర్లు చూసి కాపీ కొట్టే అనుభవముంటే చాలు."

## కారణం

"ఈ వర్షాలు చాలవంటున్నారేం డాక్టర్? మీకు పొలాలున్నాయా ఏమిటీ?"

"లేవు కాని, జ్వరాలు, దగ్గులు, పడిశెం అంటూ రోగులెవరూ రావడం లేదే మరి?"

## తండ్రికి తగ్గ తనయుడు

"2 రూపాయలలో ఒక వస్తువు కొన్న ధర రూ 1-70 పైసలు పోతే ఎంత చిల్లర ఇవ్వాలిరా?" అన్న టీచర్ ప్రశ్నకు "25 పైసలు," అని జవాబిచ్చాడు గోపి.

"వెధవ తప్పు".

"కాదండి. మా నాన్నారు అలాగే ఇస్తుంటారు."

"ఏం చేస్తుంటార్రా మీ నాన్న?"

"బస్ కండక్టర్"

## పొరబాటు

విమానం రయ్యుమని గగనంలో ఎగురుతోంది. ఒకడు మెషిన్ గన్‌తో కాక్‌పిట్‌లోకి దూరాడు. "ఏయ్! ఈ విమానాన్ని లండన్‌కు మళ్లించు!" అని బెదిరించాడు.

"మళ్లించడమెందుకు? ఇది లండన్‌కే పోతోంది," అన్నాడు పైలెట్ తాపీగా.

"గుడ్ గాడ్! ఐతే, నేను పొరపాటున మరో విమానం బదులు ఈ విమానంలోకి ఎక్కానన్న మాట!" అని నిట్టూర్చాడా హైజాకర్.

## అదీ లేదు

సైకిల్‌లో రయ్యుమని వెళ్తున్న హరిని ఆపాడు ట్రాఫిక్ కానిస్టేబుల్.

"లైట్ లేకుండా పోతున్నా వేమిటి? ఏమిటి నీ పేరు?" అని కంప్లయింట్ రాయడానికి జేబులు తడుముకుంటే, పేనా కనిపించలేదు. హరి జేబులో ని పెనా చూసి, "దాన్నిలా ఓసారివ్వు," అన్నాడు.

"అందులో సిరా కూడా లేదండి", అని హరి జవాబు.

## అసలు రహస్యం

"మీ థియేటర్‌లో స్క్రీన్ ఎప్పుడూ తెల్లగా తళ తళ లాడుతూంటుంది. ఎలా?"

"ప్రతి ఆటకూ రెండు మూడు డిటర్జెంట్ సోప్‌ల అడ్వర్టయిజ్‌మెంట్లు ఆ స్క్రీన్ మీద వేస్తుంటాం కదా?"

-సేకరణ : జి. వి. జి.

## లవ్ గేమ్

నేనూహించినట్టే- సుధ దగ్గర దొరికిన స్వాగత్ రాసిన ఉత్తరాలకి పబ్లిసిటీ వచ్చి- అతను అల్లరిపాలయ్యాడు....

దిగ్భ్రాంతితో చూస్తోంది నవ్య.

ఆమెనోసారి చూసి తల దించుకుని అన్నాడు కామేష్.

"మీరు క్షమిస్తానంటే- మరో విషయం.... కాలేజీ బ్యూటీ అయిన మిమ్మల్ని స్వాగత్ ప్రేమించడం సహించలేక పోయాను. సుధ ఆత్మహత్యతో మీరతన్ని ద్వేషించసాగారు.

ఇప్పుడాలోచిస్తుంటే అనిపిస్తుంది. ఎంత అర్థం లేకుండా నేను ప్రవర్తించానూ అని...."

"మరి... మరి... సుధకి వచ్చిన ఉత్తరాలన్నీ స్వాగత్ రైటింగ్‌లోనే వుండేవి...." అంది.

ఆ మాటతో కామేష్ తల మరింత కిందకి వాలిపోయింది.

"స్వాగత్ దస్తూరిని నేను ఫోర్జరీ చేశానమ్మా. ఆ రోజు స్వాగత్‌ని అల్లరిపాలు చేయడంలో విజయవంతమైన నేను ఫోర్జరీ చేయడమే వృత్తిగా పెట్టుకున్నాను. అయితే- సంవత్సరం తిరక్కుండానే జైలుపాలు అయ్యాను- అప్పుడు తెలిసిందమ్మా- జీవితమంటే ఏమిటో- నేను అకారణమైన ద్వేషంతో ఎందరి జీవితాల్లో చిచ్చుపెట్టానో ఆలోచిస్తే- నా మీద నాకే అసహ్యం వేస్తుందమ్మా..."

పశ్చాత్తాపంతో అతను ఏడుస్తున్నాడు. తటాలున వెళ్లి ఆమె చేతులు పట్టుకుని అన్నాడు.

"నన్ను క్షమించమ్మా- స్వాగత్ నిన్ను పెళ్లి చేసుకున్నాడనీ- సుధ మూలంగా మీ ఇద్దరూ విడిపోయే పరిస్థితుల్లో వున్నారనీ సూర్యం ద్వారా తెలుసుకుని- నీకు నిజా నిజాలు చెప్పాలని వచ్చాను. నన్ను క్షమించమ్మా.... ఇందులో స్వాగత్ తప్పేం లేదు. తప్పంతా నాదే!" అతను ఏడుస్తున్నాడు.

(ఇంకా వుంది)

# ఈవారంలో మీ యోగం

31-8-1990 శుక్రవారం మొదలు
6-9-1990 గురువారం వరకు

**మేషం:** ధన కనక వస్తు వాహన సౌఖ్యం, సుఖశాంతులు, ఆనందం, కుటుంబానందం, పదిమందిచే కీర్తి ప్రతిష్ఠల కాకరమైన వారమే. యోగదాయక వారం. 'గురుని' చతుర్థ స్థితి, రవియుతి. అంతటి ఆనందదాయకం. స్త్రీలకు: సర్వవిధాలా మేలే. 'చేసిన యత్నాలు యోగదాయకములే'అని గ్రహిస్తారు.

**వృషభం:** శ్రమించి అయినా యత్న కార్యాన్ని సాధిస్తారు. తిరిగి తిరిగి ఉద్యోగ యత్నాన్ని సాధిస్తారు. ఆదాయమందు ఆశించిన మొత్తాని కన్నా అధికంగా అందుకొంటారు. బంధు మిత్ర సమాగమం, కార్యసిద్ధి. స్త్రీలకు: తోడివారికి సాయం చేయవలసిన పరిస్థితి, మిత్ర సహగమం, రాజకీయంగా అనుకూలత.

**మిధునం:** ధనలోపం లేదు. నగలు కొనుగోలు చేస్తారు. మీ రచనలు పత్రికా రంగానికెక్కుతాయి. నిర్మాతలకు, పంపిణీదారులకు, చిత్ర రంగాన నటించు వారికి, ఇప్పుడిప్పుడే రంగ ప్రవేశం గావించే వారికి అనుకూలం. 'సజ్జన సాంగత్యం సర్వ విధాలా యోగదాయక'మని గ్రహిస్తారు. స్త్రీలకు: వృత్తి యందు పెంపు, చిత్ర రంగానుకూలత.

**కర్కాటకం:** చాల కాలంగా ఎంత ప్రయత్నించినా 'ససేమిరా' అని ఎదురు తిరిగిన వ్యవహారాలు, వారాంతాన సానుకూలం కానున్నవి. రాజకీయ నాయకుల చుట్టు తిరిగి తిరిగి విసిగి పోవటం కూడ గ్రహించగలరు. ప్రయాణం సాగి రాకపోవటం కూడ గమనానికి వస్తుంది. అంతా రాశి స్థితి 'గురు కేతు' గ్రహాల ప్రభావమే. స్త్రీలకు: ఆరోగ్య వృద్ధి, స్వల్పాదాయం.

**సింహం:** దూర ప్రాంతాల నుండి బంధు మిత్రులు రాగలరు. అతిథి అభ్యాగతులను ఆదరించవలసిన వారం. అప్పులుంటే, యత్నించండి వసూలు కాగలవు. పదుగురలో ప్రతిష్ఠ, సభా రంగాన మర్యాద. స్త్రీలకు: యత్న కార్యానుకూలత, ఉద్యోగమందు పెంపు, రచనా రంగానుకూలత.

**కన్య:** సమయానుకూలంగా, తెలివితేటలు ఉపయోగించి మీ కార్యక్రమంలో నిమగ్నులవుతారు కొందరు. సుఖశాంతులున్నాయి. బహు కష్టంతో చేసిన ఉద్యోగ యత్నాలు సానుకూలమవుతాయి. కొందరకు ఉద్యోగరీత్యా 'ప్రమోషన్' కూడ రావచ్చు, గ్రహించాలి. స్త్రీలకు: పదిమందిలో ఆదరణ, ఉద్యోగమందు వృద్ధి, యత్న కార్యసిద్ధి.

**తుల:** శుభ యోగమున్నది. 'వక్ర శని' మూడింట ఉన్నా కొంత మేలేనని గ్రహించాలి. ఆదాయానికి అనుకూల పరిస్థితులు విద్యారంగాన 'సినీ' రంగాన ఉన్నాయని వారాంతంలో మీరే గ్రహించాలి. స్త్రీలకు: చేసిన ఉద్యోగ యత్నాలు సానుకూలమవుతాయి. ధనలోపంలేదు. వ్యాపార లోపం కూడా లేదు.

**వృశ్చికం:** దూర ప్రాంతాల నుండి బంధు మిత్రులు రానున్నారు. అప్రయత్న ధనలబ్ధి. కళా సాహితీ రంగాలందు మేలున్నది. యోగదాయకమే. అయినా అధిక వ్యయం కూడా చెప్పవచ్చు. మీకు రావలసిన డబ్బు ప్రభుత్వ సంబంధమైనది అందవచ్చు. స్త్రీలకు: సభా మర్యాద, చేసిన ఉద్యోగ ప్రయత్నాలు సానుకూలం కాగలవు, గ్రహించాలి.

**ధనుస్సు:** పదిమందిలో ప్రతిష్ఠ, అప్రయత్నాదాయం అధిక వ్యయం చేయవలసిన పరిస్థితి కూడ ఏర్పడుతుంది. శుభ కార్య ప్రస్తావనలు, కొందరకు 'లగ్న' నిశ్చయ వివాహావకాశాలు ఉంటాయి. స్త్రీలకు: ఉద్యోగమందు 'ప్రమోషన్' కొందరకు సాంఘికంగా మేలు. కొందరకు అప్రయత్నాదాయం. యోగాధ్యం కాక మరేమిటి?

**మకరం:** యోగదాయం ఎందులో? అప్పులు వసూలు కావటం, ఆదాయం వృద్ధి చెందటం, అయినా అధిక ఖర్చులుండటం కూడా యోగానికి చెందినదే. అధికారుల వలన మేలున్నదని 'బుధ, శుక్రులు' వలన గ్రహించవలె. స్త్రీలకు: అధికారుల ఆదరణ, అప్రయత్న ధనలాభం.

**కుంభం:** సుఖ శాంతులున్నాయి. యోగదాయకమే. 'గురుని' సువర్ణ మూర్తి మత్వం అనుకూలమే. సభా రంగాన మేలున్నది. 'క్యాసెట్టు' నిర్మాతలకు, అనుకూల వారం, అందులో అధిక మేలుంటే యోగాధ్యమే. స్త్రీలకు: సుఖశాంతులు, బంధు మిత్ర కుమార్తె కుమారుల సమాగమం.

**మీనం:** చాల రోజులుగా వెనుక ముందులాడే వ్యవహారం ఈ వారం సానుకూలం కాగలదు. దూర ప్రాంతాలకు వెళ్లవలసిన అగత్యం, తద్వారా కొందరకు మేలున్నది. స్త్రీలకు: శుభ యోగం, ద్రవ్యాదాయం, అప్పులు వసూలు.

-విద్వాన్
కోట సత్యరంగయ్యశాస్త్రి

### ఏ భాషలో ఏమిలేదు?

అలనాటిఅందాల అమ్మాజీకూతురు నేటి సినీ అపరంజి బొమ్మ "జయచిత్ర" తెలుగు అమ్మాయ్- అయినా, ఆమె మొట్టమొదటిసారిగా కథ-నిర్మాణం-దర్శకత్వం వహిస్తున్న చిత్రం-"తమిళం" కావడం విశేషం! దాదాపు చిత్రీకరణ పూర్తయి, ఎడిటింగ్, మిక్సింగ్ కార్యక్రమాలు జరుపుకుంటున్న ఆ చిత్రం పేరు-"పుదియరాగం"(ట!)

# ఆ తర్వాత ఏం జరిగింది?

బమ్మిడి జగదీశ్వర రావు

నాగది అంతా చీకటిగా ఉంది. చీకటిని ఛేదించడానికి ప్రయత్నించి ఓ క్రొవ్వొత్తి నా ముందే ఆత్మాహుతి చేసుకుంది.

ఆలోచనలు ఆరిపోని . నిప్పురవ్వల్లా ఉన్నాయి. గుండుసూదులు గ్రుచ్చినట్లుగా శిరోభారం అధికమయింది. కళ్లు అవిరిని చిమ్ముతూ -పుసులు కడుతున్నాయి. కడుపులో ఆకలి ఎక్కువయి అకతాయిగా ప్రేవుల్ని మెలిత్రిప్పుతూంది.

ఆ స్థితిలోనూ అమ్మ గుర్తొస్తోంది నాకు. గూట్లో మినుకు మినుకుమని వెలిగే దీపంలా గుడిసెలో అమ్మ......పాపం..... ఒంటరిగా.....ఏం చేస్తుంటుంది? తన గురించే ఆలోచిస్తుంది! ఈ పూట అన్నం తిందో....లేదో!? "నా కెందుకుర్రా.... ఒక్కదాన్ని నా గురించి ఎందుకు వండుకోవాలి? తింటేటి.... తినకపోతేటి.... ఒక్కపూట మానేస్తే సచ్చిపోతానూ? అంతవేగరం సావువస్తాదట్రా...." అమ్మ మాటలు జ్ఞప్తికి వస్తున్నాయి.

న్నేను వయసులో ఉన్న వాణ్ణిగాని ఓ పూట భోజనం లేకపోతే భరించలేకపోతున్నాను. మరి అమ్మ..... ఆకలికి, ఒంటరితనానికి అలవాటు పడిపోయింది. ముసలితనపు ముంగిట్లో ముడుచుకు కూర్చున్న తల్లి గుర్తొచ్చేసరికి అప్రయత్నంగా కనుకొలకుల్లో కన్నీళ్లు ఇమడలేకపోయాయి.

".......ఏమయ్యా! రాజా... ఎంత సేపట్నుండి పిలిచేది? ఈ లోకంలో ఉన్నావా అసలు..... అసలు చీకట్లో కూర్చున్నావేమిటా అనుకున్నాను. ఇంటి తలుపులు తీసి లైట్లు వేస్తే వెలగటం లేదేంటి? అందరికీ కరెంటు ఉంది. ఏమయిందయ్యా" కసురుకున్నట్లు అడిగాడు ఇంటి ఓనర్.

'ఆ.....' అంటూ లేచి నిలబడ్డాడు. సమాధానం ఏం చెప్పాలో తెలియడంలేదు. గొంతు పెగలడంలేదు.

"ఏమయ్యా దెయ్యం పట్టినట్లు పలకవూ ఉలకవూ... ఏమయ్యింది" గద్దించింది ఇంటి ఓనర్ భార్య.

"ఫీ......ఫ్యూజు....కరెంటు ఫ్యూజు తీసేసారు...." పొడిపొడిగా అన్నాను.

"ఏంటి ఫ్యూజు తీసేసారా..... వందరూపాయలు కరెంటు బిల్లు కట్టమని ఇచ్చేగా ఊరెళ్లాను" ఆశ్చర్యంగా అడిగాడు ఓనర్.

"అది.... అది...." చెప్పబోయాను.

"ఆ..... ఆ వంద ఖర్చెట్టేసావా? ఏం చేసావు.... అసలు మా ఆయంద బుద్ధితక్కువ.. ... లేకపోతే నీకు అప్పజెప్పడమేటి" విరుచుకు పడింది వాళ్ళావిడ.

"మా అమ్మకి బాగోలేదంటే.....పంపించా" అన్నాను మెల్లగా.

"అబ్బో కొత్త ప్లేటా..... ఇప్పటికే నీ రూమ్ రెంట్ ఈ నెలతో మూడు నెల్లు కట్టాలి. దానికి తోడు ఈ వందరూపాయలు వడ్డీయా....." ఆయన నిలదీసి మరీ అడిగాడు.

"రోడ్డునపోయే ప్రతి వెధవనీ నమ్మొద్దని నెత్తినోరు కొట్టుకున్నాను. విన్నారా? లేదే, చెవి కోసిన మేకలా అరుపేంటే.... అన్నారు. అద్దె ఇల్లనుకొన్నాడో సత్రమనుకున్నాడో ప్రతి అడ్డమయిన వెధవా...." ఆవిడ మాటలు విసిరేస్తోంది.

"అలా మాట్లాడకండి" అని మాత్రమే అనగలిగాడు.

"మరెలాంటి మాటలు మాట్లాడాలి. ఎందుకొచ్చిన రోషమయ్యా. నాల్రోజుల్లో రెంటు డబ్బులు, ఫీజు డబ్బులు చెల్లించి ఇల్లు ఖాళీ చెయ్యకపోయావో పోలీసు రిపోర్టు ఇస్తా' ' హెచ్చరించి వెళ్లాడు ఓనర్. వాళ్లావిడ ఇంకా తిట్టి పోస్తూనే ఉంది. మరో నలుగురు పోగయి నన్నే తిట్టిపోసారు.

ఆ రాత్రి మంచినీళ్లు నా ఆకలి ప్రేవుల్ని తాత్కాలికంగా చల్లార్చగలిగాయి.

తెల్లవారింది. ముఖం కడుక్కొని రోడ్డుకేసి నడిచాను. ఓ బార్బర్‌షాపు ఎదురుగా ఆగాను. నా కళ్లు నాకు తెలియకుండానే వెదుకుతున్నాయి.

"కటింగ్ విత్ సేవా, లేక ఓన్లీ సేవా" షాపు ఆయన నన్ను చూస్తూ అడిగాడు. చెంపలు గడ్డం తడుముకున్నాను. ముళ్లల్లా పెరిగిన గడ్డం చురుక్కుమంటూ గుచ్చుకుంది.

"ఏమీ వద్దు.....పేపరు చదువుదామని" లేని నవ్వు లాంటి దాన్ని ముఖంలోకి తెచ్చుకుంటూ అన్నాను.

"ఏమిటో బాబు, ఇన్నాళ్లు పేపర్లూ, పుస్తకాలు చదవటానికి గ్రంథాలయాలూగట్రా ఉండేవి. ఇపుడు చదవాలంటే బార్బర్‌షాపులూ..... కిళ్లీ కొట్టులూ ఎతుక్కోవాల్సి వస్తోంది. గవర్నమెంటోళ్ళు పేపరు రేటు కూడా పెంచేసారు. అయినా ఇపుడు ఏ ఊర్లోనన్నా బార్లుంటాయి.... క్లబ్బులుంటాయి-సారా దుకాణాలుంటాయి. కాని లైబ్‌రరీలు ఎందుకుంటాయి. అటివల్ల గవర్నమెంటుకేటి లాభం" సుదీర్ఘంగా ఆ షాపు ఆసామి అన్నాడు.

ఆయన మాటల్లోని వాస్తవం గమనించకుండా పేపరంతా గబగబా వెతికి చూసాను. చదివాను. మరోసారి గమనించాను. లాభంలేదు. ఎక్కడా కనిపించలేదు.

"ఏటి బాబు అంతగా చూస్తున్నావు, పరీక్షల ఫేసు ఫేల్టు వచ్చిందా?" అడిగాడు షాపాయన.

"అది కాదండి..... బ్యాన్ ఎత్తేసారేమోనని....." చల్లబడిపోయాను.

"ఏటయ్యా కలగాని కన్నావేటి.. లేపోతే బ్యాన్ ఎత్తడం జరిగిపోగల్దు. ఉద్యోగం వచ్చి గల్దు" అంటూ నవ్వా

డాయన.

క్షవరం చేసుకోవడానికొచ్చిన మరో యువకుడు కల్పించుకొంటూ "పద్దెనిమి దేళ్ళకే ఓటు హక్కు ఇచ్చారు గదా" అన్నాడు నవ్వుతూ.

"ఇస్తారు.....ఇస్తారు పద్దెనిమిదేళ్ళకి ఓటుక్కు ఇస్తారు గాని నలభై ఏళ్లైనా ఉద్యోగాలివ్వరు. ఉద్యోగం ఇస్తే గవర్న మెంటోడుకి డబ్బు ఖర్చు.... ఓట్లన్నావా పైసా ఖర్చు లేనిది. పైగా ఆ ఓట్లే సుకొని నాయకులైపోయి నాయాళ్లు మన నెత్తినెక్కి కూర్చుంటారు" ప్రసంగం ఇచ్చి నట్లు చెప్పాడు బార్బర్‌షాపుగల ఆయన.

ఇందాకటి కుర్రాడు మళ్లీ అన్నాడు. "సోదరా..... బ్యాను హాళ్ళెత్తరు. ఎత్తినా మనలాంటోళ్ళకి ఉద్యోగాలు రావు. లంచం.... రికమండేషన్ అన్నావా....అవి ఉంటె పైకొస్తావ్. ఎందుకంటె నేనను భవంతో చెపుతున్నాను."

"ఏం అబ్బాయిగా నీకీ రోజుతో (వయోపరిమితి) ఏజ్‌గాని దాటిపోతోందా, నాకూ అలానే పుణ్యకాలం కాస్త గడచి పోయింది. ఏడేళ్ళైనా బ్యాన్ ఎత్తలేదు" నడి వయస్కుడు నాతో అంటూ షేవింగ్ పని పూర్తిచేసుకున్నాక చైర్లోంచి దిగాడు.

'వస్తానండి' అంటూ వాళ్ళ దగ్గర సెలవు తీసుకొని అక్కడి నుండి కదిలాను.

"నిజమే నాకు ముప్పైఐదేళ్ళు దాటి పోయాయి. ఇక ఎంప్లాయిమెంట్ న్యూస్ కోసం... ఏవన్నా ఆ పర్ట్యూని వస్తా యని పత్రికలకు ప్రాకులాడవలసిన పని ఇంకలేదు. నా మీద నాకే జాలివేసింది. నాన్న ఎలా ఉంటాడో నాకు గుర్తులేదు. అమ్మే అన్నీ అయి ఉన్న పొలం అమ్మేసి కూలి డబ్బులతో డిగ్రీ వరకు ఈడ్చుకొ చ్చింది. నేను కష్టపడలేనని.... చదువు కుంటె మంచి ఉద్యోగం వస్తుందని..... నేను సుఖపడతానని.. .. సుఖపెడతానని ఎన్ని ఆశల పొదరిళ్లు కట్టుకుందో? ఈ పల్లెటూర్లో పొలం పని నువ్వేం చేస్తావని చదువయిపోయినా బస్తీలోనే బ్రతకమంది నా పిచ్చితల్లి!

అమ్మ అనుకున్నట్లు చదువుకోగానే ఎవరుజ్జోగం ఇచ్చేస్తారు. నా లాగ ఎందరో? మొదటినుండి కష్టపడ్డాను కాదు. ఇపుడు కష్టపడదామంటే చేత కాదు. "చదువుకున్నోడివి నువ్వేం కూలి పనిచేస్తావ్...." ఒకరిద్దరు ముఖం మీదే అన్నారు. ఓ కాంట్రాక్టర్ దగ్గర రోజుకి పదహారు రూపాయలకూలికి కుదిరితే- నెల య్యేసరికే నీవు పనికిరావు పొమ్మన్నాడు. తరువాత టైపిస్టుగా వెతకగా వెతకగా దొరి కింది. అది మరో మూడు నెల్లకే



ఊడిపోయింది. వాళ్ళ "రెలిటివ్"ని నా స్థానంలో వేసుకున్నారట.

వ్యాపారం చేద్దామంటే పెట్టుబడిలేదాయె. సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్‌కి నే అప్లై చేసి బ్యాంకులు చుట్టూ తిరిగాను. పస్తులు.... పడిగాపులూ పడ్డాను. ఆఖరి క్షణంలో బ్యాంకుమానేజరు, ఫీల్డు ఆఫీసరు వాళ్ళ కులపోడికి పట్టం కట్టారు. నన్ను ఇంకోసారి చూద్దాం అన్నారు. అడిగితే వాగ్దానం తప్ప వరం దక్కలేదు. వాళ్ళకి మేపలేక విసుగుపుట్టి ఆ ప్రయత్నమూ విరమించుకున్నాను.

ఇప్పుడు ఏ పనీ లేక వీధిన పడ్డాను. నాలుగు నెల్లయినా నయాపైసా అమ్మకి పంపలేదన్న తరుణంలో ఇంటిఓనర్ కరెంటు ఫీజు డబ్బులు ఉపయోగపడ్డాయి.

ఆ రోజు కూడా నాకెక్కడా పని దొరకలేదు. రెండ్రోజులుగా అలముకున్న ఆకలి శరీరానికి సహకరించకుండా మరింత నీరసింపజేస్తోంది.

అప్పుడే..... మెరుపు మెరిసినట్టు
ఎలక్షన్లు..... ఎలక్షన్లు.......

ప్రకటించడం..... అనేక పార్టీలు రంగంలోనికి దిగాయి.

ఇన్నాళ్లు లేనిది ఇప్పుడు దేశానికి సేవ చేసేస్తామంటూ గొంతు చించుకు అరుస్తున్నారు నాయకులు. నన్ను గెలిపించి చూడండి అని తమ ఓటు భక్తిని వెలిబుచ్చుకుంటున్నారు. కులాలు గ్రూపులు తయారయ్యాయి. మతాలు మతతత్వాన్ని రెచ్చగొడుతున్నాయి. పార్టీ జెండాలు ఎగురుతున్నాయి. మైకులు పగులుతున్నాయి. ఆటోలు టాక్సీలు హోరెత్తిపోతున్నాయి.

## ఆ తర్వాత ఏం జరిగింది?

ప్రజల కర్ణభేరిలు పగిలిపోతున్నాయి.

నాకిదంతా చాలా చికాకును, అసహ్యాన్ని కల్గిస్తున్నాయి. రూమ్ చేరుకున్నాను. చాపమీద చారగిలబడ్డాను. సాయంత్రమయ్యింది. పిల్లలు వీధిలో ఆడుకుంటున్న గోల విన్పిస్తోంది. ఆకలి దంచేస్తోంది.

ఇంతలో ఓ కుక్క రొట్టెముక్కతో పరిగెత్తుకువచ్చింది. ఆ రొట్టెను నేలపై పడేసి అటూ ఇటూ చూసింది ఎత్తుకొచ్చానని ఎవరేని వెంటపడ్డారేమోనని. వెంటనే నే పరుగున వెళ్లేసరికి- కుక్క రొట్టెను వదలి భయంగా పరిగెత్తి కాస్త దూరం వెళ్లి నిల్చుంది. నేను ఆత్రంగా ఆ రొట్టె నందుకొని ముక్క తుంపి నోట్లో అబగా పెట్టుకొని నమిలాను. ఆ కుక్క నా దగ్గరగా వచ్చి తోకూపుతూ "కూకూ" మంటూ ప్రదక్షణాలు చేస్తుంటే దాని ఆకలిబాధని గ్రహించి ఆ రొట్టె ముక్క దానికే పడేసాను. అది ఎంతో ఆనందంగా తోకూపుతూ రొట్టె తిని నన్ను నాలుకతో రెండుసార్లు నాకి పరుగుతీసింది.

మళ్లీ చింకి చాపమీద చారగిలపడ్డాను. ఆలోచనలకీ ఆకలికీ మధ్య అలసిపోయిన శరీరం నాకు తెలియకుండానే అదుపు తప్పింది. దాంతో నిద్రలోకి జారుకున్నాను. మెలకువ వచ్చి చూసేసరికి తెల్లవారిపోయిందన్నట్లుగా సూర్యుడు తన కిరణాలను సాక్షిగా ప్రసరింపజేస్తున్నాడు.

మళ్లీ నాలో బెంగ...వేట...బ్రతుకుతలో పాత పేజీల్లాగున్నాయి. ఇంటి ఓనరు వచ్చి పిలిచాడు.

"ఏమయ్యా, ఇంట్లో వాళ్లు ముడుచుక్కూర్చుంటే కడుపునిండిపోతుందా? లేక కడుపు మంటారిపోతుందా? ఎలాగు ఎలక్షన్లు వచ్చాయి. ఈ నెలరోజులూ ఉపయోగించుకున్నావంటె చేతికి డబ్బు అందొస్తుంది" అన్నాడు.

నేను మౌనంగా ఆయన ముఖంవైపు చూసాను.

"అదేనయ్యా కేన్వాసింగ్...అరిస్తే రోజుకి ఇరవై పాతిక దాకా వస్తుంది. ఆటోలు టాక్సీలు ఉన్నాళ్లకి అదృష్టమే అనుకో. మరి ఏమీలేని నీలాటోడికి గొంతుందిగా. పార్టీ తరుపున పాల్గొనడమే. అలా అయితే నాతో ఇప్పుడురా...." ఓనరు మాటలు విన్నాను. కాని నాకు మనస్కరించలేదు.

"ఏంటటా..." ఓనర్ ప్రశ్న.

"...సారీ...సారీ...సర్" అన్నాను.

"అమ్మో తడితక్కువయే తాటి కమ్మలింట్లో ఉన్నావు గాని లేకపోతేనా తాజమహల్‌లో ఉండాల్సినోడివి." అంటూ చీత్కారంగా ముఖంపెట్టి వెళ్లిపోయాడు ఇంటి ఓనర్.

ఆ రోజు ఆలోచనలకీ ఆకలికీ అంతు లేకుండా పోయింది. ఓనర్ మరో రెండ్రోజులే రెంట్ కట్టడానికి టైమ్ ఉందని హెచ్చరించి వెళ్లాడు.

మూడోరోజు తెల్లవారుతుండగా ఓనర్ దగ్గరకు వెళ్లి 'ఏమండి మీరు చెప్పినట్టు చేస్తాను. కేన్వాసింగ్‌కు వస్తాను' చెప్పాను తలదించుకొని. ఆయన ముఖ కవళికల్ని వెతకటానికి నే ప్రయత్నించలేదు. ఆయన మాత్రం నా ముఖ కవళికల్ని గమనించే ఉంటాడు.

ఓగంట తర్వాత ఆయనతో వెళ్లాను. నన్ను పరిచయం చేసాడు. 'సాయంత్రం డబ్బులిస్తా, ముందు వేనెక్కు, టౌన్‌షిప్ అంతా తిరిగి కేన్వాసింగ్ చేసి రావల్లె' చెప్పాడు ఆ పార్టీ పెద్ద మనిషి.

వేన్ ఎక్కాను. ఆ వేను వెనకాతలో ఉన్న మందలో నేనూ కలిసిపోయాను. వాళ్ల గొంతులతో నా గొంతూ కలిపాను. ఒకడిని 'జై' కొట్టాను. ఒకడిని ఛీ కొట్టాను.' అచ్చం గొర్రెల్లా... ఒక వ్యక్తిని బట్టి మరొకడు అనుసరించాడు. నేనూ వాళ్లలో ఒకడ్ని అయ్యాను. ఎదు



రుగా మరో పార్టీ. వెంటనే బూతులు ప్రారంభమయ్యాయి.

ఆ పక్షం- ఈపక్షం...వాద ప్రతివాదాలకి దిగి కలియబడబోయే సరికి పోలీసులు సమయానికి ఆపువేసారు.

అప్పటికే మాలో కొందరికి స్వల్ప గాయాలు తగిలాయి. చాలా సేపటికి గాని ఆ పార్టీలు విడివడి ఎవరి దారిన వారు వెళ్లగలిగేరు.

మధ్యాహ్నం హోటల్లో మెతుకులు.... సాయంత్రానికి టిడిముక్కలు... అందరితో పాటు నేనూ ఊదెయ్యగలిగినా చీకటి పడేసరికి మందు (మద్యం) సేవించాలని నాతోటోళ్లు పట్టుబట్టినా నాకు మనస్కరించలేదు.

ఇంటికెళ్లిపోదామనే ఉద్దేశ్యంతో పార్టీ పెద్దమనిషి దగ్గరికి వెళ్లాను. ఎదురుగా దోషిలా నిలబడ్డాను.

"ఏటీ డబ్బులా ఈరోజు పాలికా, మరో రెండ్రోజుల అద్వాన్సు యాభై మొత్తం మీ ఇంటోడ్ని వచ్చి తీసుకువెళ్లాడు. ఇక నువ్వెళ్లు, రేపు మాత్రం తెల్లవారే వచ్చెయ్యాలి" చెప్పాడు డబ్బులు పంచే పార్టీ మనిషి.

అక్కడి నుండి రూమ్ చేరుకున్నాను. నే చేస్తున్నది తప్పో ఒప్పో ఆలోచించకుండా ఎన్నిరోజుల్లో ఇంటద్దె తీరుతుంది. అమ్మకి పంపించడానికి ఓ వందయినా మిగులుతుందా? అన్నదే తలపుకు వస్తోంది....మరి నా పరిస్థితి పర్లేమో,

ఎప్పుడో మధ్యాహ్నం అనగా తిన్న హోటల్ మెతుకులు అరిగిపోయాయి. నే నిద్రలోకి జారిపోయాను.

రోజూ కేన్వాసింగ్‌కు వెళుతున్నాను. రోజు రోజుకీ ఎలక్షన్లు దగ్గర పడ్డకొలది వాతావరణం ఉద్రిక్తమౌతోంది. ఇంకా నాల్రోజుల్లో ఎలక్షన్ల ప్రచారఘట్టం ముగుస్తుందనగా ఇంటి ఓనర్ బాకీ పూర్తిగా తీరిపోయింది. ఇప్పుడు కాస్తంత తృప్తిగా ఉంది. ఈ నాల్రోజులు కష్టపడితే నాలుగు డబ్బులూ నా చేతిలో ఉంటాయి. ఊరు పోయి అమ్మని చూసిరావచ్చు.

ఆరోజు పార్టీ పెద్దమనిషి కొందరిని చాటుగా పిలిచాడు. నన్నూ రమ్మన్నాడు. "చూడండిమన పార్టీ గెలిచే అవకాశం లేనట్టుగా కన్పిస్తోంది. అందుకే పీలుచూసుకుని ఆ ఇండిపెండెంట్‌ని లేపెయ్యండి. ఒక్కొక్కరికీ పందేం ఖర్చు పెట్టేసి ఇస్తాను. కాని ఇది సీక్రెట్‌గా జరిగిపోవాలి" అంటూ విషయం చెప్పాడు.

నాకయితే ఆ మాటలు వినగానే వొళ్లు జలదరించి పోయింది. ఆ ఇండిపెండెంట్ ఊర్లో లేడన్న వార్త తెలిసి ఆ మర్డరని రెండ్రోజులు వాయిదా వేసారు. నా కసహ్యంగా అంతుచిక్కకుండా ఊబిలో కూరుకుపోతున్నానేమో అనిపిస్తోంది. ఆ రాత్రి కంటిమీద కునుకు లేకుండా పోయింది. వాయిదా పడ్డ రెండ్రోజులు ఆలోచించడానికి చాలవేమో!'

ఆ మరుసటి రోజు తెల్లవారి తలుపు చప్పుడైతే తీసి చూస్తే ఓనర్‌గారి భార్య ఎదురుగా నిలుచుంది.

ఏమిటన్నట్లుగా చూసాను.

'ఓసారి మా ఇంటికి రా నీతో మాట్లాడాలి' అమె మాట మేరకు ఆమె వెనుకే నడిచాను.

అడగకముందే చెప్పింది. ఇంట్లో ఎవ్వరూ లేరని.

నాకయితే ఏమిటో అంతుచిక్కటం లేదు. కుర్చీ చూపిస్తూ కూర్చోమంది. కూర్చున్నాను. మౌనంగా కొన్ని క్షణాలు మరలిపోతున్నాయి.

"ఎలా ఉంది ఎలక్షన్ల రభస? ఆ.... ఎలా ఉంటే అలా ఉండనీ కాని అసలు విషయం చెపుతాను...నీవు కేన్వాసింగు కెళ్లిన పార్టీకి ఎకస్ పార్టీగా నిలబడినోళ్లు మా చుట్టాలే. అయితే చెప్పేదేటంటే.... సాయంత్రం పూట ఆ కేన్వాసింగు నుంచి వచ్చి దీనికి ఈ పారిటీ కేన్వాసింగ్‌కు వెళతావు. సాయంత్రం నుంచి రాత్రి ఓ పద్దాక చేస్తే చాలు. రెండువైపులా డబ్బే. అయినా నిన్నెవడు ఇంతమందిలో గుర్తుపడతాడు. అవకాశమున్నప్పుడే ఉపయోగించుకోవాలి. నీకే ఎందుకు పిలిచి చెప్తున్నానంటె చాకులాంటి కుర్రోడివని విన్నాను గనుక. సాయంత్రం అలా అయితే ఓ కుర్రాడు వస్తాడు. అడితో వెళ్లు" ఆమె దీర్ఘంగా చెప్పింది.

ఆలోచించాను. బాగానే ఉంది ఐడియా. ఆరోజు అపార్టీ ఆ కేన్వాసింగు నుండి వచ్చి ఈ పార్టీ కేన్వాసింగుకు వెళ్లాను. ఎంత ఇంకా మూడు రోజులే కదా ఎంత కష్టపడ్డా అనుకున్నాను.

ఆరోజు రాత్రి రెండో పార్టీకి కాన్వాసింగు చేసి వస్తున్నాను. వీధిలో లైట్లు వెలిగి ఆరుతున్నాయి. చీకటి చీర అరబోసుకొని ఉంది ఆకాశం.

ఇంతలో....

ఊహించని రీతిలో కొందరు నన్ను చుట్టుముట్టారు. వాళ్లని ఆ మసక వెలుగులో పోల్చుకోలేక పోయాను. "ఏరా మా పార్టీకి కేన్వాసింగు చేసి మా డబ్బు తిని ఇప్పుడేమో ఆ ఎకస్పార్టీవాడితో చేయి కలుపుతావా? అసలు ఆడ్ని లేపెయ్యమన్న రోజు నుంచి నీ ప్రవర్తనలో మార్పు ఈళ్లంతా చెప్పడమే కాదు నే చూస్తూనే ఉన్నాను" అతని మాటలు పూర్తయ్యాయోలేదో..... నా వంటిపై చైనులు... రాడ్లు...బ్లేడులు అచ్చులు తేలాయి.

"ఆగండి" అన్న పార్టీ పెద్ద మాటతో దాడి ఆగింది.



## ఎత్తైన 'గేట్‌వే'

మనదేశంలో ఎత్తైన 'గేట్‌వే' బులంద్ దర్వాజాట. ఆగ్రాకు 40 కిలో మీటర్ల దూరంలో వున్న ఫతేపూర్ సిక్రీలో యిది వుంది. ఈ గేట్‌వే ఎత్తు 53.5 మీటర్లు. ఇంతకీ దీన్ని కట్టించింది అక్బర్ అని ఎంత మందికి తెలుసునంటారు?

## క్యాన్సర్ ఔషధంతో రక్తహీనతా వ్యాధికి చికిత్స!

తీవ్రమైన 'లుకేమియా' వ్యాధి (బ్లడ్ క్యాన్సర్) చికిత్సకు 15 ఏళ్ళుగా వినియోగిస్తున్న 'హైడ్రోజా రియా' అనే ఔషధం 'సికిల్ సెల్ అనీమియా' అనే ఒక రక్తహీనతకు సంబంధించిన అనువంశిక రుగ్మతను నివారించడంలో సైతం సమర్థంగా పని చేస్తున్నట్టు అమెరికన్ శాస్త్రవేత్తలు ఇటీవల కనుగొన్నారు.

'సికిల్‌సెల్ అనీమియా' అనే జన్యు సంబంధమైన రుగ్మత వల్ల రక్తంలోని ఎర్రకణాలు బిరుసెక్కి రక్తనాళాలలో 'గుట్టలుగా' పేరుకొనిపోయి శరీరంలో ప్రాణవాయువు సరఫరాకు అంతరాయం కలుగుతుంది. దీనివల్ల వివిధ శరీర భాగాలలో కలిగే తీవ్రమైన నొప్పిని 'సికిల్‌సెల్ క్రైసిస్'గా పేర్కొంటారు.

ఇప్పటికి అందుబాటులో వున్న చికిత్సా విధానాన్ని అనుసరించి సికిల్‌సెల్ అనీమియా నుంచి ఉపశమనం కోసం నొప్పిని నివారించే పెయిన్ కిల్లర్స్, ఇంకా దెబ్బతిన్న ఎర్రకణాల స్థానంలో మళ్ళీ మామూలు వాటిని ప్రవేశ పెట్టే రక్త మార్పిడి ప్రక్రియ లాంటి వాటిని వినియోగిస్తున్నారు.

ఇలా వుండగా ఇటీవల హార్వర్డ్, జాన్స్ హాప్కిన్స్ మెడికల్ స్కూల్స్ పరిశోధకులు బ్లడ్ క్యాన్సర్ చికిత్సలో వినియోగించే 'హైడ్రోజా రియా' ఔషధాన్ని ముగ్గురు 'సికిల్‌సెల్ అనీమియా' రోగులకు ప్రయోగాత్మకంగా ఇచ్చినప్పుడు ఆ ముగ్గురు రోగులకూ పూర్తి ఉపశమనం కలిగినట్టు 'ది న్యూ ఇంగ్లండ్ జర్నల్ ఆఫ్ మెడిసన్'లో ప్రచురితమైన ఒక నివేదిక వెల్లడించింది.

"అడ్డే లేవమన్న సంగతి ఎవడికన్నా చెప్పావా? హూ... నిజం చెప్పు గర్దిం చోడు" అతనే మళ్ళీ.

పెదవి, చిట్లి నోటంట నాకు మాటలు రావటంలేదు. నరనరాల్లో నర కయాతన మొదలయ్యి ఉధృతమౌతుంది. 'లేదు చెప్పలేదు' అన్నట్లుగా తల అడ్డంగా ఊపాను. అందుకు సాక్ష్యంగా నా కన్నీళ్లు ఉరుకుతున్నాయి.

"గురూ! ఊడి మీద మన నెయ్యి సేసుకున్నాం గనుగ ఊడు లేవన్నా ఆల్లో నిజం చెప్పక మానడు" ఎవరో అన్నారు.

అంతే... పార్టీ పెద్ద నా ముక్కుపు టాలని గట్టిగా తన చెత్తో మూసేసాడు.

## ఆ తర్వాత ఏం జరిగింది?

నాకు ఊపిరి సలపటం లేదు. జుగుప్సా కరమైన ఆ క్షోభకి నరాలు చిట్లిపోయిన భావన. కాళ్ళు చేతులూ తన్నుకోకుండా అటిద్దరు ఇటిద్దరు గట్టిగా పట్టుకున్నారు. నోట్లో గుడ్డ కుక్కారు. నా కళ్లలోని కన్నీటితో కూడుకున్న అభ్యర్థన ఆ కాముందుల్ని కదలించలేక పోయింది.

అదే సమయంలో వరుసగా నాలుగు జీపులు మావైపే రావటంతో నన్ను అక్కడే వదిలేసి అందరూ పరుగులిశారు.

నాలుగు జీపులూ నా ముందర ఆగాయి. అందులోంచి మనుషులు గబ గబా దిగారు.

"మన కేన్యాసింగు కుర్రోడు...నీళ్లు పట్రండి" ఎవరో అరిచారు.

"నీళ్లెక్కడుంటాయి. నాటుసారా పేకట్టుంది" అంటూ సారా నా గొంతులో పోసారు. తరువాత నాకేం జరిగిందీ గుర్తు లేదు.

గుర్తొచ్చి చూసేసరికి నామీద పడి ఎవ్వరో ఏడుస్తున్నారు. కళ్లు మసకగా ఉన్నాయి. దానికి తోడు కనురెప్పలు ఎత్తటానికయినా శక్తి చాలటం లేదు. ఆ గొంతు...ఆ గొంతు మాత్రం చెవిని సోకింది. నాకు జన్మనిచ్చిన తల్లి. ఆ పిచ్చి తల్లి....నా వెర్రి అమ్మ...లబోదిబోమని గుండెలు బాదుకుని మరీ ఏడుస్తోంది.

కాస్సేపటికి కళ్లు నెమ్మదిగా తెరచి చూస్తే లీలగా కన్పిస్తోంది. నన్ను బండి మీద ఊరేగిస్తున్నారు. జనం తండోప తండాలుగా బారులు తీరుకొని ఉన్నారు. మైకుల్లో నా పేరే చెపుతున్నారు. అటువేపు చూసాను. నా గొంతులో సారా చుక్క లుపోసి బ్రతికించినోళ్లు నన్నేవిరగా వాడు కుంటున్నారు.

"ఒరే ఆ ముసలిదాని ముష్టిగోల ఆప మను. లేపోతే దాన్నిక్కడి నుండి ఈడ్చె య్యండిరా" మైక్ మౌత్ పీసు మూసి చెపుతున్నాడొకడు.

"మా పార్టీవోడు....మా మంచోడు... అలాటోడ్ని పొట్టన పెట్టుకున్న వోళ్లు బాగు పడరు. ఆలీ ఎలక్షన్లో ఓడిపోతారని భయంతోనే...." ఏదేదో అరుస్తున్నాడు. నాకదేదీ వినిపించడంలేదు అమ్మ ఏడుపు... ఏడుపొక్కటే వినిపిస్తోంది.

"ఒరే బాబు ఎంత రకతం పోతుంది. ఎన్ని దెబ్బలు.. ఓరినాయనో నా బిడ్డను ఊరేగించి వల్లకాడుకు తీసుకెళ్లొద్దు. ఏదన్నా ఆసుపత్రికి తీసుకెళ్ళండి. డాక్టర్ బావుని పిలవండి. నా బిడ్డను బతికిం చండి" అమ్మ ఆర్తనాదం వాళ్లకు అడ్డు పడిందేమో మరి "....రా అమ్మ రా...." అంటూ నలుగురైదుగురు పైకి అంటూనే నా తల్లిని ఈడ్చుకుపోతున్నారు. ఆ దృశ్యం చూసి కదలలేని స్థితిలో జీవచ్ఛ వంలా నేనూ ఎంత క్షోభననుభవించానో గానీ.... ఆ షాక్‌కి నే మళ్లీ స్పృహ కోల్పోయాను. ఆ తరువాత ఏం జరి గిందో నాకు తెలీదు. ●

# టి.వి. భీముడు బయట కూడా భీముడే!

టి.వి. సీరియల్ 'మహాభారత్' కుల, మత, ప్రాంతీయ భాషా భేదము లేకుండా కొన్ని లక్షల మంది అభిమా నించారు. ప్రపంచ టి.వి. రంగంలో ఏ యితర సీరియల్‌కు లభించనటు వంటి ఆదరణ మహాభారత్‌కు దక్కినది. అందులో భీముని పాత్రధారి ఎంపికకు ప్రశంసలు అందాయి. మహాభారత్ సీరియల్‌లోని భీముని చూచిన తర్వాత అనాడు భీముడు యిలాగ యుండేవాడని నమ్మకం ఏర్పడినది. అందుకు కారణం ఆ పాత్రధారి ఆకారం, సహజనటన అన వచ్చును. భీముని పాత్రధారి అయిన ప్రవీణ్‌కుమార్‌కు యిది వరకు నటన అనుభవం లేదు. అతను అగ్రగామి భారతీయ అథ్లెట్. ప్రవీణ్‌కుమార్ ఆకారం, భారీ శరీరం చూచి బి. ఆర్. చోప్రా 'స్క్రీన్ టెస్టు' కూడా లేకుండా ఎంపిక చేశారు.

ప్రవీణ్‌కుమార్ మన జాతీయ అగ్రగామి అథ్లెట్. మన దేశం తరపున అంతర్జాతీయ అథ్లెటిక్ పోటీలలో పాల్గొని స్వర్ణ, రజిత పతకాలు సాధించాడు. డిస్కస్ త్రో, హామర్ త్రోలో ప్రవీణ్‌కుమార్ రికార్డు జాతీయ రికార్డుగా 15 ఏళ్ళ వరకు యున్నది.

పంజాబ్ రాష్ట్రము తరపున జాతీయ క్రీడలలో పాల్గొన్న ప్రవీణ్‌కుమార్ బి.ఎస్.ఎఫ్ (పోలీసు)లో చాలాకాలం ఉద్యోగి.

డిస్కస్ త్రోలో 1970లో 55.48 మీటర్లు, 1980లో 56.74 మీటర్లు విసరి జాతీయ రికార్డులు నెలకొల్పాడు.

అలాగే హామర్ త్రోలో 1970 నుండి 1981 వరకు 65.76 మీటర్లు విసరి జాతీయ రికార్డు స్థాపించాడు. 1982 ఢిల్లీ ఆసియా క్రీడల తర్వాత అంతర్జాతీయ పోటీల నుండి విరమించుకున్నాడు. అథ్లెటిక్స్‌లో ముఖ్యముగా 'త్రో' లలో 15 ఏళ్ళకు పైగా జాతీయ ఛాంపియన్‌గా ప్రవీణ్‌కుమార్ యున్నారు.




ప్రవీణ్‌కుమార్ 1966లో జాతీయ పోటీలలో డిస్కస్ త్రో విసురుతున్న దృశ్యం.

క్రీడా పోటీల నుండి విరమించుకున్న ప్రవీణ్‌కుమార్ నేడు అగ్రగామి నటులతో సరి సమానముగా గుర్తింపు పొందిన నటుడుగా యున్నాడు.

-ముకరమ్

# కథల కాణాచి

(ఆంధ్రపత్రిక ఉగాది సంచిక 1957)

ముకుందాన్ని బెంగుళూరు పిచ్చాసుపత్రిలో పెట్టారన్న వార్త విన్నపుడు కాలచక్రం నిలిచి పోయినట్లనిపించింది. ఆరుగురు అన్నదమ్ముల్లో నాలుగోవాడు ముకుందం. నలభై యేళ్ల నడివయస్కుడు. చదువుకున్నవాడు. దత్తత వల్ల సంక్రమించిన రెండు మేడలు, వొక తోట, యాభై ఎకరాల భూమీ గల స్థితిపరుడు.

మామగారు జిల్లా కలెక్టరు. జ్ఞాపకం వచ్చినపుడల్లా బి.ఎల్. పరీక్షకి కడుతుంటాడు కాని, ఉద్యోగం చేసే అవసరంగాని, అభిలాషగాని అతనికి లేవు. అన్నదమ్ములందరూ మంచి పదవుల్లో వున్నారు. కుటుంబంలో ఎవరికీ పిచ్చెత్తినట్లు లేదు. మనోవ్యాకులత, చీకూ చింత లేకుండా హాయిగా జీవితం గడిచిపోతున్నపుడు, ముకందం పిచ్చాసుపత్రిలో ఎందుకు గడపవల్సి వచ్చిందో నాకర్థం కాలేదు. నాకు పిచ్చెత్తినట్లయింది. కాలచక్రం కదలనట్లనిపించింది. కాలచక్రం కవి మెళకువ, రచనా శిల్పంలో అదొక విసురు. దాని గొడవ ఎవరిక్కావాలి?

రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైందన్న వార్త తెలిసినపుడూ, మహాత్ముడు పరమ పదించాడన్న వార్త విన్నపుడు వో క్షణం పాటు కాలచక్రం నిలిచి పోయినట్లనిపించింది. మళ్లా ముకుందం పిచ్చి విషయం తెలిసినప్పుడు అట్లాంటి అనుభవం కలిగింది. వైమానికుడు సహారా ఎడారనుకుని నేలమీదకి దిగి అడుగుపెట్టగానే ఎటు చూసినా మంచే. జలపాతం వొంపు దగ్గర నిలిచిపోయింది. ఇట్లాంటివి జరిగినపుడు వూపిరి బిగబడతాం. గుండె కొట్టుకోవడంలో ఒక లయ, క్రమం వుంటాయిట. మధ్యలో ఒకసారి కొట్టుగోడం మానేసి-వొక బీట్ విడిచేసి, తరువాత మళ్లా మామూలుగా గుండె కొట్టుకోవడం అసంభవం కాదని వైద్యశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మధ్యనున్న స్థలం గుండా ప్రయాణం చెయ్యకుండానే, వొక పదార్థం వొక చోటు నుండి మరొక చోటుకి చేరుకోవడం సంభవమేనని భౌతిక శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇట్లాంటివి సంభవమైనపుడు, ముకుందానికి పిచ్చెత్తడం మాత్రం ఎందుకు సంభవం కాకూడదనుకుని సమాధానపడినా, ఆ అనుభూతి అన్వేషణకి నన్ను పురిగొల్పింది. వ్రాశేస్తే, ముకుందం వ్యక్తిత్వం విశదపడుతుందేమో నన్న ఆశతో యీ రచనకి వుపక్రమించాను.

ముకుందం అనేక మంది సామాన్య వ్యక్తులలో వొకడైతే అతన్ని గురించి నేను పట్టించుకోను. ఓ రకంగా అతను అపూర్వ వ్యక్తి. ఆధునిక యుగంలో ఆనందాన్ని సాధించగల వ్యక్తులు అరుదు. నాతోటి మానవులలో 'నా జీవితం హాయిగా, సంతోషంగా గడిచిపోతోంది' అని అన్నవారు నాకుతటస్థపడలేదు. మనలో ప్రతి వారికి ఏదో లోటు. ఆరోగ్యం వుండదు, అవకాశాలుండవు, డబ్బుండదు. ప్రేమదొరక్క చెడిపోతాం. తీరిక కోసం పని చేసి పొందిన తీరికలో యింకా పని చేస్తాం. ఏకాంతం లేదు. ఇల్లొక జైలు. ఇందులోంచి తప్పించుకుని గుంపులో కలిసిపోతాం. మరో వ్యక్తి సమక్షంలో కాని మనం సజీవులమై వున్న విషయం ఋజువు



# కాలచక్రం నిలిచింది

'బుచ్చిబాబు'

కారు. కుళ్లు, కృత్రిమ, జాడ్యం, దాస్యం, నిద్రలో కూడా విరామంలేని మనోవ్యాకులత-యీ మహా గంద్రగోళంలో పరిభ్రమిస్తూ వున్న యీ వ్యక్తులందరికీ ఎందుకు పిచ్చెత్తలేదా అన్న సంశయం వొస్తుంది. పిచ్చెత్తకుండా, మామూలుగా వున్న వారుంటే కదా. పిచ్చి మందాన్ని కొలిచి విలువ కట్టడానికి!

ఆనందమయ జీవి ముకుందం. ఆ విధంగా అతను అపూర్వమైన వ్యక్తి. మరో విశేషం వుంది. ముకుందం లాంటి వ్యక్తులు మన సంఘంలో చాలా మంది వున్నారు. ఆ రకం మనస్తత్వం గల వారికి అతను ప్రతినిధి. ఎప్పుడో ఒకప్పుడు ముకుందాన్ని, అతని తెగ వారిని కలుసుకోక తప్పదు. వారిని మీరు ప్రేమించవొచ్చు, ద్వేషించవొచ్చు. కాని వారి బారి నుండి తప్పించుకు పారిపోలేరు. ఆఫీసుల్లో, క్లబ్బుల్లో, పార్కుల్లో సినిమా హాలుల్లో, దుకాణాలలో, రైలు ప్రయాణంలో, ఎక్కడో అక్కడ అతన్ని మీరు కలుసుకునే వుంటారు. ఎవరతను? అత నొక మాటకారి. వాగు డురాయుడు. అతను మాట్లాడటం మొదలెడితే మరి ఆగడు. ఎవరూ అతన్ని ఆపలేరు. పిడుగుపైన బడినప్పుడు ఎవరు తప్పించుకో గలరు? జలపాతాన్ని అరచేతితో ఆపడం ఎంత సుళువో అతని నాలుక పరిభ్రమణాన్ని ఆపడం అంత సుళువు. ఈపాటికి మీరు గ్రహించే వుంటారు. ఆంగ్లంలో అతన్ని 'బోర్' అంటారు. ఎన్నో హాస్యపత్రికలు, ఎందరో హాస్య రచయితలు అతని వూసులు చెప్పుకుని రోజులు గడుపుకుంటున్నారు.

అతని గాథలు వేనోళ్లవింటాం. అతనొక పురాణ పురుషుడు. ముకుందం మంత్రజాలంలో చిక్కుకుని గిలగిల తన్నుకుని బైటపడిన వాళ్లల్లో నేనొకణ్ణి. అతన్ని ద్వేషించాను. విమర్శించాను. నిర్మూలం చేయాలని సంకల్పించాను. వెక్కిరించాను. హేళన చేశాను. జాలిపడ్డాను. చివరికి ప్రేమించాను. అతను లేని యీ ప్రపంచానికి నాకర్థం కనబడలేదు. అతన్ని పిచ్చాసుపత్రిలో పెట్టిన యీ ప్రపంచానికి పిచ్చి.

ఈ రకంగా ప్రపంచంపై కోపించి నేను సాధించేదేదీ లేదు. అందుచేత తమాయించుకుని ముకుందంతో నా పరిచయాన్ని ఉద్రేక రహితమైన దృక్పథంతో స్మరిస్తాను.

ముకుందాన్ని గురించి కుతూహలపడటానికి ఏవేవో చాలా కారణాలు చెప్పాను కాని అసలు విషయం వొదిలేశాను. అతనితో దూరపు బంధుత్వం వుంది. ఆవిడ తాలూకు దూరపు చుట్టం-నా తాలూకే అని చెప్పకోడంలో చిన్నతనం వుందని కాదుస్మండి-అసలు విషయం అది.

ఆదివారం ఉదయం తొమ్మిదైంది. వీధిలోకని బయలుదేరి పదిమెట్లు దిగాను. పదకొండో మెట్టు మీద ముకుందం ప్రథమంగా తటస్థపడ్డాడు. తను ఫలానా అని పరిచయం చేసుకున్నాడు. "ఓహో అల్లానా-మిమ్మల్ని గురించి వినడమే కాని ఎప్పుడూ చూడలేదు-రండి, రండి, లోపలికెడదాం" అని ఆహ్వానించాను. భుజం మీద చెయ్యేసి నన్ను నిలిపేశాడు.

"నన్ను గురించి విన్నారన్నమాట. చూసిం తర్వాత, ఇదేమిట్రా ఎందుకు చూశాను? అని అనిపించలేదు కదా! ఏముసలాడినో, ముక్కాడినో అనుకున్నారా? అమ్మాయి చెప్పిందేమోలెండి, నేనంత పెద్దవాణ్ణి-అంటే ముసలి వాణ్ణి కానండోయ్. అసలు ముసిలాళ్లు అంటూ వుండరని నా దృఢ

విశ్వాసం. ప్రతి వాడికీ తనకున్న వయస్సుకి పదిహేనేళ్ల తర్వాతేగాని వార్ధక్యం అంటూ వుండదు. నాకు వలభై అయితే, యాభై అయిదేళ్ల వాళ్లందరూ ముసిలాళ్లన్న మాట. నాకరవై అయితే, డెభై అయిదేళ వాళ్లందరూ వృద్ధులన్న మాట. అదీ 'థీరీ'. మీకు ముప్పై అవునా? మీ వుద్దేశం, నలభై అయిదు దాటిన వాళ్లంతా ముసిలాళ్లు. నేనిక్కడికెం దుకొచ్చాననా మీ ప్రశ్న-మీకు తెలీదేమో-అమ్మాయి చెప్పలేదేమో-ఇక్కడ బ్రిడ్జి మాచెస్ వున్నాయి. అందుకొచ్చాను. నేను బ్రిడ్జి ఆటగాణ్ణిలెండి. మీకొచ్చా? ఆంధ్రలో ఎక్కడ టోర్నమెంటయినా, మా వాళ్లు నన్ను పంపిస్తూంటారు. యింకెవరూ లేనట్లు. ఏం చేస్తాం. పెద్దలు మన మీద వో భారం పడేసిం తర్వాత మనం నిర్వర్తించకతప్పదు. క్రితం నెలలో బెంగుళూరులో రన్నరప్-పేపర్లో చూశారుగా. అంటే బెంగుళూరు లోకల్ పత్రికల్లో పడ్డాయిట లెండి-ఇక్కడ మన పత్రికలు యూస్‌లెస్. వీళ్ల వుద్దేశంలో బ్రిడ్జి ఒక ఆటేగాదు. నేనే ఇంగ్లండులో పుట్టి వుంటే, యీ నా ఆటకి పార్లమెంట్ మెంబరుగా చేసెయ్యరూ! మావాళ్లు వొచ్చే యేడు ఇంగ్లండు పంపుతామంటున్నారు నన్ను-భారం పడేం తర్వాత..."

## కాలచక్రం నిలిచింది

".....లోపలి కెడదాం......."

"ఒడలోనే వెడతా ననుకోండి. నాకీ ఎయిర్ ట్రావెల్ సుతరామూ యిష్టం లేదు స్మాండి. ఎందుకంటారా విల్లుప్రాసి, గాని విమానం ఎక్కడం మూర్ఖత్వం. విమానం ఎక్కి నేను క్రమంగా గమ్యస్థానం చేరుకుంటాను అని ధీమాగా చెప్పగల విమానయాత్రికుణ్ణి యీ జగత్తులో మీరు నాకు చూపగలరా స్వామీ! నిరుడు ఢిల్లీయర్స్ మాచెస్‌కి విమానంలో సీమ్లా ప్రయాణం తగిలించి. ఎల్లాగో తప్పించుకున్నా వెళ్లకుండా. ఇంతకీ మరో ఏడాదిపాటు నూకలు మనకీ భూప్రపంచం మీద వ్రాసి పెట్టాడు పరమాత్మ. ఎందుకు వెళ్లలేదని సిమ్లా-అమ్మాయి చెప్పే వుంటుం దేమోలెండి....."

"రండి-కూర్చుని, కాఫీ పుచ్చుకుని సావకాశంగా మాట్లాడుకుందాం" అని మెట్లెక్కాను. ఆయన ఆరో మెట్టు మీద నిలిచి పోయారు.

"నాకు కాఫీ అనీ, టీ అనీ పట్టింపులు లేవు. ఏదైనా పుచ్చుకుంటాను. అసలు లేకపోయినా, అయ్యో లేకపోయిందే అని ఇరవను. ఒకసారి చెరుకుపల్లి జమీందారు గారడిన్నరిచ్చారు. 'మజ్జిగమకుని కాఫీ వొద్దిం చారు."

నేను లోపలికెళ్లి ఆవిడ చెవిని ఈ వార్త పడేసి, కుర్చీలు, బల్లలు కాస్త సర్ది యివతలికొచ్చాను. ఆయన మూడో మెట్టు మీద నిలబడి మాట్లాడుతున్నాడు- మెట్ల కొంపల్ని గురించి.

"తంజావూర్లో చెట్టియార్ యింటికి వెళ్లాం...."

దీర్ఘోపన్యాసానికి తావివ్వకుండా ఎక్కడికక్కడ నిలదొక్కడం మంచిదనుకుని అడ్డు ప్రశ్నల కుపక్రమించాను.

"తంజావూరా? ఎవరెవరెళ్లారు?"

"మామగారితో-కోయంబత్తూరు నుండి కారులో వెళ్లాం. ఆ చెట్టియారింటికి నాలుగు చోట్ల మెట్లున్నాయి. మధ్య హాల్లో మామగారూ నేనూ విడిపోయాం. నేను వరండా మెట్ల మీదుగా వెళ్లాను. వాళ్లు ముందు అరుగుల మీద మెట్ల గుండా వెళ్లినట్లున్నారు. ఈ రెండు మెట్ల వరుసలూ పైన బాల్కనీలో కలిసినట్లున్నాయి-టపీమని ఆ చెట్టియారూ, నేనూ గుద్దుకున్నాం-" నవ్వడం సాగించాడు.

చెట్టియార్ ఘట్టం ముగిసినందుకు నిట్టూర్చాను. ఇంతలో లోపల్నించి ఆవిడా వొచ్చింది. చిరునవ్వుతో 'ఎప్పుడు రావడం?'

## ఇళయరాజా గురించి కొన్ని కొత్త విషయాలు

"ఇళయరాజా మేధావి," అంటారు ప్రముఖ సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వరరావు.

"హౌ టు నేమ్ ఇట్" సంగీత బృంద కేసెట్‌లో వయొలిన్‌కు "నథింగ్ బట్ విండ్"లో పిల్లనగ్రోవికి ప్రాధాన్యత ఇచ్చి స్వరాలు కూర్చిన ఇళయరాజా ఇటీవల సితార్ ప్రధానంగా ఒక జంత్ర సమ్మేళనాన్ని ధ్వని ముద్రిక చేసి, అది తనకు సంతృప్తికరంగా లేక పోయేసరికి దానిని రద్దు చేశారు.



ఈయన హేర్ కట్ చేసు కోరుగాని, జుట్టు బాగా పెరిగిపోతే అమాంతంగా గుండుచేయించుకుంటారు.

ఇంట్లో ఏ మాత్రం తీరుబడి లభించినా పియానో వాయించడం, లేకపోతే సంగీతం వినడంతోగాని కాలం గడుపుతారు. పుస్తకాలు, పత్రికలు అసలు చదవరు.

పాలు కలిపిన టీకి బదులు శొంఠి-కొత్తిమీర కలిపిన పానీయాన్నే సేవిస్తారు. ఇదివరకు రొయ్యల పులుసంటే ఇష్టం. ఇప్పుడు పూర్తిగా శాకాహారి.

ఎంత ఐశ్వర్యవంతుడైనా 1978 లో కొన్న అంబాసిడర్ కారునే ఇప్పటికీ ఉపయోగిస్తున్నారు.

రీరికార్డింగ్ సమయంలో 'నోట్సు' ఇవ్వడానికి మాత్రం హార్మోనియం ఉపయోగిస్తారు. ఆ నోట్సు ఆధారంగా ఇదివరకు ఆయన సోదరుడు గంగై అమరన్ బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ నిర్వహించేవారు. గంగై అమరన్ డైరెక్టర్ అయి ఇటీవల నెల రోజులపాటు విదేశాలలో ఉండిపోయినప్పుడు ఖాళీగా ఉన్న సంగీత దర్శకుడు ఎం.ఎస్. విశ్వనాధన్‌కు ఆ రీరికార్డింగ్ బాధ్యతలను అప్పగించారు ఇళయరాజా. ఈయన ఒకప్పుడు ఎం.ఎస్. విశ్వనాధం ఆర్కెస్ట్రాలో వయొలిన్ వాయించేవారు. (జి.వి.జి.)

అని అడిగింది.

ఇదొక అర్థం లేని ప్రశ్న.

"సామాన్లేవి?"

అంతబొత్తుగా అర్థంలేని ప్రశ్న కాదేమో. "నేనొచ్చి నాలుగురోజులైంది- సరిగా చెప్పా లంటే మూడున్నర రోజులు. క్లబ్బు గదుల్లో విడిది. టెన్నిస్ మాచెస్ అవుతున్నాయిగా. మా పినమామగారు పెద్ద టెన్నిస్ ఆటగా డులే- నాతో ఆడితే వో సెట్టుకి రెండు గేములు కూడా గెలవలేదు-అయినా మామ గార్ల ఆట మెచ్చుకోడం తప్ప యీ అల్లుళ్ల ఏం చేయగలరు? మీరు టెన్నిస్ ఆడతారా?"

"అబ్బేలేదండి"

"సాయంత్రం ఉభయులూరండి. నా ఆట కూడా చూద్దురుగాని. మొన్న విజ యనగరంలో మనవాళ్లంతా వచ్చారు. నాకు తెలుసులే. ఎందుకు నవ్వుతున్నావో. చిన్న ప్పుడు ఆటలు, పాటలూ ఏవీరావు, యీ ఆట ఎల్లాగొచ్చిందా అని. ఇల్వపురం జమీందారు తమ్ముడూ, నేను స్నేహితులం. వాళ్లు జర్మనీ నుంచి ఓ కోచ్‌ను తెప్పించారు. రాత్రుళ్లు గ్యాస్ లైట్లు పెట్టుకుని ఆడే వాళ్లం."

"కాఫీ పుచ్చుకోండి......"-కాస్త చప్ప రించేదు.

"సామాన్లు క్లబ్బులో పెట్టాను. మీరి క్కడున్నారని మొన్న తెలిసింది. సరే చూసి పోదామని. చుట్టాల్ని చూడకపోతే మా ఆవిడ వూరుకోదు. మా మరదలు నెల్లూర్లో వొక స్నేహితురాలింటి దగ్గర దిగిందట. నేనేమో గురవయ్య నాయుడు గారి చైర్‌మన్ ఎల క్షన్స్ సందర్భంలో నెల్లూరెళ్లాను. మర దలు పిల్ల అక్కడుందని నాకేం తెలుసు? ఆమెను చూడకుండా వచ్చినందుకు మా ఆవిడ వారం రోజులు నాతో మాట్లాడలేదు- అంటే నే యింట్లో ఆవిడతో వున్న, పది నిమిషాలూనూ నాకు ఏకాంతంగా యింట్లో వుండే ప్రాప్తి లేదంటే నమ్మండి. పనీ లేదు. తీరుబడీలేదన్న సామ్యంగా వుంది."

"మరదలుకు పెండ్లి సంబంధాలు చూస్తు న్నారా?" అని అడిగింది ఆవిడ.

"ఆవిడ పెళ్లి చేసుగుంటుంది? నాకు నమ్మకం లేదు. ఆయన కట్నం దమ్మిడీ యివ్వనంటాడు. ఆ గడింపంతా ఏం చేస్తాడో, కర్మ! పీనాసని కాదు. అదొక ఆదర్శంట. మరినా కెల్లా యిచ్చాడు-కటిక సొమ్ము పది వేలు. డిన్నర్‌కి నాలుగు వేలయిందిట-గవర్న ర్‌గారి అంతరంగిక కార్యదర్శి అతిధిగా విచ్చే శారులే. బాణసంచాకి వెయ్యి, వూరేగింపు విమానానికి ఐదొందలు-ఆరోజుల్లో-ఇవుడైతే, ఖర్చంతా వో యాభై వేలవును. మాకొచ్చిన పెళ్లి బహుమతులు వో ఐదారు వేలుంటాయి. కట్నాల ద్వారా సగం ఖర్చు రాబట్టాడనుకో- నువ్వొచ్చావుగా-నీకింకా అప్పటికి పెళ్లి కాలే దుగా. కట్నాలు పుచ్చుగోడం మనబోటి చదు వుకున్న వాళ్లది పొరబాటే-కాదన్ను. కాని సంఘంలో ఓ ఆచారం వున్న తరువాత పాటించక తప్పుతుందా? సరే సరోజకి ఎంత సేపూ చదువు, సంగీతం-సినిమాలు, షికార్లు, పిక్‌నిక్‌లు, పెళ్లి చేసుకోవాలన్న ఉద్దేశమే లేదు. ఏ మాట కామాటే చెప్పాలి-మా ఆవిడ ఎంత చదువుకున్నదైనా, పూర్వకాలపు మనిషే అనాలి. కాస్తంత దైవభక్తి, పూజ పునస్కారం, యాత్ర, కొలువు-కలెక్టర్‌గారు వారి హయాంలో చేసిన దుండగాలు, దురం తాలకి పరిహారార్థం పురాణ కాలక్షేపం, గీతా పారాయణం, ఆదివారం జరిపించి, పండితుల్ని సత్కరించే ఆచారం వుండబట్టే, అమ్మాయికి యిదంతా అబ్బిందనుకో. మనం తప్పించు కున్నాం. సరోజకివి గిట్టవు. నాకుమల్లే. అందుకనే లోలోపల నేనంటే యిష్టం అను కుంటా."

"నువ్వు వంట విషయం చూడు" అన్నాను ఆవిడ నుద్దేశించి.

"నా కోసం వంట చెయ్యకండి. క్లబ్బులో డిన్నరుంది. కబుర్లు చెప్పుగుందాం. మీరు వొంటకెవర్నైనా పెట్టుగోండి. లేకపోతే ఇదే చిక్కు. ఇంటికెవరేనా వస్తే వారితో మాట్లాడే అవకాశం వుండదు. ఓ సారి కేరళ సబ్ కలెక్టరు-మళయాళీ భార్యా సమే తంగా గుంటూరొచ్చాడు. అత్తగారు వొంట కనీ, అమ్మాయి కాఫీ కని లోపలికెళ్లారు, పనిమనిషి పేరమ్మను వొప్పజెప్పి. ఆవిడకి కాలక్షేపం ఎల్లా జరుగుతుంది? పేరమ్మ ఏం మాట్లాడుతుంది? బుచ్చమ్మలా గుడ్లప్పగించి అల్లా చూస్తూ నిలబడింది. పేరమ్మ పేషన్‌గా వుంటుందిలే. ఇదుగో ఈ సినిమాలొచ్చిం తర్వాత అది మరీ సినిమా స్టార్‌లా తయా రైంది. మా ఆవిడా, సరోజ ఇచ్చిన జాకెట్లే వుంటాయి వో డజను. వీళ్లకి సైజు కుదరక దానికి బహూకరిస్తుంటారులే. దాన్ని చూసి సరోజ అనుకుంది కాబోలు- ఇంగ్లీషులో సంభా షణ సాగించింది ఆవిడ. ఇదేమో నవ్విందట. మళ్లా ఆవిడ ఇంగ్లీషులో ఏదో అడిగిందట. పేరమ్మ లోపలికెళ్లి చీపురు తీసుకొచ్చిందట వూడుద్దామనుకుని. ఆవిడ కోపంతో చరచరా నడుచుకుంటూ బైటకెళ్లి, మామగారి డ్రైవర్ని పిలిపించి, కారులో ట్రావెలర్ బంగళాకెళ్లిపో వడం- మామగారు పేరమ్మని మానిపిస్తానని బెదిరించడం, అది లబోదిబోమని ఏడవడం- నేవెళ్ళి సర్దుబాటుచేసి, వో వంట లక్కని కుదర్చడం, వొచ్చిన అతిథుల్ని ఎల్లా వినోద పరచాలో తెలియచెప్పడం- వారి కుటుంబ చరిత్రలో వొక అపూర్వ ఘటం......"

"కాసేపు నే అల్లా వెళ్లొస్తాను. మీరు



## రోహిణి 'వ్యాంప్'!?

గాంధీ చిత్రంలో కస్తూరిబా గాను, టి. వి. సీరియల్ "కుఛ్ ఖోయా కుఛ్ పాయా"లో వైహినిగాను నటించిన రోహిణీ హట్టంగడి వ్యాంప్ పాత్రలు వేస్తుందంటే నమ్మశక్యమేనా? ఫోటో చూస్తుంటే నమ్మాలనే అనిపిస్తుంది కదూ! మరి మామూలు పాత్రలు దొరక్కపోతే ఎవరు మటుకు ఏం చేస్తారు?

# కాలచక్రం నిలిచింది

పత్రిక చూస్తూ వుండండి" అన్నాను. ప్రశ్నార్థకంగా చూశాడు ముకుందం.

"సినిమాకా?"

ఎట్లా కనుక్కున్నాడో చిత్రం! అసలు నిజంగా సినిమాకనే బైలుదేరాను. కాస్తంత అబద్ధం ఆడాను.

"డాక్టర్ మాధవయ్యగారింట్లోంచి టెలిఫోన్ చేసి, రాత్రికి ఏం ఆటాడుతున్నారో కనుక్కున్నొద్దామని బెలుదేరాను" అన్నాను.

"అయినా, అమ్మాయి లేకుండా మీరొక్కరూ సినిమాకెళ్లడం భావ్యమా చెప్పండి? మా కళ్యాణి వూరుకోదు. నేను వాళ్లింట్లో వుంటే ఎక్కడికెళ్లినా ఇద్దరం కలిసెళ్లాల్సిందే....."

"ఆమెను కూడా ఇప్పుడు మీతో తీసుకురాలేదేం?" అన్నాను.

"ఆవిడకి ఆటలు చూడ్డం అంటే విసుగు. లెక్చర్లు, క్లబ్బులు, పార్టీలు ఇవేవీ గిట్టవు. నాకివి లేకపోతే గడవదు. మళ్లా సరోజ అల్లాకాదు...."

ఆయనింకా మాట్లాడుతూనే వున్నాడు. నేను బైటికి నడిచాను. వెడుతూ మా పనివాడు ముసలయ్యని అయ్యగారికి ఏం కావాలో కనుక్కుంటూ వుండమని చెప్పి వెళ్లాను. ఓ గంటలో తిరిగొచ్చాను. ఆయన ముసలయ్యతో మాట్లాడుతున్నాడు. ముసలయ్య వింటూన్నట్లు లేదు. గోడకి జేర్లబడి కునుకుపాటు పడుతున్నాడు.

"పోరంబోకు పొలం వో ఎకరం నాకిప్పిచెప్పు. రెండేళ్లల్లో బంగారం పండిస్తాను. మామగారిదో రెండెకరం బీడుంది. జిల్లా వ్యవసాయాధికారి నా స్నేహితుడులే. అతని సలహా మీద కావల్సిన ఎరువు అదీ వేశాను. ఇవాళ పదివేలిచ్చి కళ్లు మూసికొంటామని ఎగబడుతున్నారు. నువ్వు రాత్రి పొలం కాదుంటావా?"

"మాటాడవేం ముసలయ్యా నిన్నే అయ్యాగారేవో అడుగుతున్నారు."

"అంతే నెగండి" అని దూరంగా వెళ్లి చుట్టముట్టించే తతంగం జరుపుతున్నాడు.

"ముసలయ్య మా మామగారి పొలం కాపు. కాస్త సాయ్యంగా వుంటాడు. ఇపుడు పొలం పనులేవీ లేవని, ఇక్కడికి పంపించారు" అన్నాను.

"పొలంలో పాముని చూసి జడుసుకునే ఘటంలా వున్నాడు. పాముని పట్టడం నేరిస్తేగాని, ఎవరికీ పొలంలో పనిచేసే అధికారం లేదంటాను. ఓ సారి రావులపాడులో సాయంత్రం చేలల్లోంచి వొస్తున్నాం. కాలికేదో మెత్తగా తగిలింది. నేను గమనించలా.

రాత్రి వెన్నెట్లో భోజనాలకి కూర్చున్నాం. రెంయ్యిమని నా విస్తరి ముందుగా వొచ్చి పడగెత్తింది. అందరూ అదిరిపోయ్యారు.

మీరెవ్వరూ భయపడకండి. నా కోసం వచ్చింది అన్నాను. కిమిన్నాస్తి. కరణంగారి భుజంపైన సిల్కు కండువా తీసి చటుక్కున గివాటెట్టా. దాన్ని కరిచేసి అందులో ఇరుక్కుపోయి, ఉంగ చుట్టుకు పోయింది. మరోసారి మైలవరం రాజుగారింట్లో...."

"విను ముసలయ్యా!" అని వో కేకేసి స్నానానికెళ్లాను. వొచ్చాను. ఆయన ముసలయ్యతో ఏదో చెప్పగుంటూ పోతున్నాడు. పులివేట విషయం.

"చెప్పండి, చెప్పండి" అంటూ కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకొంటున్నాను.

నాకెన్నాళ్లనుంచో పులిని దగ్గరగా వో ఫోటో తియ్యాలని మనసు. అయ్యాపురం జమీందారు బావగారొకాయన వొచ్చాడు. నలుగురైదుగురం అడవిలోకి ప్రయాణం కట్టాం. మేకని ఎరగా కట్టి చెట్లెక్కాం.

రెండు గంటల వరకూ నిశ్శబ్దం. తరువాత కోతులు కిచ కిచ లాడాయి...... దూరంగా గర్జింపు వినబడింజీ. నే కూర్చున్న చోటునుండి మేక కనబడటం లేదు. ఎప్పుడొచ్చిందో ఎప్పుడెల్లిందో మేక అరుపు నిలిచిపోయింది. మరో గంటకి దిగి మెల్లిగా నడచిపొయ్యాం. ఒక మైలు వెళ్లిం తర్వాత మేక కళేబరంలో తినగా మిగిలిన భాగాలు ఆకులతో కప్పబడి వున్నాయి. దాని చుట్టూ వొక వల అల్లి, అల్లిక తాళ్లని కెమారాక్లిక్‌కి ముడేసి, కెమెరా దూరంగా పొదలో వుంచాం. పులి వొస్తుంది. వల మీద కాలు పెడుతుంది. క్లిక్ మంటుంది. ఫోటో పడిపోతుంది. అదీ ఏర్పాటు. ఇంతలో ఏదో చప్పుడైంది. నాతో వున్న వాళ్లు చెట్టెక్కేశారు. వెనక్కి తిరిగితిని కదా, అర ఫర్లాంగు దూరంలో నాకేసి వొస్తోంది పెద్దపులి....."

"భోజనానికి లేవండి....."

అంది మా ఆవిడ. ముకుందం కథలో లీనమైపోయి, వినిపించుకున్నట్లు లేదు.

"అప్పుడేం చేశానని మీ వూహ? కదలకుండా, వూపిరి బిగబెట్టి, పులి కళ్లలోకి చూస్తూ స్తంభించి పోయాను. అది కూడా అల్లానే, నిర్ఘాంతపడి నా మొహంలోకి చూస్తూ నిలబడిపోయింది. చూపు తప్పించకుండా, మెల్లగా వొక్కొక్క అడుగే వెనక్కి వేసుగుంటూ, వో ఫర్లాంగు వొచ్చేశాను. అది విసుగెత్తి పారిపోయింది....."

"భోజనానికి......"

"ఆ నాడు నేను కదిలివుంటే పులికి భోజనం దొరికి వుండును. నువ్వీ నాడు నాకు భోజనం పెట్టే అవకాశమే లేకపోను...."

ఓ హో! హో! హో! అంటూ ముకుందం దీర్ఘంగా నవ్వి, ఆ కూర్చీలోంచి లేచి పడక్కుర్చీలో కాళ్లు జాచి విశాలంగా పడుకున్నాడు.

పన్నెండున్నర దాటింది. నాకాకలిగా వుంది. పుట్టంతా మునిగిపోయినట్లు ఆయన్ని వో ప్రశ్న అడిగాను.

"ఏమండీ- వేటకి వెళ్లినపుడు, తుపాకులూ అవీ తీసుకెడతారు గదా. మరి పెద్దపులి మీదకి వొస్తున్నప్పుడు తుపాకీ పేల్చలేకపోయారా?"

ముకుందం గారికి చాలా కోపం వచ్చింది. ఆయన దగ్గర తుపాకీ వుండి వుంటే ఆ క్షణంలో నన్ను పేల్చేసి వుండును ఆ ప్రశ్న అడిగినందుకు.



"ఇంకా నయం- మీకు ప్రతి విషయం, తుపాకీ విషయం బొత్తుగా తెలీదనుకుంటా. తుపాకీ సరైన పొజిషన్‌లోకి తీసుకురావడానికి కొంత చేతుల కదలిక అవసరం. ఏ మాత్రం కదలిక జరిగినా, వెంటనే వచ్చి మీదపడి చంపేస్తుంది పులి. అంటేతే దాని కళ్లల్లోకి చూస్తే అది భయపడి పారిపోతుంది. అట్లాంటి సందర్భాలలో మన తెలివి పనిచెయ్యదు. శరీరం బుద్ధికి తెలియకుండా, తన జాగ్రత్త అది పడుతుంది. ఓ సారి అరవిందుని ఆశ్రమానికెళ్లాం- కళేబర స్వామితో.

రాత్రి విడిదిలో మంచాలున్నాయి పక్కవేసి సిద్ధంగా. స్వామీజీ పొట్టి కింద సంచీ దిండుగా పెట్టుగుని పరున్నాడు. మంచం మీదికి రండి అన్నాను. వొద్దు అందరం కిందే పడుకుందాం అన్నాడు. ఆయన మాట తీసెయ్యలేక, అల్లాగే పడుకున్నాం. ప్రొద్దున్నే అక్కడ వాళ్లొచ్చి మంచం సర్దారు. జానెడు పొడుగు జెర్రి, దిండు క్రింద విశ్రమిస్తోంది. అంటే ఏం జరిగిందన్న మాట. మంచం మీద అపాయం వుందిస్మా అని ఆయన శరీరం పసికట్టిందన్నమాట- పంచేంద్రియాలు కాక- ఆరోశక్తి అన్నమాట. అరవిందుడు వ్రాశాడు కూడాను- ఒక యోగి హిమాలయ పర్వతాలలో తపస్సుచేసి ఆత్మశుద్ధి సాధించి నందువల్ల లోకానికేం వుపయోగం అని వొక దొరగారు ప్రశ్నించారట. అప్పుడు ఆయన అన్నాడుట......"

"చాలా పొద్దోయింది. మీ కోసం క్లబ్బులో అందరూ కనిపెట్టుకుంటారేమో" అన్నాను.

"నా కోసం ఎవ్వరూ కనిపెట్టుకోరు. ఓ ఐదు నిమిషాలు చూస్తారు- హాయిగా తింటారు, ఎవరాకలి వారిది......"

"మరి మీ కాకలిగా లేదా?"

"ఆ ప్రశ్నకి సమాధానం మా కల్యాణే చెప్పాలి. ఓ సారి ఆమే నేను, వాళ్ల చుట్టాలింటికి వెళ్లికెళ్లాం......"

నాకాకలేస్తోందండి- మీరూ లేవండి- భోజనాల దగ్గర మాట్లాడుకుందాం అన్నాను. ముకుందం మాట్లాడుతూనే వున్నాడు. నేను భోజనానికి లేచి ఆయన్ని కుర్చీలోంచి లేవదీయబోయ్యాను.

"కొందరిలా నాకు వేళకు భోజనం అనే పట్టింపు లేదు. అప్పుడప్పుడూ భోజనం మానెయ్యడం మామూలే- మీరు కూర్చుని కానివ్వండి. ఏం? ఎంతవరకూ చెప్పాను! ఆ- కల్యాణీ నేనూ వెళ్లాం. వొడ్డించారు...."

"వొడ్డించాను. లేవండి- " అన్నది ఆవిడ.

"మీరిద్దరూ కూర్చుని తింటుంటే చూడాలని వుంది. కూర్చోండి."

వొంటిగంటన్నరైంది. మేం లేచాం.



## జూహీ ప్రతిజ్ఞ

పెద్ద చిత్రాల్లో చిన్నపాత్రలు ససేమిరా చేయనంటోంది జూహీచావ్లా. చేయనని చెప్పటం కాదు ప్రతినబూనింది. 'చాందనీ' చిత్రంలో నిర్మాత తనకు డబ్బు చెల్లించలేదుట అదేనేమో జూహీ కోపానికి, ప్రతిజ్ఞకు కారణమని పరిశ్రమలోని వాళ్లు చెప్తున్నారు. ఇలా మంకు పట్టుపడితే ముందు ముందు ఛాన్సులు రావేమో!

తాంబూలం వేసుగున్నా, ఆయన కాస్త మజ్జిగ మాత్రం పుచ్చుగున్నాడు. మైసూరులో తాంబూలాన్ని గురించి చెప్పడం మొదలెట్టాడు. నాకు నిద్రోస్తాంది. ఆదివారంలో గంట నిద్రించడం నాకలవాటు. ఆవులించాను. కాసేపు విశ్రమిస్తారా- అని స్వగతంగా అడిగి, గదిలో పక్క సర్దాను. మైసూరు దసరాపుత్సవాలని వర్ణిస్తున్నాడు.

"ఇల్లా వుపవాసాలుంటే మీరు నీరసించి పోరు? ఆకలితో కబుర్లేం చెప్పగలరు?" అని తెగించి అడిగేశాను.

"ఆ ప్రశ్నే మా కల్యాణీ అడుగుతుంది. చాలా మందికి నిద్ర, తిండి అవసరం. నాకవంత ముఖ్యం కావు. ఓ సారి రాజారావుగారింట్లో పేకాటకి కూర్చున్నాం....."

ఇంతలో నీళ్లల్లో మునిగిపోతున్న వాడికి తాడు దొరికినట్లు, పక్కింటి కుటుంబరావు, పత్రిక తీసుకెడదామని వచ్చాడు. వొకర్ని వొకరికి పరిచయం చేశాను. కుటుంబరావు స్కూలు మేష్టరు. ముకుందంగారు వెంటనే ఆయన చదువు, మేష్టర్లు, పరీక్ష అనుభవాలు చెప్పడం లంకించుకున్నాడు. అమాయకుడు కుటుంబరావు ఆ యింద్రజాలంలో చిక్కుకున్నాడు. నే వెళ్లి పెన్నువాల్చాను.

లేచేటప్పటికి మూడుకావస్తోంది. కుటుంబరావు లేడు. మా ఆవిడుంది. సరోజ చదువు విషయం చెబుతున్నాడు.

"స్త్రీల ముందు అనకూడదుగాని, పురుషుణ్ణి ఘనకార్యాలకి ప్రేరేపించేది స్త్రీలే- ఆ స్త్రీలే ఆ ఘనకార్యం కాస్తా సాధించనీకుండా ఆటంక పరుస్తారు. లాకాలేజీలో సుశీల అని వుండేది. ఆమె మెప్పుకోసం మలయప్పన్ అనే మళయాళీ సోదరుడు బాగా చదివి యూనివర్శిటీ ఫస్టుగా ప్యాసయ్యాడు. ఎమ్. ఎల్. డిగ్రీ తెచ్చుకున్నాడు. వారిద్దరూ వివాహం చేసుకున్నారు. అంతే- అతన్ని కోర్టు కెళ్లనివ్వదు- ఇరవైనాలుగ్గంటలూ తనని చూస్తూ, మెచ్చుకుంటూ, వినోదించమంటుంది. ఏమైందని మీ ఊహ- ఆరునెలల్లో ఆమెని విడిచి పెట్టాడు....."

నవ్వడం సాగించాడు. ఆవిడను కాఫీ విషయం చూడమని లోపలికి పంపించాను.

"మీరు మొహం కడుక్కోండి. కాఫీ తాగి అల్లా బైలుదేరుదాం. మీ క్లబ్బులో ఆటలకి టైమవుతుందేమో" అన్నాను.

"నేను మాచెస్‌లో ఆడటం అనేది దైవాధీనం. వాళ్లకీ తెలుసు. అందుచేత నాకు ప్రతిగా మరో ఆటగాడు లేకుండా నన్ను పంపించరు. ఓ సారిల్లాగే ఊటీ వెళ్లాం....."

నా గుండె రాయిపడింది. ఈ లెక్కని, బెటకెళ్లడానిక్కాని, మరో పనిచూసుకోడానిక్కాని వీల్లేదు. ఏం చెయ్యను?

వారి నా విరంగా భంగ పర్చడం భావ్యం

# కాలచక్రం నిలిచింది

కాదు. పదండి నేనూ వొస్తాను. మీ ఆట చూళ్లేదు" అన్నాను.

"నా ఆట ఇప్పుడేముంది, యీపూట చూడకపోవటమే మంచిది. నే ఆడకపోవటం నాకూ మంచిదే. అదుగో ఆ రాజమండ్రిలో చెయ్యి, కాలు ఒకేసారి బెణికాయి. డాక్టర్ నెల వరకు కదల్చకపోవడం మంచిదన్నాడు- నాకు వీలు పడుతుంతా? వీళ్లు నువ్వొస్తే కాని వల్లకాదని చంపుకు తింటారు. కాళ్లూ, చేతులూ, మెదణ్ణే పని చెయ్యనియ్యవు. ఆఖ రికి బ్రిడ్జి కూడా ఇవాళ ఆడలేను."

"పోనీ మనం వెళ్లి చూస్తూ వాళ్లకి హుషారిద్దాం" లాభం లేకపోయింది. పరమ శివన్ అనే తమిళ సోదరుడి వృత్తాంతం చెబుతున్నాడు. నేనిప్పుడంతా ఏకరువు పెడ తానని భయపడకండి- అది నా తరం కాదు. ఆ పూట ఆయన మా యింట్లో వుండగా మాట్లాడినవన్నీ పూరాగారాయాలంటే సవా లక్ష గ్రంథ మవుతుంది. నేనే కాదు- ఎవ్వరికి అది సాధ్యం కాదు. ఆయన వొక ఏడాదిలో మాట్లాడిన వాటెని వ్రాయా లంటే, వో డజను మంది చిత్రగుప్తులు, తమ అసిస్టెంట్లతో, ఐదారు సంవత్సరాలు కృషి చేస్తే సాధ్యపడుతుందేమో- అదేనా షార్టుహాం డులో వ్రాయడం వారికి వొచ్చుంటే మాట. ముకుందం సన్నగా పొట్టిగా వుంటాడు. గిర జాల జుట్టు, చామనచాయ, గడ్డంకింద మచ్చ, కళైన మొహం. కంఠం సన్నంగా వుంటుంది. స్ఫుటంగా ప్రతి అక్షరం సాగ దీస్తూ నోరారా ఉచ్ఛ రిస్తాడు. అతనొక ధ్వని ప్రచారక యంత్రం. ఒక భాషా సంస్థ. కాలం నిల్చిపోనట్లు, గోళాల పరిభ్రమణం ఆగి పోనట్లు, ఆయనలో ఉద్భవమయ్యే ధ్వని పరం పరలకి విరామం లేదు. అడ్డు ప్రశ్నలు, ఊ గొట్టడాలు, ఆయన కక్కరలేదు. వింటు న్నట్లు తల వంకించడంతో నిమిత్తం లేదు. మనం చూస్తున్నప్పుడే సూర్యుడు కాంతికిర ణాలను ప్రచారం చేస్తున్నాడా? మనం కోరిన ప్పుడే నిండు చంద్రుడు దర్శన మిస్తున్నాడా? ప్రియురాలొచ్చే వరకూ ఆగమంటే పువ్వు పరిమళించడం మానుకుంటుందా? నిద్ర పోయిన కాసేపు, మౌనంగా వుంటాడనుకుం టున్నారా? అది భ్రమ. మేఘం వెనకాల సూర్యుడు వెలుగుతూ వుంటాడు. మనకి కనబడడు. శిఖరం వెనుక చందమామ మనకి కనబడకపోవచ్చు. అంత మాత్రం చేత లేడం టామా? ఎడారిలో వాడిన పువ్వు, సంద్రాల లోతుల్లో ధగ ధగ మెరిసే వజ్రం- మనకేం తెలుసు. మనం ఎంత అల్పులం? ఎక్స్‌రే యంత్రాన్ని ప్రయోగించి నిద్రిస్తుండగా ఆయన మెదడును పరికించండి. ఒక మహా కావ్యం అల్లుతూ వుంటుంది ఆ మెదడు. మెద డులో ధ్వని కదలికని వ్రాసే పరికరాన్ని యే శాస్త్రజ్ఞుడో ముందు ముందు తయారు చేసి తీరుతాడు. అప్పుడింక ఆధునిక యుగంలో మహా కావ్యాల లోపం వుండదు.

ఆరు కావస్తోంది. ముకుందం గారు స్వీయగాథలో పడ్డారు. తనని భార్య కల్యాణి ఏ విధంగా ప్రేమించి పెళ్లి చేసుకున్నదీ- పారబాటు- ఏ విధంగా పెళ్లి చేసుకున్న తర్వాత, ప్రేమించడం మొదలె ట్టిందీ, అదే శాశ్వతమైన ప్రేమ- ప్రేమంటే ఏమిటి? ఒక అరగంట లెక్చరిచ్చాడు. సొమ్మ సిల్లి పొయ్యాను. ప్రేమలో వైరాగ్యానికి తావుందా? పవిత్రమైన ప్రేమ యీ యంత్ర యుగంలో సాధ్యామా? మార్క్స్ సిద్ధాం తాలకి ప్రేమకి వున్న సంబంధం ఏమిటి? ప్లేటో ఏమన్నాడు.వేమన్న పద్యం చూడండి. వాల్మీకి రామాయణం తీసుకోండి. పోతన భాగవతం తియ్యండి. అమెరికా విడాకుల తఫ సీళ్లు- మాస్కోలో విడాకుల సంఖ్య- సంతాన నిరోధం ఆవశ్యకత- పెరిగిపోతున్న జనాభా- మన దేశంలో మూఢాచారాలు.

"నాకు పిల్లలు లేరు. వుండరు కూడా. వుంటే, నా జీవితంలో వున్న ఆనందం వారికి సాధ్యం కాదు. ఆస్తి పంచుకుం టారు. ప్రేమ పంచుకుంటారు. సంతోషం పంచుకుంటారు. వారికి సంతానం కలుగు తుందిగా! నేను తాతనవుతాను. కల్యాణి అమ్మమ్మవుతుంది. వారి సంతానం బలహీ నులవుతారు. ఆస్తి సన్నగిల్లి పోతుంది. వారి సంతానానికి తినేటందుకు తిండే వుండదు. సంఘ పతనం..."

ఆఘున సంతానం కూడా ఆయనలాగే తయారవుతే, యింకేమన్నావుంది? వూహిం చలేకపొయ్యాను.

"నా సంతానం మూగవాళ్లవుతారు- అమ్మ పోలికే అయితే- ఎందుకంటారా? కల్యాణి అంతనాలా మాటకారి కాదు. ఆవిడ కంఠం మాధుర్యం. వొక అపూర్వ అను భవం..."

ఏడు కావస్తొంది. ఏమిటి చెయ్యడం? ఆవిడ కాస్తంత టీ, దోసెలు తెచ్చింది. ఆయన దోసెలు తిన్నాడు. నా పళ్లెంలోనివి కూడా దగ్గరికి లాక్కుని కబుర్లు చెబుతూ తినేశాడు. టీ త్రాగాం. ఇంతలో దైవం కటా క్షించాడు. ఫైరింజన్ మా గుమ్మం ముందు నించీ చప్పుడు చేస్తూ వెళ్లింది. ఎక్కడో ఇళ్లు తగలడుతున్నాయంటూ ముసలయ్య వచ్చాడు. "రండి చూసొద్దాం" అంటూ ఆయన్ని లేవదీసి మెట్లకిందికి నడిపిం చాను. వెనక అహోబలరావుగారిల్లు తగులబ డిన చరిత్ర చెబుతున్నాడు. నడుచుకుంటూ వెళ్లాం. క్లబ్బుకు కొంచెం దగ్గరలోనే గుడి సెలు తగలడుతున్నాయి. క్లబ్బులో వాళ్లు కూడా చూడ్డానికొచ్చారు. ఆ ఎరుగున్న వాళ్ల గుంపులో కలిసిపొయ్యాడు. మళ్లా రాత్రి కనిపిస్తా అన్నాడు. తప్పకుండా అన్నాను. ఆ క్లబ్బు మిత్రుల్ని పట్టుకున్నాడు. అంతా ఆ ప్రవాహంలో కొట్టుకుపొయ్యారు. నే యింటి కొచ్చేశాను.

ముకుందాన్ని మళ్లా మూడేళ్ల తర్వాత కలుసుకున్నాను. ఆ రోజుల్లో పెద్ద గాలీ వానా వొచ్చి, రైళ్లు నిలిచిపోవడం జరిగింది. రైళ్లు తిన్నగా లేవని మా ఆవిడ పుట్టింట్లో వుండిపోయింది. కారియర్ భోజనం తప్పింది కాదు.

సాయంత్రం ఆరైంది. రైళ్ల విషయం



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

-సంపాదకుడు.

కనుక్కుందామని బయలు దేరుతుండగా మెట్ల మధ్యలో ముకుందం ఢీ కొన్నాడు. ఏడాది క్రితం ముకుందం భార్య టైఫాయిడ్ జ్వరం వచ్చి చనిపోయింది. సానుభూతి జాబు వ్రాశాను. కలునుగోడం యిదే మొదటి సారి, పరామర్శకి వాక్యాలు కూరుస్తుండగా, ముకుందం వాటిని వుచ్చరించే అవకాశం యివ్వకుండా తానే సాగించాడు.

"ఈ రోజుల్లో రైళ్ల మరీ అధ్వాన్నమయ్యాయనుకో. ఆలస్యంగా రావడానికి, నిలిచి పోడానికి యీ తుఫాను వోసాకు. పుత్తప్పుడు ప్రతి రైలు వో రోజు ఆలస్యం. తుఫానొస్తే వో వారం. అంతే తేడా. గుంటూరు నుంచి బండి దిగాను. ఎక్స్‌ప్రెస్ పదిగంటలు లేటు. సరే ఆ ప్లాట్ ఫారంలో యిరుక్కుని యే జబ్బో తగిలించుకోడం ఎందుకని, మిమ్మల్ని చూసి పోదామని వొచ్చాను. అర్జంటుగా ఢిల్లీ వెల్లాలి."

"మా వూళ్లో రైతులంతా- భూముల్ని గురించి వో కొత్త శాసనం వొస్తోందిగా- దానిలో తికమకలు చాలా వున్నాయిలే. వారికున్న అభ్యంతరాలని వో పిటిషన్ ద్వారా, ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వానికి విన్నవించమని, ఆ పిటిషన్ వ్రాయించి, ఆ నాయకత్వం నామీద పడేశారు. ఇట్లాంటివి చాలా చేశానులే. వెనక గుర్నాధం గారి ఇంటి తగాదా- ఢిల్లీకి తీసుకెళ్లాను. ఇళ్లశాఖ వారు నే ఎత్తిన లాపాయింట్లకి ఖిన్నులై, సుప్రీమ్ ప్రథమ స్థానం వహించినందుకు ఆశ్చర్యపడ్డారు. మన కెక్కడ తిరుతుంది. అయినా, కల్యాణి పోయిం తర్వాత, నా పాత వ్యాపకాలన్నీ మానుకున్నాను. జీవితం పట్ల నా దృష్టే మారిపోయింది. నేనిప్పుడేవీ పట్టించుకోడం లేదు. ఇప్పుడు గూడా ఆ రైతులంతా చంపుకుతింటే, సరే, పరోపకారార్థం యీ శరీరం అన్న సామ్యంగా, ఊ అన్నాను. ఇంక వో విషయం నెత్తిన వేసుకున్న తర్వాత, దానంతు తేల్చేవరకూ వూరుకోనని నీకు తెలుసుగా!"

"పాపం కల్యాణి..."

"ఏం పాపం. పుట్టిం తర్వాత చావు తప్పదు కదా. అన్నిమంచి లక్షణాలుండి, వొక ఆదర్శప్రాయమైన వ్యక్తిగా, నలుగురికీ కన్నెర్రగా వున్న కల్యాణి చాలాకాలం బ్రతకదని లోలోపల అనిపించేదిస్మా! అంత మంచిగా వుండగూడదనుకో- యీ ప్రపంచంలో దేవుళ్లు వోర్చలేరుట. గ్రీకు పురాణ గాధలు...."

"రండి లోపలికెడదాం...."

"ఎవ్వళ్లుం టైఫాయిడ్ అనుకోలేదు. అరడజనుమంది స్పెషలిస్టుల వూమకున్న రోగి ఆయువు మూడినట్లే. ఇరవై రోజులయ్యాక వలానా అని నిర్ణయించారు. కాంప్లికేషన్ వుందేమో చూడండన్నా- నా మాట పెడచెవిని పెట్టారు. ఆమెకు తెలుసు బ్రతకనవి. నన్ను దగ్గరకు రమ్మంది. మంచం బడ్డీ మీద కూర్చున్నాను. నా రెండు చేతులూ పట్టుకుంది. ఆమె కళ్లు చాలా పెద్దవిలే. నీరసించిందేమో- మరీ పెద్దవిగా కనిపించాయి. కన్నీరుతో 'మీరు సరోజను చేసుకోండి' అంది. నాకు ఏడుపులో నవ్వొచ్చింది.

చనిపొయ్యేవారికి బ్రతుకున్నవారంటే అంత తాపత్రయం వుంటుంది కాబోలు."

"రండి..."

లోపలికెందుకు- బయిటికెళ్లి టీ తాగొద్దాం. యీ ఆడాళ్లున్నారే- భలే అసాధ్యులబ్బాయ్. వాళ్లకి కొన్ని విషయాల్లో దూర దృష్టి వుంది. ఏకాంతంగా మొగాళ్లు పొయ్యే పోకిళ్లు, వేసే వేషాలు, యిట్టే పసిగట్టేస్తారు. వాళ్లింటి పక్కన మోహనరావని వుండేవాడు. గౌరవమైన కుటుంబీకుడు. వాళ్లింట్లో పనిచేసే పిల్ల వోసారి కల్యాణితో అన్నదిట. ఏదో మాటల సందర్భంలో "అమ్మగోరు చాలా మంచివారండి" అమ్మగోరంటే మోహనరావు సతీమణి అన్నమాట. ఆ రాత్రి కల్యాణి నాతో అంది-ఏమందో తెలునా? "ఆ పని పిల్లకి ఆరోమాసం-తండ్రి మోహనరావు ఆ పని పిల్లని తీసుకెళ్లి పొయ్యాడు. ఎందుకు చెప్పొచ్చానంటే కల్యాణి విషయం యిట్టే గ్రహించింది."

"ఇటు రండి-రోడ్డు నడుంగా లారీలు అవీను" అని ఆయన్ని పక్కగా లాగాను. హోటలికెళ్లాం"

సరోజ పెళ్లంటే ఇష్టంలేనట్లు, మొగాడంటే గిట్టనట్లు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తుందా - అదంతా నటనేననుకో. నన్ను తెగ వేళాకోళం చేసేదిలే. సరోజ వాళ్ల అక్కంత చక్కంది కాదు. కాని అంతకంటే గడసరి - నేనో ఉత్త అమాయకుణ్ణి. మా ఆవిడన్నట్లు సరోజని గురించి నాకే ఇతర అభిప్రాయం అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు. కల్యాణిని తృప్తిపరచటం కోసం సరేలే అని వాగ్దానపూర్వకంగా అన్నాను. కాని నాకు నిజంగా ఆమెను చేసుకోవాలని లేదు. ఎందుకంటావా, మనది బిజీ లైఫ్. పెండ్లికో, ప్రేమకో టైమ్ లేదు. ఈ ఆడాళ్లున్నారే - మన జీవితం అంతా వారి సమక్షాన, వారి ఆరాధనలో గడపమంటారు. నాకది సాధ్యం కాదు. సరోజ తల్లికూడా ఆమెను చేసుకోమని చాలామంది చేత చెప్పించింది. ఆఖరికి ఏమందో తెలుసా?

టీ త్రాగి మళ్లా ఇంటివైపు బయలు దేరాం. అతను మాట్లాడుతూనే ఉన్నాడు. నా ఆలోచనలు నేను వేరే సాగిస్తున్నాను. ముకుందానికి వస్తుసేకరణలో పక్షపాతం లేదు. అతనికన్ని వస్తువులూ, ఉదంతాలూ, వ్యక్తులూ సమానమే. అన్నీ అతని వాగ్దేవిని సమంగా పురికొల్పి, సమమైన రీవితో ధ్వనులను ప్రసారం చేస్తాయి. భార్య మరణం, సరోజ పెళ్లి, గుర్నాధంగారి ఇల్లు, హాకీ ఆటలో రంగయ్యనాయుడు వోటమి, క్రికెట్లో సున్నం ఎక్కువ అవటం ఇవన్నీ అతనికి మహాకావ్యాలే. ఎక్కువ తక్కువలు లేకుండా వేదాంతిలా నిశ్చల మనస్కుడై వితర్కిస్తాడు. మౌనం యోగి తపస్సు. భాష, ధ్వని ఇతని తపస్సు. ఊహ ద్వారా ఒక ప్రపంచాన్ని శాసించాడు. ఆ జగత్తుకి అతను చక్రవర్తి. మనం అంతా అతనికి ప్రజలం. రాజుగారు మాట్లాడేటప్పుడు అందరూ నిశ్శబ్దంగా వుండాలి.

అతను చవి చూడని అనుభవం లేదు. లోనుగాని ఉద్రేకం లేదు. జయించని తృష్ణ లేదు; తరచి చూడని రహస్యానుభవం లేదు; కనని కల లేదు; ఆడని అబద్ధం లేదు. తెలియని సత్యం లేదు. రాజ్యవిస్తీర్ణం, సరిహద్దులు తెలియని చక్రవర్తిలాగా, భార్య మరణంతో అతను మానసికంగా పెట్రేగిపోయాడు. జీవితగమనం వేగం తగ్గి, నిదానంగా జరుగుతోంది. కాని అతనికి ఆరాటం, ఆవేదన వేగిరపడుతున్నాయి. ఏదో సిద్ధాంతం, సందేశం, జీవిత దృక్పధం అల్లి మనలందరినీ అందులో చిక్కించుకుని, స్థిమితపడదామని అతనికి తెలియని సంకల్పం లాగుంది. ఏదో భార్యపట్ల చిన్న అపచారం చేశాడు. దాన్ని తనకు తాను సమర్ధించుకొని, పోయిన వ్యక్తి క్షమాపణ పొంది, సమాధానపడటం కోసం ఈ వేగిరపాటు - ఈ శాస్త్రప్రయుక్త

వ్యక్తి స్వైర విహారం, యీ నాద బ్రహ్మ స్మశాన నృత్యం. ఈ వాగ్గేయకారుని చివరి ముక్తాయింపు.

"ఏమైందని అడగవేం?" అంటున్నాడు వెర్రివాడు. అతన్ని గూర్చిన ఆలోచనలు నన్ను వేదాంత శిఖరానికి చేరవేశాయి. ఏది ఏమైతే ఎవరిక్కావాలి? అనంత విశ్వంలోని ప్రచండ నిశ్శబ్దాన్ని, వొక్క మాటతో, వొక్క అర్ధశూన్యమైన ధ్వనితో ప్రాచీన ప్రశాంత గాంభీర్యాన్ని భంగపరుస్తున్నాడా వెర్రి మానవుడు.

పైకి మాత్రం 'చెప్పండి' అన్నాను.

"సరోజ నన్ను చేసుకోనని కచ్చితంగా చెప్పేసింది. ఎందుకనీ?" ఆమెకు నామీద ఉండబట్టేగా. తనకు నామీద ఉన్న ప్రేమని మరోలా ప్రకటించలేకపోయింది. అక్క బ్రతికి ఉన్నప్పుడు ఎంత గారాం, ఆప్యాయత, ఆదరణ, స్నేహం చూపిందనుకొన్నావ్. అది వెన్నెల రాత్రి. కళ్యాణి రంగమ్మగారితో గుళ్లో కెళ్లింది. అప్పడే క్లబ్బునుంచి వచ్చి స్నానం చేసి డ్రస్‌చేసుకుంటున్నా. గదిలోకొచ్చింది సరోజ. అద్దంలో నా మొహంకేసి చూసింది.

"నువ్వు ఆలయానికి వెళ్లలేదా" అని అడిగా.

"ఆ ప్రశ్న నేనే అడుగుదామనుకుంటున్నా - నాకేం కోర్కెలు లేవు" అన్నది

అంటే ? అన్నాను.

"పిల్లలు కావాలని వొక్క భార్యమాత్రం ప్రదక్షిణాలు చేస్తే చాలదు. నువ్వూ చెయ్యాలి" అంది. మంచి భర్తని ప్రసాదించమని నువ్వూ కోరుకోవచ్చుగా - అన్నాను దెప్పుతూ. నాకట్లాంటి కోర్కెలూ లేవు, నమ్మకాలూ లేవు అంది. అంతా మానవ ప్రయత్నమే గాని, దేవుడి ప్రమేయం లేదంటావు. నా నమ్మకాలు, ఆదర్శాలు, ప్రయత్నాలు, వాటి ఫలితాలు కాస్తంత ఈ అల్లుడి

# కాలచక్రం నిలిచింది

చెవిని పడెయ్యి. అన్నా వేళాకోళంగా.

'ప్రయత్నం చెయ్యనిదే నాకు పెళ్లికాదంటావ్!'

"పిల్లల కోసం మా ప్రయత్నం లాంటిదే అనుకోగూడదూ" అని తువ్వాలు భుజానవేసుకొని డాబామీదికి నడిచాను. నా సంభాషణంతా అద్దంలో సరోజతోనే. నాకేసి అదోలా చూసింది - అట్లాగనిపించింది. పది నిమిషాల్లో డాబామీదికి తనూ వొచ్చింది.

"కోపం వచ్చిందా ?"

"ఎవరి మీద?"

"నామీద"

"ఎందుకు ?"

"మొగాళ్లకెందుకు కోపమొస్తుందో నాకేం తెలుసు?"

"ఇంకా నాకే వచ్చింది కోపం అవునా?"

"ఎందుకో?"

"స్త్రీ మనస్సు తెలియ బ్రహ్మ తరంబా?"

"పోనీ తెలిసినంత వరకూ చెప్పు - భయంలేదు. రోడ్డువెంట చూస్తున్నాలే. అక్కయ్య రావడం లేదు" అన్నది. నాకు నిజంగా కోపమొచ్చింది. "అక్కయ్యంటే నువ్వు భయపడాలి - నీ మనస్సులో ఏదో వుంటే?" అన్నాను. సరోజకి కోపం వచ్చినట్లుంది. "అక్కయ్యముందు నీ అమాయకపు అవతారం నాకు తెలియదనా- అక్కయ్యకు తెలీదనుకోకేం - నా మనస్సులో ఏదో వుందిట. మహా కనిపెట్టావులే - నా మనస్సులో ఎవరున్నా, లేకపోయినా నువ్వు

మాత్రం లేవు" అని కిందికి వెళ్లిపోయింది. అది ప్రేమ కాకపోతే ఏమిటంటావ్?

ఇంటికి చేరుకుని వరండాలోకి కుర్చీలు లాక్కుని కూర్చున్నాం. భోజనానికి హోటల్‌కెళ్లడమా, కేరియర్ తెప్పించటమా అన్న ఆలోచన సాగనియ్యకుండా మళ్లీ మొదలెట్టాడు. ఇంక రాత్రంతా జాగారమే ! ఏ పరమాత్మకీ నాపైన కటాక్షం కలుగదూ! నేను మాట్లాడటం మొదలెడితే! ఒక యత్నం చేశా.

"చూడండి - మీరు సరోజపై మరి కొంత ఆప్యాయత కనబరిస్తే...."

చాల్లెండి సరోజ విషయం మీరెరుగరు. కొందరు స్త్రీలంతే. వాళ్లని తిట్టి, హింసించి, బాధపెట్టినవారినిగాని కనికరించరు. ఓ సారి....

ఇంక లాభంలేదు. ఆ యత్నం విరమించి, చంద్రుడికేసి చూస్తూ నా పగటి కలలు కంటూ కూర్చున్నాను. పగటి కలలు మానవ హృదయానికి స్వర్గం లాంటివి. నాకు క్రాస్‌వర్డ్ పజిల్‌లో ఇరవై వేలొస్తే ఎల్లా ఖర్చు పెట్టేదీ ఊహించుకుంటాను. సరోజను నే చూళ్లేదనుకోండి - వివాహమాడి ఉంటే నా జీవితం ఎల్లా ఉండేదీ ఊహించుకుంటాను. ముకుందం కబుర్లని కళ్యాణి ఎట్లా భరించగలిగిందో? ఆమె దగ్గర కూడా ఇల్లాగే మాట్లాడతాడా? ఆవిడ వింటుందా? ఇప్పుడు ముకుందం ఏమంటున్నాడో విందామని పగటికలని తుడిచేసి అతనికేసి చూశాను.

"మా ఆవిడంటుందీ - నేను తనదగ్గరున్నప్పుడు కంటే దూరంగా వున్నప్పుడు తనకి దగ్గరగా వున్నట్లు వుంటుందిట. అట్లాగంటుంది గానీ, దూరంగా వుంటే - ఎప్పుడొస్తారు? అని టెలిగ్రాంల మీద టెలిగ్రాం లిస్తుంది. దగ్గరగా వుంటే ఎప్పుడు వెడతాదురా బాబూ అన్నట్లుగా ప్రవర్తిస్తుంది - మీకూ అలాగే అనిపిస్తోంది కదూ?"

ఒక్కసారి వులిక్కిపడి కుర్చీలోంచి లేచాను.

"ఇంకా నయం - ఎంతమాట !" అన్నాను. ఇంక నాకు ఆ రాత్రికి మోక్షం లేదు. హాయిగా ఆయనకి లొంగిపోయి, ఆ ధ్వనిసాగరంలో పూర్తిగా మునగడం మంచిదనుకుంటూండగా, దైవం నాభక్తికి మెచ్చి, పరంధామయ్యని పంపించాడు. తుఫానులో రైలుదారక్క యిరుక్కుపోయిన వ్యక్తులలో పరంధామయ్య వొకడు. నాకు స్నేహితుడు, ప్రసిద్ధ రచయిత. ఆయన్ని ముకుందానికి ఒప్పగించి నేను కాస్తంత స్వేచ్ఛ పొందొచ్చు.

"పరంధామయ్య గారని- 'హాయిగొల్పే హానలులు' అనే యాత్రాగ్రంథం వ్రాసారు. అమెరికా, జపాను దేశాలు తిరిగొచ్చాడు" అని ముకుందానికి పరిచయం చేశాను. "అయ్యో



ఆయన్ని ఎరక్కేం... వెనకటికి వోసారి చెళ్ల పిళ్ల వెంకటశాస్త్రి గారికి సజ్జాపురంలో సన్మానం తలపెట్టారు. మా మావగారి తండ్రి అధ్యక్షులట..."

పరంధామయ్య హితం అనుకుని కారియర్ విషయం చూస్తావని బైటకొచ్చి నిశ్శబ్దంగా గాలిపీల్చానని రహస్యంగా ఒప్పుకుంటున్న స్వార్ధపరుణ్ణి.

బస్స్టాండు దగ్గరగాని మునలయ్యాకి చుట్ట కాల్చుకునేటందుకు సరైన స్థలం దొరకలేదు. అక్కడ దొరికాడు. తీసుకొచ్చి, క్యారియర్ యిచ్చి, హోటల్ కి పంపించాను. ఎనిమిది కావస్తోంది. పరంధామయ్య - సాహిత్య సభల్లో గంటలు గంటలు ఉపన్యసించే పరంధామయ్య ఆ ప్రవాహంలో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. నన్ను చూడగానే లేచాడు.

"ఇంతకీ యీయనెవరో పరిచయం చేశావు కాదు" అన్నాడు కాస్త కోపంగా. సమాధానం చెప్పే ప్రాప్తి నాకు లేదు. ముకుందం దొరకపుచ్చుకున్నాడు.

"నేనూ రచయితనే - వో వెయ్యి పేజీల గ్రంధం వ్రాశాను."

"ఎవ్వరూ చెప్పారు కారేం. అచ్చయిందా?" అన్నాను ఎల్లాగో సందు చేసుకొని.

"అంటే బుర్రలో రాశాను. కాగితం మీద వ్రాయడం ప్రారంభించాలి. చాలా పెద్ద గ్రంధం, రెండువేల పేజీలు పట్టొచ్చు. ఇంకా పేరు పెట్టలేదనుకో-"

"ఏం పేరు పెడితే బాగుంటుందంటారు?"

"విషయమేమిటో తెలిస్తే..." పరంధామయ్య గారి వాక్యం మరో లోకంలో పూర్తవుతుంది.

"అదే చెబుదామనుకుంటున్నా. మొన్న వ్యవసాయ శాఖవారికి పిటీషన్ పెట్టానా - నేనూ లాయర్నే ఐనా లా పదాలు వాడకుండా, అతి సులువైన, సరళమైన భాషలో వ్రాశానేమో - ఎందుకంటే మా మామ గారింట్లో వంటాయన శరభయ్యాకి కూడా ఇట్టే అర్ధమైంది. విషయం బోధపడగానే ముక్కుమీద వేలేసుకున్నాడు."

పరంధామయ్య దగ్గరుండడం వల్ల గాబోలు, కొంచెం ధైర్యం చిక్కి సందేహనివృత్తి కుపక్రమించాను.

"మీ మామగారింట్లో ఉన్నది వొంటలక్క గా" అన్నాను. ముకుందాన్ని పట్టీ వేయించానని గర్వపడుతూ.

"సరేలే - అవిడెప్పుడో వెళ్లిపోయింది. వెండి ముక్కుపొడుం డబ్బా, అరడజ నింగువ పొట్లాలూ తీసుకొని, నేనారా తీశాను. అత్తగారూ వాళ్లూ ఆడదాన్ని యాగి చెయ్యడమెందుకని వూరుకోమన్నారు. శరభయ్యాని కుదిర్చి పెట్టింది నేనే - వాడున్నాడే, వంట చెయ్యడంలో భీముడు. అతని చేతి భోజనం వొక్కసారి తిన్నట్లయితే పొట్టిశ్రీ రాములు యీనాటికీ జీవించే వుండును. నా గ్రంధంలో ఒక అధ్యాయం అతన్ని గురించే."

"మీరు వ్రాశే గ్రంథం స్వీయ చరిత్రన్నమాట...." "అసలు విషయం చెప్పనివ్వండి - చాలామంది చంపుగు తింటున్నారు. మీ చరిత్ర వ్రాయండని - నాకు తీరికేదీ? జీవించదల్చుగున్నవారికి గ్రంధరచన పడదేమో, వోసారి..."

భూకంపం ఏ ప్రాంతంలో, ఏ సమయంలో చెలరేగుతుందో ఎవరు చెప్పగలరు? పెద్ద బీటలు తీసింది. పరంధామయ్య నేనూ అందులో పడిపొయ్యాం - వో పావుగంట. తెప్పరిల్లి 'దాహం' అన్నాడు పరంధామయ్య - అని తనే లోపలికెళ్లాడు.

"శరభయ్య మాకక్కర్లేదంటే నాదగ్గరే అట్టే పెట్టేసుగున్నాను. పేరమ్మని నాదగ్గరే వుంచుగున్నాను- ఏం చెయ్యను. తెనుగు భాషలోపం - వుంచుగోక తప్పదు. చురుకైన పిల్ల. మొగుణ్ణి వొదిలేసింది - వాడే వొదిలేశాడనుకో - రంగం వెళ్లాడు. రాజకీయాలు వొదులుకున్నాను. ఆటలు పాటలు వొదులుకున్నాను. కృష్ణా రామా అనుకుంటూ, పొలం, తోట చూసుగుంటూ కడుపులో చల్ల..."

ఇంతలో 'బాబోయ్' అని లోపల్నించి పరంధామయ్య గావుకేక వేశాడు. తొందరగా వెళ్లాం. ఆయనకి తేలుకుట్టిందట. కాలుగట్టిగా అదిమిపట్టి, "మంద్రగబ్బేమో కాస్త చూడండి. ఇది మామూలు తేలుకాదు" అని బాధపడుతున్నాడు. నేను నాలుగు మూలలా చూస్తున్నాను. 'కనబడదేం?' అన్నాను. "నీకు స్వాగతం యిస్తూ ఎదురుగా వొస్తుంది మరీ - మందేం లేదూ? డాక్టరెవడూ లేడు?" అంటున్నాడు.

ముకుందం మళ్లా మొదలెట్టాడు. "ఓసారి పేరమ్మ కిల్లాగే తేలుకుట్టింది. దాని కెంత బాధకలిగిందంటే, "చూడు తేలుకుట్టిం దర్రోయ్", అని కేకేసింది. కాదు చీమన్నాను నేను. వెదకడం మొదలెట్టారు..."

"డాక్టర్ని తీసుకురండి - మంత్రం వెయ్యలేరూ... మీరిక్కడే వుండండి, డాక్టర్ని తీసుకొస్తాను." అని బైలుదేరాను. "నువ్వు తిరిగొచ్చేసరికి నా ప్రాణమే పోతుంది. ఉండు - నేనే వస్తాను."

నేను పరంధామయ్యని తీసుగుని బైటకెళ్లి వో రిక్షా మాట్లాడి అందులో ఎక్కాం.

"మీకు మంచి టైమ్‌లో అలారం మోగినట్లు - తేలుకుట్టిందండీ. లేకపోతే నారైలు తప్పను. ప్రొద్దున పదింటికి దిగాను. పది గంటలు లేటన్నారు. అంటే, ఎనిమిదింటి కన్న మాట. ఇపుడు పావుతక్కువ ఎనిమిది. కాబట్టి నాకు రైలందుతుంది. మనకి ఢిల్లీ ప్రయాణం తప్పదు. వోసారి నేను లాబర్ కమీషనర్ ఢిల్లీ ప్రయాణం కట్టాం. నాగపూర్ చేరేప్పటికి..." రిక్షా మలుపు తిరిగింది. ఓ జట్కా ఆపుచేయించి ముకుందాన్ని అందులో ఎక్కమని సెలవు తీసుకున్నాం. మమ్మల్ని తన వూరు ఆహ్వానించాడు. అల్లాగే అన్నాం. ఏదో చెబుతున్నాడు. జట్కా దూరంగా వెళ్లింది. రిక్షావాణ్ణి తిన్నగా హోటల్ కి పట్టమన్నాడు పరంధామయ్య.

## ఫిరోజ్ డిమాండు



ఫిరోజ్‌ఖాన్ ఎక్కువ మొత్తం డిమాండు చేస్తున్నాడట. కమల్ హాసన్ 'నాయకన్' చిత్రం ఆధారంగా నిర్మించిన ఫ్లాప్ చిత్రం 'దయావన్' తర్వాత ఫిరోజ్ మెహల్‌కుమార్ చిత్రంలో నటించేందుకు ఒప్పుకున్నాడట. ఒప్పుకోవటమే కాదు 18 లక్షలు డిమాండు చేసి నిర్మాత దగ్గర తీసుకున్నాడు మరి ఏం చూసి నిర్మాతలు యింత డబ్బు ముట్టచెప్పారో?

## కాలచక్రం నిలిచింది

కారియర్ యింటికొస్తుందిగా అన్నాను. ఇంటి కెడితే యీసారి నిజంగా తేలు కుడుతుంద న్నాడు పరంధామయ్య!

ఇది జరిగిం తర్వాత ముకుందాన్ని నేను కలుసుగోలేదు. అటు వెడుతూ ఓసారి పరం ధామయ్య, ముకుందం బంగళాని, తోటని చూసి, వో పూట భోజనం చేసి వొచ్చినట్లు వివరాలన్నీ వుత్తరం ద్వారా తెలియబరిచాడు. శరభయ్య వొంట అద్భుతంట. పేరమ్మ బ్యూటీట. రోజూ పదిమంది తక్కువుండ రట భోజనానికి. ఆయనకున్న పలుకుబడి, పేరు, అంతా శరభయ్య వొంట మూలం గానేట. అతని స్వీయ చరిత్ర క్లుప్తంగా నాలుగు గంటలు చెప్పాడుట. అది వినగానే తిన్నదంతా అరిగిపోయిందట. 'నా సంభా షణవల్ల జీర్ణం కాని పదార్థం లేదు' అని ముకుందం నిర్వచనం చేశాడుట.

అట్లాంటి ముకుందానికి ఎందుకు మతి భ్రమించి, పిచ్చాస్పత్రిలో వుండాల్సి వొచ్చిందో నాకు బోధపడలేదు. కొద్దిగా మానసిక శాస్త్రం నేనూ చదివాను.

సంసార సుఖం లేకపోవడం అతి వాగుడికి వో కారణంగా చెప్తారు. ప్రేమతృష్ణ మాటల ద్వారా తీర్చుగుని తృప్తిపడటం చిహ్నం. నాకిది సరైన కారణంగా తోచలేదు. కృత్రిమంగా వూహిస్తే ఏవేవో చిత్రమైన కారణాలు కల్పించవొచ్చు. జాడ్యం ఎంత కృత్రిమమైనదో, దానికి మందుకూడా అపూర్వంగా వుంటుంది.

గుడ్డివాడు విసిరిన బెడ్డలాంటిది. మానసిక శాస్త్రంలో మందు తగులుతే తగులుతుంది లేకపోతే లేదు. నే మొదట్లో అనుకున్న కారణమే నాకిప్పటికీ సమంజసంగా కనబ డుతోంది. ముకుందం మంచివాడు. స్వార్థ రహితుడు. జీవితంలో ఏదీ కోరకుండా, అన్నీ తెచ్చుగుని సర్వమూ వొదులుకున్న యోగి. విలువలు కట్టని విమర్శకుడు. సిద్ధాం తాలు అమాయక ప్రజనెత్తిన రుద్దని వేదాంతి.

అయినా అతని బారినుండి పారిపోవడానికి నేనూ యత్నం చేశాను. భార్య విసుగెట్టి ఇంక చాలు బాబు అనుకుని పరమ పదించింది. సరోజ పెళ్లి చేసుకోనంది. అందరూ అత న్నుండి పారిపోయి అతన్ని ఏకాకిని చేశారు. నా కళ్లంట అప్రయత్నంగా నీళ్లు తిరిగినై. పాపం అతనేం అపచారం చేశాడు? రెండు రూపాయలిచ్చి కర్నాటక విద్వాంసుడు, వయొలిన్, మృదంగం విద్వాంసులు కలిసి మూడు గంటలు ముమ్మొన యుద్ధం సాగిస్తే చూసి, విని "అహ, ఎంత అద్భుతంగా వుందండీ" అని చెప్పగోవడం లేదు? మనం ఖర్చుపెట్టిన రెండు రూపాయలనీ సమర్థించేటందుకుకాక, మరెందుకు మనం మెచ్చుగోడం? కానీ ఖర్చు లేకుండా ముకుందం మనకి వినోదం కలిగిస్తే ఏవగింపా? అతనికి పేర్లెట్టి హేళన చెయ్య డమా?

నీతిలో మెళకువయి తెలుసున్నవాడు ముకుందం, ఏనాడో భార్యకి అపచారం చేశాడు. దాన్ని ఎదుర్కొన్నాడు. తను సమాధానం పడలేకపోయ్యాడు. సంఘానికి చెప్పేసి, పాపపరిహారాని కుపక్రమించాడు మాటల ద్వారా, అదీ నాకు తోచిన కారణం. అతనా జీవితంలో దేన్నీ కోరడు. ప్రతిఫలం కోరని సంభాషణ-అతని మాట పడిపోయిం దంటే నాకీ ప్రపంచంలో ఏదో తీరనిలోటు కనబడింది. అతని భార్య కల్యాణి అన్నట్లు, అతను దూరంగా వున్నకొద్దీ దగ్గరగావొచ్చిన ట్లుంటాడు, దగ్గరగా వుంటే తప్పించుకు తిరుగుతాను. నాకు క్షమలేదు.

అతని జీవితంలో ఏదోలోటుంది. దాన్ని శోధించి ఎవ్వరూ బైటపెట్టకుండా అతను 'మాటలు' అనేవల అల్లుకున్నాడు. అతన్ని కదిపి మాట్లాడిస్తే అదేమిటో బైటపడును. కాని ఇప్పుడు ఆ అవకాశం లేదు. అతనికి మాటపోయింది. కాలచక్రం నిలిచినట్లయింది. దిగులుగా కూర్చున్నాను. "పోనీ వోసారి వెళ్లి

పై వారమే

ప్రత్యేక వ్యాసం

# జలుబు, దగ్గు, తుమ్ములు ఎందుకొస్తాయి?



## త్రాగుబోతు అనుపమ్

విభిన్న తరహా పాత్రలు పోషిస్తున్న అనుపమ్‌ఖేర్ 'డాడీ' చిత్రంలో త్రాగుబోతుగా నటించాడు. మహేష్‌భట్ నిర్మించిన ఈ చిత్రంలో ఖేర్ నటనకు మెచ్చిన న్యాయనిర్ణేతలు జాతీయ ఫిల్మోత్సవంలో ఒక ప్రత్యేక అవార్డును యిచ్చారట. పది నిరర్ధకమైన పాత్రలు చేయటం కంటే యిలాంటి ఒక మంచి పాత్ర, తాను మెచ్చిన పాత్ర చాలంటున్నాడు. ఈ చిత్రం ఎప్పుడు విడుదలవుతుందా అని ఎదురు చూస్తున్న అనుపమ్‌ఖేర్.

చూసిరాకూడదూ?" అంది మా ఆవిడ.

ఆ రాత్రే బెంగుళూరు ప్రయాణం అయ్యాను. హాస్పిటల్‌కి వెళ్లేప్పటికి సాయంత్రం నాలుగైంది. బైట ముకుందం తమ్ముణ్ణి కలుసుకున్నాను. అతను చెప్పాడు కొన్ని సంగతులు-పనిపిల్ల పేరమ్మ వంటా యన శరభయ్యతో లేచిపోయిందట. వాళ్లని వెదుక్కుంటూ తిరిగాడుట ముకుందం. పేర మ్మని రైలుస్టేషనులో పట్టుకున్నాడుట. ఇద్ద రినీ ఇంటికి రమ్మని బ్రతిమాలాడాట్ట, జీతం ఎక్కువ చేస్తానన్నాడుట. రానందిట. ఏవో వాగిందిట-అతని మామగార్ని , భార్యని, సరో జని-వాళ్ల కుటుంబాన్ని చులకనచేస్తూ మాట్లా డిందిట. లెంపకాయ కొట్టాడుట. మళ్లా ఏదో అందిట."నేనందుకు కావాల్సివొచ్చానా? ఇప్పుడనండి ఏమంటారో?" అని సవాల్ చేసినట్లు మాట్లాడిందిట. పళ్లు బిగబట్టి, మొహం ఎర్రగా అయి, చేతులతో రక్కేట ట్లుగా అభినయం చేశాట్ట. కాని నోటంట మాట రాలేదుట. ఇవన్నీ పేరమ్మ చెప్పిం దట.

జీవితంతో ఏదీ ఆశించని వాడికి అసం తృప్తి వుండదు. కోరింది లభించలేదన్న ప్పుడు వొచ్చే కోపం రాదు. ముకుందం ఉద్రేకాలకి అతీతుడు. కార్యశూరులు కోపా నికి గురవుతారు. అతను ఏకార్యం తలపె ట్టడు. చెయ్యడు, కోపం అంటే ఏమిటో ఎరగని అమాయకుడు. అట్లాంటి ముకుం దాన్ని పేరమ్మ రెచ్చగొట్టింది. కోపం తెప్పిం చింది. దాని తీవ్రతకి అతని శరీరం తట్టు కోలేక పోయింది. వ్యక్తిత్వానికి షాక్ తగి లింది. తేరుకోలేకపోయ్యాడు. 'మాట' అతని ఆయుధం. అతని ఆయువుపట్టు. దాన్నే సవా ల్ చేసింది పేరమ్మ, ఆయువుపట్టు మీద దెబ్బ కొట్టింది. ఊహాజగత్తు పేలిపోయింది. మాన సిక గోళాలు ఢీకొన్నాయి. వాటి మధ్య నలిగి కాలచక్రం నిలిచిపోయింది.

లోపలికెళ్లి చూశాను. దిగులుగా కూర్చు న్నాడు. పెరిగిన గడ్డంలో తెల్లవెంట్రుకలు న్నాయి, కళ్లక్రింద గీతలున్నాయి. జుట్టంతా చిందర వందరగా వుంది. పిచ్చివాడులా వున్నాడు. నన్నుచూశాడు. నా కళ్లల్లోకి లోతుగా చూశాడు. ఏమీ మార్పులేదు అతని ముఖంలో. మందహాసంలేదు. నేను ఫలానా అన్నా చైతన్యం లేదు. నాకు జాలేసింది. ఇల్లాగన్నాను.

"ముకుందంగారూ-మీరు జీవితంలో అన్నీ సాధించారు. వొక్కటే తప్ప, మౌనంగా, నిశ్శబ్దంగా వుండటంతప్ప అన్నీ సాధించారు. మీరు నిండైన, పరిపూర్ణులైన ధన్యజీవులు."

ఏదో చప్పుడైంది-సంకెళ్లు వూడినట్లు, సముద్రం వెనక్కివెళ్లి ఎండినట్లు, భూకంపం బీటలు మూసుగుని లోలోన అణగారినట్లు, కాలచక్రం వొక్కసారి కదిలినట్లు-

"ఆ-నేను మాట్లాడలేనంటారా? నేను మూగనా- నిశ్శబ్దమా-మౌనమా...ఎందుకు మాట్లాడలేను. వినడం చేతకాని వారికి మాట్లాడ్డం చేతకాదు. వారే మూగవారు. ఓసారి విజయనగరంలో అష్టావధానం జరిగింది. పదిమందీ పది ప్రశ్నలడుగుతారు. వారికి సమాధానాలు, గంట తర్వాత, క్రమంలో చెప్పాలి. నేనో ప్రశ్న అడిగాను, తికమకగా-కాకిగూటిలో చిలుక పిల్ల వుంటే తోడేలు చెట్టుకింద వున్నప్పుడు, పెద్దపులి అరుస్తే, భయపడేది, చిలుక పిల్లా, కాకా, తోడేలా-క్ర మంలో చెప్పాలి..."

అల్లా ముకుందంగారు యధావిధిగా తన ధోరణి సాగించారు. ఆయన మాట్లాడిన వాక్యానికి ప్రతిధ్వనిలేదు. వాక్యం ముగించి నప్పుడు కదా ప్రతిధ్వని వినబడేది? ఆ ముగింపులేదు-ఆ ప్రతిధ్వని లేదు.

ఈ కథలో ముకుందానికి అన్యాయం చేశానా ఎక్కడేనా అని తిరిగి చూశాను. ఒకచోట చేశాను. రైళ్లాగిపోయి, రెండో సారి నన్ను కలుసుగున్నపుడు. 'రండి టీ తాగొద్దాం' అని ముకుందం అన్నట్లుగా వ్రాశాను. అది పొరబాటు, అట్లా ముకుందం అనలేదు. అనడు. టీకీ, భోజనాలకీ, స్థూల జగత్తులో శారీరకావసారలకీ అతనికి టైము లేదు. వీటితో ఆ ఊహా సామ్రాజ్య చక్రవర్తికి నిమిత్తం లేదు. అతను హాస్పటల్‌లో వున్న ఆ వారం రోజులే కాలచక్రానికి విరామం.



విశాలాంధ్ర ఎడిటర్ శ్రీ సి. రాఘవాచారికి విజయవాడలో యిటీవల సి.వై. చింతామణి ఉత్తమ జర్నలిస్టు అవార్డు ప్రదానం జరిగింది. శ్రీ కె.ఆర్. రామ మోహనరావు, శ్రీ ఆలూరు సుభాష్‌బాబు, శ్రీ రాఘవాచారి, శ్రీ పురాణ వండ రంగనాధ్ చిత్రంలో వున్నారు.



అమలాపురంలో యిటీవల 'త్రివేణి' సంస్థ ఏర్పాటు చేసిన ఒక కార్య కమంలో "మహాభారతం- ధర్మసూక్ష్మాలు" అను అంశంపై ప్రసంగించిన బ్రహ్మశ్రీ ఎల్లాది చంద్రశేఖరశాస్త్రిని సన్మానిస్తున్న డాక్టర్ గుత్తుల దేవీ మీనాక్షి.



ఇటీవల రామచంద్రపురంలోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో జరిగిన కోనసీమ సైన్సుపరిషత్ మహాసభలో సైన్సు పరిషత్ అధ్యక్షుడు శ్రీ సి.వి. సర్వేశ్వర శర్మకు మెమెంటో బహూకరిస్తున్న కళాశాల సైన్సుక్లబ్ కార్యదర్శి శ్రీ పి. నరసింహారావు. డాక్టర్ చెలికాని స్టాలిన్, ప్రిన్సిపాల్ కె.వి. సూర్యనారాయణ, జిల్లా కామన్ పరీక్షల బోర్డు కార్యదర్శి శ్రీ జి. శరభయ్యలు కూడా ఫోటోలో వున్నారు.

# అపీ
# ఇపీ
# అస్పీ

## క్రోక్విల్ అకాడమీ కార్టూన్ పోటీల ఫలితాలు

'నేటి మన పాఠశాల జీవితం' అనే అంశంపై హైదరాబాద్ లయన్స్ క్లబ్ - ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ అకాడమీల సంయుక్త ఆధ్వర్యంలో ప్రముఖ కార్టూనిస్టు శ్రీ శంకర్ 88వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని జంటనగరాల్లోని 15 సంవత్సరాల బాలబాలికలకు కార్టూన్ల పోటీ యిటీవల హైదరాబాద్‌లో నిర్వహించబడింది. ఈ క్రిందివారు ఈ పోటీలో విజేతలుగా ఎన్నికయ్యారు.

**సీనియర్స్ (11-15సంవత్సరాలమధ్య)**

మొదటి బహుమతి - జుబిన్ ఆర్. వకీల్ (సికింద్రాబాద్),

రెండవ బహుమతి - కె. ఆర్. లక్ష్మి (హైదరాబాద్),

మూడవ బహుమతి - ఆదర్ష్ (హైదరాబాద్),

కన్సొలేషన్ బహుమతి - బి. ఆనంద్ కిషోర్ (హైదరాబాద్)

**జూనియర్స్ (6-10 సంవత్సరాల మధ్య)**

మొదటి బహుమతి - జి. శ్రవంతి (హైదరాబాద్),

రెండవ బహుమతి - నజియా అజీజ్ (సికింద్రాబాద్),

మూడవ బహుమతి - జెబామసూద్ (హైదరాబాద్),

కన్సొలేషన్ బహుమతి - వి. సంతోష్‌కుమార్ (హైదరాబాద్)

# సినిమాదొంగలు

గోపాలకృష్ణ


















# వీక్లీ పోస్ట్

( 4 వ పేజీ తరువాయి)

## దివ్య

ముఖచిత్రం 'దివ్య'తో వచ్చిన ఆంధ్రపత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది. సీరియల్స్ చాలా బావున్నాయి. 'హలో డాక్టర్ నేనేం చెయ్యాలి' శీర్షిక వల్ల ఎన్నో సందేహాలు తెలుస్తున్నాయి.

- చేగొండి రమేష్, పాలకొల్లు

## శీర్షికలు

10-8-90 తేది పత్రిక చూసిన తరువాత ఎంతో నిరాశ కలిగింది. ఈ మధ్య తెచ్చిన మార్పులన్ని ఒకటొకటిగా ఆపేస్తున్నారు. సాహితి పజిల్ లేదు. టిట్ ఫర్ టాట్ లేదు. ఫొటో వ్యాఖ్య లేదు. ఇవన్నీ ఎందుకు మానేసినట్టు?

కె. రామారావు

త్వరలో నేతిరిగి ప్రారంభిస్తాము.

–ఎడిటర్

## అభినందనలు

17-8-90 సంచికలోని సరస్వతి పూజ స్తోత్రం చదివి ఆనందించాను. మన పత్రికలోని గొప్పదనం అదే- సంస్కారవంతమైన రచనలను ప్రచురించటంలో- చాన్నాళ్ల నుండి, గౌరవ ప్రధంగా వుంటున్నది. ఈ శుభ సందర్భంగా (జన్మదినం) ప్రత్యేక అభినందనలు!

- కె. సి. బాబు, నెల్లూర్-2

## బౌద్ధ మీమాంస

దివ్య ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సంపాదకీయంలో "అయోధ్యకాండలో బౌద్ధ మీమాంస"లో, అసలే రామజన్మభూమి- బాబ్రీ మసీదు సమస్యగా నలుగుతోన్న అయోధ్యలో రామాలయం నిర్మాణ సమస్య. ఇప్పుడు క్రొత్తగా బౌద్ధ మతస్థులు ముఖ్యంగా శ్రీమతి అంబేద్కర్ అయోధ్య అసలు పేరు 'సాకేత'పురి అని ఆ ఆలయం (మసీదు) తమ దేవుడిదేననీ క్రొత్త ఉద్యమం లేవదీయడం గురించీ, సమస్య ఆ రోజుకా రోజు జఠిలం అవ్వడం గురించీ చక్కగా వివరించారు. ఆంధ్రపత్రికకి సంపాదకీయం హైలైట్‌గా వుంటోంది' అభినందనలు! వింబుల్డన్ జూనియర్ ఛాంపియన్ 'లియాండర్‌పేస్' గురించిన వ్యాసం సూపర్బ్! శ్రీవరలక్ష్మీ ప్రేక్షకులని ఆకర్షించిన తెలుగు చిత్రాల 'అమ్మ' కన్నాంబ గురించిన వ్యాసం ఎంతో బావుంది! అభినందనలు తెలియజేస్తున్నాను.

-సి రవితేజస్వి, చింతలూరు, ఆలమూరు మండలం

## నూటపదార్లు

17-8-90 సంచికలో ప్రశ్నావళి జవాబులో నూట పదహార్లు, అర్థ నూట పధహార్లు- ఎలా వాడుకలో వచ్చాయి అన్న ప్రశ్నకి, జవాబు సరిగా లేదు. పూర్వం అంటే రూపాయలు లేని కాలంలో, వరహాలు వాడుకలో వుండేవి. ఒక కట్నం రూపేణా యివ్వదలచినప్పుడు, కనీసం నాలుగు వరహాలు యిచ్చేవారు. రూపాయలు వాడుకలోనికి వచ్చాక ఒక వరహాకి వెల నాలుగు రూపాయలు. అంటే రూపాయల్లో పదహారు రూపాయలు కట్నంగా యిచ్చేవారు. అలా అలా నూటపదహారు, అర్థనూట పదహారు అని వాడుకలోనికి వచ్చాయి. ఇది చరిత్ర శాస్త్ర ఆధారం గలది.

మన ఆంధ్ర పత్రికలో వ్రత పూజా విధానాలు విరివిగా వేయడాన్ని, విమర్శలు ఎదురవుతున్నాయి. ముఖ్యంగా పురోహితులు ఆందోళన పడుతున్నారు. ఎవరి వృత్తి వారిదిగా వుండాలి గాని మా వృత్తిలోనికి పత్రికలు కలుగ చేసుకోవడం ఆక్షేపణీయం- అని అంటున్నారు.

-జి. ఎ. ఎల్. ఎన్. స్వామి, బరంపురం-2

